# ఆరుద్ర రచన

## కవితలు

(విపుల సంకలనం)

1985




క్వాలిటీ పబ్లిషర్స్

రామమందిరం వీధి • విజయవాడ 2

# ముందు మాట

నా షష్టిపూర్తినాటికి నా కవితల విపుల సంకలనం వెలువడితే బాగుంటుందన్న ఉద్దేశానికి ప్రోద్బలం ఇచ్చినవారు మిత్రులు చెరుకూరి ప్రకాశరావు (మహీజా పిక్చర్స్ అధిపతి) గారు. ప్రకాశకులుంటేగాని కవితల ప్రచురణ సుఖసుఖాల జరిగే పనికాదని తెలిసికూడా వ్యవధి తక్కువ. కాబట్టి వ్యయం బెడదకు భయపడవద్దని ముద్రణ ప్రారంభింప చేసి రంగంలోనికి దింపినది ఆయనే.

ఉత్తేజం కలిగినప్పుడు కవితలు రాసుకొంటూ, వృత్తివల్ల సినిమా పాటలు అల్లుతూ ప్రవృత్తివల్ల పరిశోధనలు చేసుకొనే నాలాంటివాడు పుస్తకాల విక్రయానికి తలపడితే మునిగిపోతానని ముందుకు వచ్చి ఈ సంకలనం ప్రచురణ భారాన్ని తమమీద వేసుకొన్న విశాల హృదయులు నా చిరకాల మిత్రులు కప్పగంతుల మురళీకృష్ణగారు.

నన్ను ఆదుకొని నా కవితలు (విపుల సంకలనం) నా షష్టిపూర్తి నాడు ఆవిష్కారం అయ్యే అవకాశం కల్పించిన ఈ ఇద్దరు ముఖ్య మిత్రులతోబాటు దీనిని సకాలంలో ముద్రించి సహకరించిన కృష్ణచిత్ర ప్రింటర్స్ బ్రహ్మాండం శ్రీ నరసింహారావుగారికీ వారి కుమారులకూ నా కృతజ్ఞతలు.

నా దొరకని పద్యాల నకళ్లు కొన్ని పంపిన శ్రీ కె.వి. ఆర్ కు థాంక్స్.

త్యాగరాయ నగరు<br>1 సెప్టెంబరు 1985

ఆరుద్ర

# విషయసూచిక


| | | పుట |
|---|---|---|
| 1. | పురోగమనం | 1 |
| 2. | లోహ విహంగాలు | 2 |
| 3. | విజయ విహారం | 6 |
| 4. | పీర్ల గుండం | 7 |
| 5. | గుండె బేజారై | 9 |
| 6. | అప్పలస్వామిగారూ! | 11 |
| 7. | కావాలి సమిధలు కావాలి | 13 |
| 8. | మార్చ్బన్ | 15 |
| 9. | సందేశం | 17 |
| 10. | చోబుదార్ గల్లీపిల్ల | 18 |
| 11. | పేరాస | 22 |
| 12. | గోదారి గోతులు | 24 |
| 13. | మరణ శాసనం | 30 |
| 14. | నా పాటలు | 31 |
| 15. | వేకై | 35 |
| 16. | జేళ్లా కంపం | 37 |
| 17. | తూర్పు | 45 |
| 18. | జోల పాట | 48 |
| 19. | ప్రేయసి | 50 |
| 20. | కలత | 51 |
| 21. | సంసార పతంగా | 52 |
| 22. | పోరాటం | 54 |
| 23. | ముందున్నది | 56 |
| 24. | చక్కదనం | 57 |

| | | |
|---|---|---|
| 25. | భూతపు గోళ్ళు | 58 |
| 26. | పీర్ల గుండం–2 | 60 |
| 27. | అవలీలగా | 61 |
| 28. | నవోదయం | 63 |
| 29. | నేనూ — కాఫ్కా | 67 |
| 30. | రాజూ — మంత్రి | 69 |
| 31. | సత్యం, సమ్మె, సానిపిల్ల, సాహిత్యం | 73 |
| 32. | రాక్షసుని స్వగతం | 77 |
| 33. | సింహ కన్యలు | 79 |
| 34. | తులం వృశ్చికం | 81 |
| 35. | మాతృకాంక్ష | 82 |
| 36. | పిలుపు | 89 |
| 37. | మళ్ళీ యుద్ధం | 92 |
| 38. | ఓపెన్ ఫైర్ ! | 97 |
| 39. | ఛలో నౌజవాన్ | 100 |
| 40. | తెలుగు సుబోత్నిక్ | 102 |
| 41. | ఆగస్టు పదిహేను | 105 |
| 42. | వెయ్యివోల్టుల కవిత్వం | 107 |
| 43. | చైనా | 110 |
| 44. | రేపు | 112 |
| 45. | కన్నీటి పాట | 113 |
| 46. | వోటు పాట | 114 |
| 47. | విజయవాడ పౌరులార ! | 115 |
| 43. | పగటి చుక్క | 119 |
| 49. | ఇదీ దారి | 120 |
| 50. | జిందాబాద్ | 123 |
| 51. | ఉద్యమ నాయికా ! చదువుకో: | 124 |

52. ఎంచక్కని కల... 126
53. శ్లోకాల బాకాలు 130
54. వేదనా – చింతనా 132
55. మీటల పాట 135
56. ఒకటో ఎక్కం 136
57. ఒకటో ప్రేమగీతం 139
58. ఒక్కా ఓ చెలియా! 140
59. రెండూ రోకళ్ళా 142
60. మూడూ ముచ్చెలుకా 143
61. నాలుగు నందన్నా 145
62. అయిదూ చిటిగోలుసూ 147
63. ఆరుందారాలు 149
64. ఏడుం బేడీలు 151
65. ఎనిమిది మనమందా 153
66. తొమ్మిది తోకుచ్చు 155
67. పదీ పట్టెడా 157
68. శ్రీశ్రీ ప్రస్థాన గీతి 159
69. కునాయక నింద 161
70. అణువు రాణువ 163
71. అభ్యంతరం 166
72. పితౄణము 167
73. మంత్రపుష్పం 168
74. చెప్పూ! చూద్దాం! 172
75. కుక్క చంపిన బిడ్డ 173
76. బహు పరాక్! 177
77. ముచ్చటైన విందు 178
78. తస్మాత్ జాగ్రత 179

79. జ్యోతిర్గతి 180

80. కొత్త సద్దలి 182

81. రాఘవా స్వస్తి! రావణా స్వస్తి! 189

82. పుట్టిన రోజు 192

83. గమోపాఖ్యానం 194

84 ఎడబాటు కాటు—1 195

85. ఎడబాటు కాటు—2 197

86. అల్విదా! అల్విదా! 199

87. జాతీయం 201

88. అంతర్జాతీయం 208

89. కాస్మికీయం 210

90. ఓహో! 215

91. థాంక్యూ బేబీ! థాంక్యూ! 216

92. ప్రాచీన స్వైరిణి 218

93. తప్పకుండా 222

94. గ్రంథక్రిమి స్వాగతం 227

95. లిటరేచర్ 232

96. స్ఫూట్నిక్ టెక్నిక్ 235

97. కొత్త విజయాలు 237

98. నడుస్తున్న చరిత్ర 239

99. కొత్త ఒరవడి 240

100. కన్యాకుమారి 242

101. కవితాధరుడు 246

102. ఓహో! 248

103. అన్న తమ్ముని యింట పగవాడా? 249

104. సామ్య వాదం 253

105. చచ్చీవాడికి సలహా 260

106. నీ పద్యం నిరవద్యం 261
107. విప్లవ సౌభాగ్యం 263
108. పిలుపు 269
109. అన్వేషణ 271
110. జై — జై 277
111. ఏటికేడాదీ 278
112. అసహనావవతు 283
113. తీరని కోరిక !! 284
114. పెద్ద కావ్యంలోంచి చిన్నపద్యం 285
115. ఆ–ఆ–ఆరుద్ర గీ–గీ–గీతం 286
116. భళారే 287
117. దివ్య సంధ్య 289
118. ఆశ 292
119. దారిద్ర విద్రావణం 293
120. తెలుసుకో 298
121. ప్రశ్న 299
122. తప్పదు 300
123. కోరిక 301
124. చివరకు మిగిలేది 302
125. పచ్చి పిచ్చి 303
126. తన్మయం 304
127. తథ్యం 305
128. అంతే! 306
129. ఔనా ? 307
130. ప్రార్థన 308
131. విలువ 309
132. అగ్రతాంబూలం 310

133. కదులు 316
134. ప్రకృతి 317
135. జోస్యం 318
136. విరూఢం 319
137. పద్యం కాని పద్యం 320
138. పెద్ద విషయం మీద చిన్న పద్యం 321
139. రాక్షస విజయం 322
140. విభావ కవిత్వం 327
141. కదిలించకు లోహ విహంగాలను 329
142. ప్రగతి 330
143. జైల్లో చంద్రిక 335
144. ఉదకం నా పథకం 336
145. కన్నీటి పాట 341
146. చేదు సత్యాలు 343
147. అకటా! అకటా వికటం 347
148. చెప్పొంచీ దేమిటంటే 349
149. వెళ్ళు — మళ్ళా రాకు 351
150. ఇంక్విలాబ్ జిందాబాద్ 357
151. కుందుర్తీ! నీకోసం ఇది నా వచనపద్యవ్యాసం 359
152. నూతన కాలజ్ఞానం 364
153. జయహో! 367

# పురోగమనం

జయజయధ్వానాల
విజయ నాదాలతో
ఆకాశ మార్గాలలో
అవని చీకట్లలో
        బావుటా ఎగరేసి –
        కాగడా వెలిగించి –
నీలాల నింగిలో
ఎఱ్ఱ జెండా తోడ
ఎఱ్ఱ జెండా తోడ
నీలాల నింగిలో
        కదలవే కదలవే
        కొత్త మార్గాలకై
విశ్వవీణారవపు
విజయ గానమ్ములతో
విజయ శంఖానాద
విశ్వ గీతమ్ములతో
        కొత్త మార్గాలపై
        కొత్త మార్గాలకై –

(దీపిక — 1942 కన్నముందు.)

# లోహ విహంగాలు

ఏప్రిలురో తారీఖున
విశాఖపట్నానికి
రెండామళ్ళ దూరంలో వుంటున్న
బుచ్చిరాజుపాలెం గ్రామంలో
పదిగంటల పగటివేళ 'బాల భోగం'బు
పుష్టిగా ఆరగించి
సుషుప్తిన్ చెందాను

రెండు గంటలయినసర్కి
ఎండ ప్రచండంగా కురుస్తోంది —
తెలివొచ్చెను మా కుటీరానికి
అనతి దూరాన సమానాంతరంగా
పయనిస్తున్న గగ్గోలచేత
కళ్ళు నులుపుకొని వొళ్ళువిరచి
ఆవులించి వీక్షించాను.
"ఏమా పరిగెత్తే ఆందోళన" అని
అంటున్నాయి గొంతులు రకరకాలుగా
"విశాఖ'పట్నం నీ బతుకిక చూడలేమ"ంటూ

వెలిసిందట! అప్పుడే విశాఖపట్నంపై వర్షించిన బాంబువృష్టి!
"ఓహో ఏమిటీ జీవప్రవాహం"
యంత్రాలమాదిరి మనుష్యులు
ప్రాణాలు పిడికిట పెట్టుకొని
గుండెలు చేపట్టుకొని

బలుసాకును వెతుక్కుంటూ
బతుకు బాటపై (క్కిరిసి
భుజాలు రాసుకుంటూ ఉన్మాదంతో
పోతున్నారు రాసుకుంటూ పొత్తుకుంటూ!
అయ్యో
'అసూర్యం పశ్యలు' హాయిహీలుయానలు గూడున్న గవునలు
సయితం
(టంకులు మోసుకొంటూ, దూసుకొంటూ
దారిచేసుకొంటూ, కొన ఊపిరి పీల్చుకుంటూ
నడుస్తున్నారు!
బూర్జువాలు, భూకామందులు పోకిళ్ళాలు కూడా.
కాస్తో కూస్తో డబ్బున్నవాళ్ళు వెళ్ళిపోయారట!
మోటార్ల, జట్కాల, సైకిళ్ళపైన
తమ తమ కుటుంబాలను
ఈడ్చుకుంటూ వెళ్ళిపోతున్నాయి రిక్షాలు

కట్లు తెగిన, గట్లు తెగిన
బతుకు కాల్వనీరు పొంగి
పారుచున్నది మనుష్యుల వరద!
తరంగాలు తరంగాలుగా పైకుబ్బి
(టంకురోడ్డును ముంచెత్తేస్తున్నది.
మిలియన్ల ఉప్పెన
"పేనికా నలమ్" మానవాళిలో రగుల్తున్నది.
మరిడమ్మా, అసిరమ్మ, అడేదో
(గామదేవతలకు లంచాలను
మేపుతామని వాగ్దానం చేయుచున్నారు

తమకు కావలసిన వారంతో
ప్రాణాలతో బైట పడాలని—
మొక్కుచున్నారు ఇలవేల్పులకు

చేతులు పీకుతున్నా
నూతులు ఖాళీ చేసి
డెత్ కన్య కరాళ విషాధర కార్చిచ్చుకు
ఆహుతయినా అవని ప్రాణాలకు
దయార్ద్ర హృదయులు మా గ్రామస్థులు
చేయుచున్నారు అమృతప్రదానం
పోయుచున్నారు మంచినీళ్ళు

విరామంలేని తపాలా రన్నరు
కాలం పరిగెత్తోన్న కొలదీ
వాడిన ముఖాలు గబగబా
నడుస్తున్నాయి చెమటల్తో...

అయిదు గంటల వేళ!
మళ్ళా
ఏరాడ కొండదిశ పూర్వపు గగనాన్నంటి
రెండు బారుల్లో ఎగురుతున్నాయి
పాపాల పుట్టలు జెపాను పిట్టలయిదు
నా ఆకర్ణాంత విశాల చక్షులన్
టెలిస్కోపుల చేసుకొని పరికించుచున్నాను
నే పుట్టి పెరిగిన విశాఖపట్నపు 'మరణం'
విశాఖ విశాలాకాశాన్ని
చంక్రమణం చేయుచున్నవి నా సోదర

అక్కుపక్షి గాళ్ళమీద ఆ
ఉక్కుపక్షులు రెట్టల కురిపిస్తూ
రెక్కల విదిలిస్తూ
కారుమేఘాలలో మోటారు కారుల మాదిరి
నాకన్నుల నమ్మలేను

ఎర్ర కిరసనాయిలుతో వెలిగించబడ్డ
జాబిల్లి
వెన్నెల వల పన్నే వేళ
వస్తాడట జెపానువాడు!
బే ఆఫ్ బెంగాలులో ఉన్నాయట
మృత్యువుకు టిఫిన్ క్యారియర్లు
ఎన్నో– చాలా– ఎయిర్‌క్రాఫ్టు కారియర్లు
నిశ్చయంగా కచ్చితంగా
తింటాడట!
షిప్ యార్డును లోకోషెడ్డును
విశాఖ'పట్నాన్ని.

విజయనగరం
1942

# విజయ విహారం

ఎండిన దేహాల
మండిన హృదయాలకు

చెయ్యండ్రా రక్తప్రదానం
పొయ్యండ్రా వీరామృతం

ప్రపంచమంతటా
ప్రజలను లేపి

చీల్చండ్రా శత్రు సమూహాల
పీల్చండ్రా వారల జీవం

భూగోళపు
టంచులమీద

తియ్యండ్రా రక్త చందనం
పుయ్యండ్రా వీరుల మెడలకు—

తెలుగుతల్లి–1943

# క్షీర గుండం

కేకేసి దూకండి
ఈ అగ్నిలోన;
ఈ వేడి కన్నీళ్లె
మన చెమట బిందువులె

ఈ బాధనాపాలి
ఈ మంట నార్పాలి
కేకేసి దూకండి ...

రివ్వురివ్వున ఎగిరి
కష్టాలడేగ
మన నెత్తిమీదున్న
పండు తన్నుకుపోవు

దూకండిలే వేవేవేగ
ఈ చిచ్చులోన ...

లోకాని కీనాడు
పురుడు పొయ్యాలి
ఆనంద బాలుడికి
బొడ్డు కొయ్యాలి

ఊదండి గట్టిగా
ఈ కొలిమితిత్తి

ఇది కష్టమే గాని
ఇక మీద మనకు
ముళ్లులేని గులాబి
పువ్వు దొరకొచ్చు

ఉరకండి గబగబా
ఈ నెగడిలోన ...

పరమపద సోపాన
పఠములో మాదిరిగ
పెనుపాము లుండొచ్చుగాని

గుండాన నడవండి
ఆలస్య మొద్దు...

ఈ కోననాడూ
ఆ సీమనాడూ
యిద్దరం ఒకటిగా
మార్చవుతు పోదాం
కెరటాలు కెరటాలుగా

దూకండి దూకండి
ఈ అగ్నిలోన...

రిసాల్‌పూర్
సెప్టెంబరు-1943

# గుండె బేజారయె

ఇదేం బతుకు పోనిద్దూ
పోనిద్దూ ఏం సుఖం
ఎటు చూస్తే అటు మోసం
దయ్యాల్లో భూలోకం

దూరాభారాన్నుండే
పిల్లా జెల్లా పెళ్ళాం
రూపాయికి మూడు శేర్ల
తిండెట్లా తింటున్నారో

గడ్డీ గట్రా మేసే
గాడిదలే నయంకదా
ఏమంటావ్? అది సైతం
యుద్ధంలో
మనలాగే సైనికులా?

ఏబీసీడీ రాని
ఎన్‌సీవోలుంటూ ఉంటే
ఎన్నో యోగ్యతలున్నా
ఎ. మ్మే. ట్రేడేమిటి మనకి

జననష్టం తప్పనిసరి అని
నర రక్తం ఈదాలంటావ్
ఓ మూలాని దుఃఖం ఉంటే
చిరునవ్వు ధరించాలంటావ్

ఏమయినా మార్చనమంటావ్
ఎట్లాగో భరించమంటావ్
ముందేదో వెల్తురు ఉందని
గుర్తిస్తూ శ్రమించమంటావ్

కానైతే
ఏం బ్రతుకు
ఏం సుఖం
ఎందుకు స్వామీ?
యుద్ధం?

**రిసాల్‌పూర్**
**సెప్టెంబరు–1943**

# అప్పలస్వామిగారూ

ఒకచే విక్టరు హ్యూగోని ధరించి
రెండో హస్తంబును మీ అర్ధలాల్చీ టక్కిన
ఫుల్ పేంటు పాకెట్టునుంచి
ఊగాడుతూ
కోణిస కోవిల వీధులంగమించి
పార్కేమీకు నమస్కారములు
అప్పలస్వామిగారూ!

అది మీ మస్తిష్కం
అందు నాకు కనంబడును
శతాబ్దాలను దాసుకొని మానవుడు
మరచిపోవు విషయాలను జాగ్రత్తగా
జాగ్రత్తచేసే నిత్యం పారు
సెలయేళ్ళు పుస్తకాలు పుస్తకాలు.

అందు నాకు కనంబడును
ఛాసరునుండి బార్కరుదాకా

రాసిన పజ్యాలు
అందు నాకు కనంబడును.
షేక్స్పియరు మబ్బులమధ్య సైకోరాక్సు రంగు
పౌడరుపూసుకొన్న హేమ్లెట్ రాజు భూతం
సుకవి కీట్సుకవి సర్వదా ఆనందకరపు
అందాల వస్తుజాలం,
షెల్లీ మరణించిన ఏడోనైజు చిరునవ్వు
దోమతెరలలో శశాంక మొగం.

డబ్లిన్ వీధుల్లో కెప్టాను లేని పడవలాగ
గమ్యస్థానం లేకుండా తిరిగే జాయిస్
లియోపాల్డు బ్లూము
కనంబడును కనంబడును.

టాగూరుకవి కళ్ళు శ్రీ శ్రీ ఒంటరి ఒంటె కంటక
కిరీటధారి కృష్ణశాస్త్రి ఊర్వశి

ఇంకా ఏమేమి ?
చెప్పలేను — చెప్పలేను
నా మేధస్సున ప్రతిబింబించిన మీ మెదడే నాకు కనంబడును.

జీవిత స్విమ్మింగ్ పూల్లో ఈదిందికి ముందు
కళాశాల షవర్ బాత్ తీసుకునే కుర్రాళ్ళకి
దాచుకున్న డబ్బులగవి లైబ్రరీలో
కూర్చుని పాఠాలు చెప్పే—
కాలేజీ కుర్రాళ్ళకు సాధించబడని
గణిత శాస్త్ర విషయాల్లాగా
మన సిటీ క్లబ్బు వెనక సగమెండి సగమెండని
బయలు లాంటి బాల్డుహెడ్ లాయిడ్ జార్జి
S. S. గారితో విజయనగర వీధుల్లో నడిచే—
తన ఎర్రని రంగు హస్తాల్లో టి. యస్. ఇలియట్
మెకావిటీ పిల్లి లాంటి అల్లరి పిల్లాడు తలకెక్కిన
సోమయాజితో వాదులాడే—
అప్పలసామిగారూ!
నమస్కారం.

రిసాల్‌పూర్
అక్టోబరు-1943

# కావాలి సమిధలు కావాలి

అనుమానపు పెనురెక్కలు విదిల్చి
అని భూతము ఎగిరెను భువమున

జనమేజయుని యాగం లోపల
కోరికల సర్పాలు గింజుకొని
గింజుకొని మెలికలు మెలికలు
తిరిగి నాలికలు పీక్కొని
పడిపోతున్నాయి వీలులేక

బతుకంటే విసిగిపోయి విధిలేక
బరువు దింపుకొందికి అవకాశం లేక
బాధితుడు యుద్ధంలో చేరేను

పుట్టిన చోటుకు దూరంగా
పాత పాత ఆచారాల
కొత్త కొత్త ఆకారాల
ఏమో తెలియని దేశంలో
ఊరికి దూరంగా
కొండల్లో అడవుల్లో
ఒంటరిగా మంది మధ్య
దండు బతుకు దండుగ్గా
పొద్దున్నే నిద్ర లేవడం
మధ్యాహ్నం నిద్రపోవడం
సాయంత్రం బేజారవడం

రాత్రంతా కలలు కనడం
ఒంటె బతుకు
గ్రామఫోను జీవితం

వేగంతో కాలం గబగబా
పరిగెడుతుంది
తూర్పువాడు పడమరకి
దక్షిణంవాడు ఉత్తరానికి
పేకాటలో లాగ ఇక్కడి
ముక్కలక్కడికి

బాధల కురుపులు
అరచిన అరుపులు
వినిందికి లోకానికి తీరుబాటు
లేదంటే లేనేలేదు

బతుకు పత్రికలో
ప్రకటన :
ఇది మహాయజ్ఞం
కావాలి! కావాలి
సమిధలు కావాలి!

రిసాల్‌పూర్
సెప్టెంబరు–1943

# మార్చ్

ఏమర్రా బానిసలారా!
లేవర్రా బాధితులారా!
మీరే ఒక పట్టు పట్టితే
మీరే ఒక కట్టు కట్టితే
పట్టేందుకు పగ్గాలుండవు
కొట్టేందుకు కొరడాలుండవు
లేవర్రా అనాథలారా
ఏమర్రా అశాంతులారా

నిట్టూర్పుల వంతెన మీదుగ
కష్టాలను దాటేకాలం
ఐపోయిం దెళ్ళిపోయిందని
చాటర్రా ఏక గొంతుతో
శ్రమఘర్మ సలిలంపోసి
పండించిన సుఖాల పంటకు
కోతలు మనవే అంతా
సిద్ధంగా ఉన్నాయర్రా!

రష్యాలో మీమీ అన్నలు
చైనాలో మీమీ తమ్ములు
బ్రిటనమెరిక దేశాల్లోపలి
జన క్షేమం కోరే శక్తులు
అభ్యుదయ పథాన్ని పట్టి

లక్ష్యానికి దగ్గర పడుతూ
భవిష్యముకు మెరుగులు పెడితే
కలతలతో నిద్దురపోయే
ఢిల్లీలో పాకీవాడా
లాహోరున టాంగా వాలా
బొంబేలో మరపని వాడా
కలకత్తా చీకటిమనిషీ
మదరాసున టేబిల్ క్లీనర్
ఏమర్రా అశాంతులారా!
లేవర్రా అభాగ్యులారా!

తలరాతా కర్మంకాదు
గుడి లోపల దేముడు లేడు
సిలువ వతనికి చిహ్నం కాదు
నమాజు చెయ్యక్కర్లేదు
మంటలలో మనిషున్నాడు
చిచ్చార్చే యోచన చేస్తూ
మన లక్ష్యన్నందు కొందికి
ఆ స్వర్గం చేరేటందుకు
సంకెళ్ళను పటుక్కున తెంపి
నడవర్రా మానవులారా!

రిసాల్ పూర్
సెప్టెంబరు-1943

# సందేశం

వరాల మూట మీ కోసం
తెస్తున్నాము
అనాథలారా మీరంతా
అందుకో రండి
మీ రక్తం మీ కష్టం
లోహాలండీ
మా బాధల కొలుముల్లో
నాగాలండీ

నరకాన్నిక నరకాలని
నడుం కట్టేము
వెనకాతల మీరుంటే
బతికి పోతాము

యుద్ధంలో మంటల్లో
మే మున్నాము
మీ వల్లే మీ కొరకే
బతికున్నాము
ఈ దేశం ఇహ సౌఖ్యం
మనకేనండి
మేమిచ్చే సందేశం
ఇంతే నండి!

రిసాల్‌పూర్
ఆగస్టు' 43

# చోబుదార్ గల్లీ పిల్ల

(విశాఖపట్నంమీద బాంబులు పడ్డ తర్వాత, అప్పటివీ, ఆ పిమ్మటివీ దృశ్యాలను వర్ణిస్తూ వ్రాసిన గీతమిది. చోబుదార్ గల్లీ విశాఖ పట్నంలో ఒక వీధి)

నిలబడి ఉన్నది
ముస్తాబై గుమ్మం ముందర
ముండామోసిన విశాఖపట్నపు
ముడుతలు దేరిన ముఖమండలంపై
చెరిగీ చెరగని కుంకుంబొట్టు
చోబుదార్ గల్లీ పిల్ల !

నిలబడి ఉన్నది ఆమె
బ్లాకవుట్ డూం పరివేష్టిత
లైటు హవుసు మాదిరి

తెల్లని రాణీరూపాయలబోలు
వెలసిన ఆమె కన్నులు
కలందాన్‌పై ఉబ్బెత్తిన సిరాబుడ్ల
వలెనుండు ఆమె చన్నులు
ఆపెస్తనద్వయం మాదిరిగానే
కొమ్మలనుండి మామిడిపండ్లలా
ఊగాడే స్వస్తిక లోలక్కులు,
బట్టల కరువును ప్రదర్శించే
చేతుల్లేని ఆమె జాకెట్టు

ఎలుగెత్తి పిలుస్తున్నది
తరంగాలుగా వచ్చే విటావళిని

తమ తమ నరాలకు
తమ అర్థంతో
అధి నివేశ స్వాతంత్ర్యం అర్థించేటందుకు
వచ్చే రిద్దరు
అమెరికనో ఆస్ట్రేలియనో
సిపాయి భాయీలు

ఒకడు:
ఎక్కుపెట్టబడిన విమాన విధ్వంసక ఫిరంగిని మోసుకు
తిరుగును.
చేరుమాలులో సూర్య బింబం మూటకట్టుకొని

ఒకడు:
మొలకు మరతుపాకి కట్టుకొని వచ్చెను.
హస్తంలో మస్తిష్కాన్ని దాచుకొని

144 వంటి అవుటాఫ్ బౌండ్స్
ఐనా రంకుతనానికి
సంకెళ్ళేసేదెవరు?

అవుటాఫ్ బౌండ్స్ అడవుల్లోపల
గెరిల్లా యుద్ధం సాగించేందుకు
ప్రారంభించిరి (రెండో రంగం)
ఆకాశం ఆవులించింది
పాతాళం మూలిగింది
టార్పెడోలు గంగడోలు తెంపుకు పరిగెత్తేయి
ముక్కాలిపీటపై రెండగ్ని పర్వతాలు పగిలేయి

మైపుర్రైటరు సిలిండరులా
తిరోగమన పురోగమన చర్యలు సాగినవి
పరదేశపు చేతుల్లోన
పరాయి సిపాయి కౌగిలి లోపల
పంజుకొన్నది చలనంలేని గాజుబొమ్మ
ఆదుర్దా లేకుండా
తెల్లని తలగడారీతి
నిత్యసువాసిని
(ఆమెకు దాహం లావు. ఎంతేనా డబ్బును—భరించగల
పర్సామెకుంది)

ఒక అరటి చెట్టుని పాతి
ఆనందానికి ఏతామెత్తి
వెళిపోయిరి సోల్జరు యువకులు
దూరభారానున్న పెళ్ళాం
పెదిమల తలచుకుంటూ

దినచర్యను పూర్తి చేసుకొని
నిర్మలంగా నిదురించెను
జారిణి
ఇస్త్రీ మడతలాగ

మర్నాడు
చోబుదారు గల్లీ పిల్ల
తన నౌఖరు ఖోజ్జాను
బజారున కంపినది
బియ్యం తెమ్మని

ఏం లాభం?
నురగలు కక్కుతూ హోరెత్తుతూ
గర్జిస్తున్నది
సముద్రం

బియ్యం డిపోల ముందర
ఒకదానిపైనొకటి విరుచుకుపడుతున్నాయి
కెరటాలు

ఆనందవాణి ?
1942

# పేరాస

బతుకు
తారు చీకటి

నట్టింట్లో
చల్ది గూడు చుట్టూ
పిల్లల చప్పుడు

బయట
ఆకాశం చల్ది కుండ
వెన్నెల తరవాణిలో
ఉన్నదొకే ఒక్క
పిడచ
కుండనంటి పెట్టుకున్నవి
రెండో మూడో మెతుకులు

ఇల్లాలు
పవిటకొంగు పరుచుకొని
ఇంటాయన
మో చెయ్యే తలగడగా
వీధరుగు మీద
చాప చుట్టల్లా
పిల్లలు

సంసారం
పస్తు పడుక్కొంది

ఉచ్ఛ్వాస నిశ్వాసాల
ఉపశ్రుతితో
పేగు అరుపు
జోలపాట
ఆకలిని—
లోకాన్నే—మరపించే
నిదుర
చలిగాలికి పడుతుందా

వంటింట్లో
పొయ్యిలోన
వెచ్చగా ఉంటుందని
పిల్లికూన ఆశపడెను

సెంట్ థామస్ మవుంట్
4-1-44

# గోదారి గోతులు

[విశాఖపట్నంలో చెంగల్రావుపేటమీదుగా A. V. N. కాలేజీకి వెళ్ళే ఎగుడికి రెండు పక్కలా ఉన్న గోతుల్ని గోదారి గోతులంటారు]

దివ్వెలపండుగకై
తురక బిడ్డ
చేసి అమ్మే
సిసింద్రీ గొట్టాలు
గోదారి గోతుల
జ్ఞాపకాల పరాసుతోడ
మస్తిష్కంలో
చిచ్చుపెట్టు

గోదారి గోతుల
తలచుకుంటే
నా
గుండెలలో సుడి గుండాలు
వ్యక్తా వ్యక్తంలో టార్పెడోలు
విశాఖ పట్నం
గర్భాన
కాలేజీ కవల పిల్లల
నావరించుకున్న
మావి
గోదారి గోతులు

బతుకుదిబ్బ
మీాదికి
సంసార రథం ఎక్కిందికి
చాలా కష్టం అని
బోధించే
చదువుల గుడుల ఎగుడికి
ఇరు పక్కలా గాఢమైన
ఇరుల
లోతైన గోడారి గోతులు

విజ్ఞాన నిధులు
కాలేజీలు
అజ్ఞానపు
గోడారి గోతులు
భిన్న ధృవాల
పరస్పరాకర్షణ సిద్ధాంతాన్ని
ఋజువు చేస్తూ
ఒకదానివద్ద ఒకటుంటాయి
——
కాలేజీల
పరలోకానికి
సాయబయ్యకోసిన
గొడ్డుమాంసం రక్తం—
రోడ్డుమీాద ఆరబోసిన
ఎర్ర ఉప్పూ ఇసుక తిన్నెల—
పై తరణి

మెడికల్ కాలేజీలోని
కుళ్ళంతా
పల్లమెరిగి
ఈ గోతుల్లో
నిలచి
ముక్కుల బద్దలు కొట్టును
ఒక ప్రక్క
పగలల్లా నగరంలో
అడుక్కునే ముష్టివాళ్ళు
చీకటి పడేవేళకి
డేకురుకుంటూ
చేరుకుంది కొకగూడు
అమాయకుల హావామహాలు
అనాథల ఆశ్రమవాటిక
శిథిలమైన ఖైరాతీ సత్రం
ఫూర్ హౌసు మొండి గోడలు
కాలేజీల అందానికి
దిష్టి బొమ్మలు
అజ్ఞానం వాసం చేసే
పాడువడ్డ నూతులు
లోతైన గోడారి గోతుల్లో
పేదల గుడిసెలు
అనారోగ్య దేవత
రాజ్యం చేసిందికి
కంచుకోటలు
ఈ
బిళ్ళ గన్నేరు తోటలు

ఇనుప గజ్జెల తల్లి
తాండవనాట్యం చేసిందికి
నర్తన శాలలు
ఈ
పతితుల పర్ణశాలలు

ఇండ్లలో
గంపెడు సంసారం
పులుసు డాకలో
నిరాశ మరిగి మరిగి
గుండెల పొయ్యిలోని
కోర్కెల కొరకంచులపై
పడును

ఇండ్లమీద
గొడ్డు మాంసం కొరకు
ఎంగిలాకులకి
కాచుకునే కుక్కల్లా
గెద్దలు
రాబందులు
ఈ గోతుల్లో
నివసించే
జీవితాన్ని పరికించి
నిట్టూర్చని వారల
గుండెలు రాబండలయి
ఈ గోతుల్లోనే పడిఉన్నాయి

ఈ నాడు
గోదావరి గోతులు
గోడ్డుమాంసపు బండీపై
నా మనో మార్గాన
గమించును

క్రైస్తవ సత్రాలలోని
ముష్టివాళ్ళ పురాణకాలక్షేపం
నా
కర్ణ మృదంగాలపై
ప్రతిధ్వనించును

గుడ్డివాడు
బతుకు బ్లాకవుటుపై
ఉపన్యసించును

చెవిటివాడు
జీవిత సంగ్రామపు
రేడియో వార్తలు చెప్పును

గోదావరి గోతుల్లో
నివసించే
పరాజితుల
చరిత్రలోని
పోట్లకత్తుల
ప్రేలుడు బాంబు తునకలు
నా హృదయపు
సోమనాథ దేవాలయానికి
గోదావరి గోతులు
గజనీ మహమ్మదు

గోదారి గోతులు
చెప్పిన
మూగి పాఠాలు
నేడు
అనుభవాల
శంకర నారాయణ నిఘంటువు
సాయంతో
బోధపడి
నా గుండెల్లో
గోదారి గోతుల్లా
గాయాలు!!

మద్రాసు
16-2-41

# మరణశాసనం

చనిపోతున్నా
కబురూ
ఒకనడరేం
ఎవరూ
ఏడవరేం
చనిపోతున్నా
కాలం కాగితమ్మీద
దివాకరుడు స్టాంపయితే
నా దస్తావేజు మీద
రేరాజే రాజముద్ర

నా వారసులారా
దావాలో దిగుతారో
రాజీ పడతారో
రండి రండి
ఇంతెందుకు
ఇదిగో
చిన్నప్పుడు
చింతపిక్కలతో
అక్షరాలను పేర్చినట్టు
ఈ నక్షత్రాలతో
నా
మరణ శాసనాన్ని
లిఖిస్తున్నా

చేద్రావాలు చేసిందికి
నా
పేరేవిఁటి చెప్మా
ఏఁవయినా
చీకటి మసి తెస్తే
నిశానీ పెడతా
అరగనట్టి
తరగనట్టి
అనుభవాల భూఁమిచ్చే
నేలుకొండి
ఏలుకొండి
గుండెల కుంపటి సెగపై
శ్రమ నెసరుపెట్టి
పండిన అన్నాన్ని
పంక్తి పాపం లేకుండా
పంచుకు తినండి
రాచ పీనుగను
తోడు లేందే కదలను
మీాం కష్టాలకి
కక్క గట్టి
నా తోటి
కాటికి తెండి
కింకర దర్శన మౌతోంది
ఇంక మాట్లాడలేను
ఇప్పుడు చెప్పను.
ఏమేమిటి రాశానో

శ్మశానంలో
సగం కాలి పైకి లేచు
నా శవాన్ని
కాటికాపు
భవిష్యపు దుడ్డుకర్రతో
పడకొడితే
పగిలిన నా కపాలం లోంచే
వినబడుతుంది
నా
మరణ శాసనం.

[పెంటుథామస్ మపుంటు]
17-2-44

# నా పాటలు

నే విడిచిన
కుబుసాలను
నేనే
ఏరుకుంటూ
నేస్తున్నాను
చికాకోలు మజ్లిన్లను
కాశ్మీర శాలువలను
అందాకా
మైలాపురం శాలువ
వద్దున నాసరస్వతి
నగ్నంగా కూర్చొని
బట్టలుతుక్కుంటుంది
త్వరలో నే
నా నేత పూర్తవగా నే
నా కూతురు
నా పాటల కన్నె
శృంగారించుకుని
వస్తుంది
మీ అభిమాన థియేటరులోకి
ఎదురు చూడండి
నేను బ్రహ్మని
నా పాటల పడుచుది
ఉడుం మాసం

దంతాల ఎముకలు
విద్యుచ్ఛక్తే రక్తం
నా పాటలు
జీవితమనే
నోటికి
ట్రూత్ బ్రష్‌లు
బతుకు సబ్ మెరైన్లకు
గాలి గొట్టాలు

ఆనందవాణి
—44

# వేకై

కోకలు కాకీవి
ధరించి వేకీలు
కాకుల్లా గూడు వదలి
పోతున్నారు
యుద్ధ కాలపు అత్యవసరాల
సాగుబడికి

శ్రేణుల వెనక
తప్పని నరి పనుల
పాటల
సరిగమ పదనిసలు
అరబ్బీ నిశలు
మదన నిష్కామరాజ కథలు
దీక్షా పరులు

ఫ్రాకులు రంగులవి
ధరించి వేకీలు
పోతున్నారు
సాయం కాలపు అత్యవసరాల
మొక్కు బడికి
పడుచూ, పానీయం, పాటా
పొలికేకల ముడి పదార్థాలు
నర్తన శాలల పిక్చరు హౌసుల
కు

పోతున్నారు
వేకీలు

మెదడులో
గాలి తిరుగుడు పువ్వులు
ఏ తామెత్తే కోర్కెలు
సాయంత్రంపై సవారి చేస్తూ వస్తాయి
ఉషస్సు ముసుగు కప్పుకొని పోతాయి
ధర్మ కంకణాలు
ధరించి
వేకీలు
పని చేస్తున్నారు

W. A. C.(I) = Womens Auxiliary Corps (India)

[సెంట్ థామస్ మవుంట్
12-11-44

# జేళాకంపం

౧

తలలో
తల సొరుగుల్లో
కలలో
కల మడతల్లో
నీలో
నీ నాడుల్లో
నాలో
నా నీడల్లో
జలదారులు యింకగా,
రహదారులు యీనగా,
కర్మాగారాల కడుపుల్లోంచి-
కారాగారాల లోతుల్లోంచి-
దుకాణాల మధ్య నుండి-
కచేరీల వెనుక నుండి-
రూపాయల పాయల
వాలు జడలు అల్లుకొంటూ,
చీకట్ల పిచికారీ కొడుతూ,
వీధి లాంతరునీడ
చీలు దారుల
వేట కుక్కల నాలుకమీద,
కుళినీలో,
గొడ్డు మాంసం కోతల్లో,
గులజీలు తీస్తూ
పొంగరాలు పోసుకొంటూ,

రస్తాల కుస్తాలలో,
ఉస్తాదు ఊపిరిలో,
వస్తాదు కండల్లో,
బీరపాదుల హంసపాదుల్లో,
నడివీధి గులాబీ రేకుల్లో
రేయిలో—
తలలో!
తల అలల
కలల కొరకువలలో,
జేళ్ళల జాడల
పంచ రంగుల ప్రాణాల
రెక్కలు విదిల్చిన
నీలో,
నీ కళ్ళలో
చింతల చివర్ల పుల్లని
చిగుర్ల సీసా బిరడా తీసిన
నాలో
నా కోర్కల్లో

—ం—

ద్వితీయాశ్వాసం

సూర్యుని
ఒంటిచక్రపు
చిక్కుడు కాయల
బండి కంచె దెనకాలి
నగరాన చీకట్ల
వాన కురిసింది

అతని
రథమును లాగు
సప్త వాజి శ్రేణి
కక్కిన నురుగుచే
నభమున మేఘాల
ధూళి రేగింది
నాడు—
కొన్ని వేల ఏండ్ల కింద
తూర్పార పోసిన
పరమాణువు పంటలోన
మానవ రూపం ఎత్తే
విత్తుల వారసురాలొకతె
కాలమనే గాలికి
ఎగిరి ఎగిరి
నాటికి పరిపక్వత సిద్ధించని
భూలోకంలో
ఎన్నో ఆకారాలూ
చాలా పరిణామాలు
పొంది
నేటికి
ఈ రూపంలో
చీకటిలో
తన వాకిలి ముందర
నించున్నది

వారల వీరల
వీరుల శిరాల
కారిన నెత్తుటి
సిరాలు
మానవ చరిత్ర
పుస్తక మందున
పారి
తమంతట తాము
రచించిన
గుండెలు పగిలే
ఏడ్పు వచ్చే
కథలను వింటూ-గా
తన వారికి ముందర
నించుంది
ఈ ఇలలోపల
జరిగిన
యుద్ధాలందున
గెలిచిన జెండా
తలపై మొలచిన
ముమ్మొన కుండే
మూడో కంటిని
మండే
గంధక జ్వాలల్లో...

3

## అరణ్య పర్వం!

నగరరాక్షసుని
నాసికా రంధ్రాలవార
కోరమీసాల మీద
అర్థరాత్రి వేళ
నించుంటుంది
పద్దెనిమిదేళ్ళ
జాజి మామిడి సుందరి
ఒక స్త్రీ
కై జార్ల రవిక తొడుక్కొని
మానవజాతిని శపిస్తూ—
మంచుగడ్డ లాంటి
హృదయం మళ్ళా కరగదు—.
కోడి గుడ్ల చక్రాల మీదుగా
ఇలా వెళ్ళి పోవలసిందే—
నిప్పురవ్వల నిట్టూర్పు విడుస్తూ
చీకట్ల తలవెంట్రుకల చిక్కు
విప్పుకొంటూ
పరిగెత్తే సువర్ణ శకటాలు
స్తబ్ధుగా మేఘ కలశాలు
అదే—ఆమె పాశాల్తో అగాధాల్లోకి
సైతాను రాజ్యంలోకి
నల్లతాచుల పటిక పంచదార
నంచుకొంటూ,
అలుగోజా మేళంతో
వెళ్ళిపోవలసిందే

దెయ్యాలు దేవులాడే వేళ
మిడతల దండు
దండెత్తే వేళ
అంటాడొకడు
అబ్బే లాభం లేదు
దేవుడి రాజ్యంలోకి
చేసిన పాపం చెప్పేసి
టిక్కెట్టు కొనుక్కోవచ్చు
కాబట్టి లాభం లేదు. కాబట్టి
వెళ్ళిపోవలసిందే—
అంటాడు వాడే
కాలుపడి పోయినా
కీలుపడిపోయినా
డాక్టర్లు చల్లగా ఉండాలికానీ
ఏం—వెళ్ళిపోదాం
తప్పదు, వెళ్ళిపోదాం.
వెళ్ళిపోతాడు వాడు.

౮

కిష్కింధకాండ

ముచ్చటైన రాజా!
ఆడబోకు రాజా!
ఏకుతారు రాజా!
నవ్వుతారు రాజా!
రాజ రాజ రాజా.

రాజనిమ్మలపండూ
నేతమూవిడి మొగ్గా
వాకిట తుని శెమ్మా
ఎల్లబోకూ రాజా!
అని అరుస్తూ ఉంటుంది
అవ్యక్తంలో
వింటూనే
వెళ్ళిపోతాడు—
తాడు మెడకట్టుకోనివాడు.

౫

సువార్త

ఏడ్చువారు ధన్యులు—
ఓరి అల్పవిశ్వాసులారా!
తట్టుడి
తీయబడును
ఏమర్రా
పోదోము గోమెర్రా
వెదుకుడి
దొరకబడును
ఆమెన్.

భరతవాక్యం

జాబిల్లి వెళ్లిన కుక్కపిల్లా
జాము రాతిరి ఉంది యింకా
జాగు చెయ్యకు వేగపడవోయ్!
జన్మకొక శివరాత్రి మనకోయ్!

రచన : 1944
ప్రచురణ ఢంకా 45

# తూర్పు

(జపానువాడు, చీనావీడు)

చీకటి నిండిన కళ్ళు
చీకటి గుండా
చూస్తున్నాయి.
తూర్పులోంచి
తేరిపారి చూస్తున్నాయి.

తూర్పు పొదుగు
లోంచి పిండిన
వెలుతురు
నిండిన కళ్ళు
తూర్పు వైపు తేరిపారి
చూస్తున్నాయి.

తూర్పు ఒరలోంచి
దూసిన ద్వేషం నిండిన కళ్ళు
దోపిడీ నిండిన కళ్ళు
తూర్పు నుంచి విస్తరిస్తూ
తూర్పుని
తుత్తునియలు చేస్తున్నాయి...

మద్రాసు
డిసెంబరు 44(!)

# బాలనాగమ్మ

ఎర్రంచుల
నీలిచీర
ఆకాశం

రంకుముండల
ముట్టుగుడ్డ
సాయంత్రం

సన్యాసి
జేగురు పంచెలు
అసుర సంధ్య

రాత్రిపడి
చీకటి జబ్బులకు
హోమపతి మాత్రలు
చుక్కలు

ముసలి దేవతలు
కక్కిన కఫంముద్ద
చంద్రుడు
రాత్రి వెళ్ళిపోతుందిలే

బాల విధవల
తల వెంట్రుకలతో
అల్లిన
మూఢాచారాల

వలలో
వేసుకున్నావా
బాలనాగమ్మను
మాయల మరాఠీ
తొక్కుకు తోకను
బుసకొట్టి లేస్తుంది
పసరికపాం కాదుసుమా
దివిని కుబుసం విడిచి
భువిని మోస్తుంది
జాగ్రత్త
విప్లవ విషాన్ని కక్కి—

మద్రాసు
1944

# జోలపాట

పులి కోరల చలిగాలులు
చలి బాకుల దొంగ పోటు
ఆపిందికి కవచంలా
నడి వీధిని పడి బడితే
నీ వొంటిని గుడ్డలేదు
వల్ల కాటి చితులన్నీ
ఆరి చల్లబారినాయి
ఈరాతిరి ఏడ్చి ఏడ్చి
కళ్ళనీళ్ళ వేడితో
ఒళ్ళంతా కాచుకో
రైలు దారి మదుంలోన
మంచుపొరల ముసుగుదన్ని
పల్లక తొంగో కొడకా
మీద వెళ్ళు రైళ్ళవేడి
అదే నీకు చలిమంటా

పచ్చ చచ్చినట్లు మోళ్ళు
శిశిరంలో బతకవా
కల కల మని వికసిస్తూ
తిరిగి చిగురేయవా
కట్టబట్ట గంజినీళ్ళు
నిలువ నీడలేని వాళ్ళు
మళ్ళా తలెత్తరా!
మరి ఇక మొలకేయరా

మనకర్మం కాదులే
అర్థం నీ కవదులే
శాంతి పొద్దుపొడిస్తే
సుఖం పలుకు మేలుకొలుపు

అందాకా

భూలోకం పరుపుమీద
ఆకాశం కప్పుకోని
కడలి హోరు గుర్రుపెట్టి
కలలేవీ కనకుండా
రాజులాగ,
నిద్రపో
నిద్రపో
చిట్టిపాపా!

సికింద్రాబాద్

డిసెంబర్ 44

# ప్రేయసి

తల్లి గర్భంలోని జీవకణం
మొదట చీలిపోగా
ఏర్పడ్డ కణాలు
కొన్ని వారాలకి
మళ్ళా శరీరాకృతిలో
కలుసు కున్నట్టు
మన కలయిక ఎప్పుడు
పంపర పనస తొనల్లాంటి
నీ ఊపిరి తిత్తులని
తినడం చేతే
నాలో
కర్బూజా పళ్ళలాంటి
నీ కళ్ళు
నవ్వుతాయి
నన్నెవరేనా
ఒక సూది మందు గొట్టంలోకి
ఎక్కించి
నీరు ఇంజెక్షను ఇస్తే
బావుణ్ణు
నీ రక్త నాళాల్లో పడి
ఈదుకుంటూ
నీ గుండెలినిచేరుకోవాలని
ఉంది

బొంబాయి
1945

# కలత

కళ్ళల్లో దూలంనుండి వేళ్ళాడే
రెండు రాజుమామిడి కోర్కెలు
తలలో తెగ రొదచేసే
ఒక వెయ్యి రెక్కల చేతి కవ్వం

ఆవలింత అంత ఎత్తైన చెట్లకింద
పలవరింత అంత యిరుకు కాలంలో
ఒక పచ్చని మైదానం
రెండు వెచ్చని ప్రాణాలు

ఏభై చీకటి గజాల ఆవరణలో
అయిదు వెలుతురు సంవత్సరాల కైవారంలో
రెండు బుసకొట్టే క్షణాలు
ఒక పురి విప్పిన ఘోరం

అంధేరీ, బొంబాయి
జూలై, '45

# సంసార పక్షంగా

తలుపు తలుపు తలుపు తలుపు
ఎవరు వారు
నేనే
వస్తున్నా

తలుపు తలుపు మిమ్మల్నే
వస్తున్నా నంటే
వినబడదూ తియ్యావేం
ఏమిటి ఆలస్యం

వస్తున్నా వస్తున్నా
(అభిమానం కట్టుకోని
ఆప్యాయం తొడుక్కోని)
వస్తున్నా వస్తున్నా

ఏమేవ్, ఒసే, ఓయ్
తియ్యావేం నిన్నే
కొరడు బారిపోతున్నా
చస్తున్నా వానలో

అబ్బా వస్తున్నానండీ
అగ్గి పెట్టె కనబడదేం
దీపం వెలిగించాలా
వస్తున్నా నంటే మిమ్మల్నే

చస్తున్నా వానలో, ఒసే
వినబడదూ నిన్నే

గోడగెంతి రమ్మన్నావా
నిద్దర పోతున్నావా ముద్దా

పంచ కింద వానేమిటి
ఆగండి ఓ నిమిషం
చీకట్లో తేలో జెర్రో కుడితే
వెలగదేం ఓ పుల్లా

(వెలక్కేం అనుమానం
పామై బుసకొట్టకేం)

ఆంధేరీ
1945

# పోరాటం

పదమెత్తి
పదవోయి నేస్తం
వడి వడిని
అడుగేయి నేస్తం

పదిమందివీఁ పనిచేస్తూ ఉంటే
ఒకరిద్దరు నెత్తెక్కి కూర్చుని తింటే
చూస్తూ ఊరుకుంటావా నేస్తం
పస్తులు పడుక్కుంటావా నేస్తం

కేకేసి
దూకయ్యా నేస్తం
రాకాసిని
చంపేందికి నేస్తం
సీటను వేసిన గొడ్డలి ఏ
నాటికి నానుతుంది?
నీళ్ళు నమిలితే లాభంలేదు
కళ్ళు తెరవ్వయ్యా నేస్తం

పాటుపడక దేవతలకు సైతం
దొరకలేదు సుమా అమృతం.
వడివడినఎలుగెత్తి అడుగేయి నేస్తం
పదమెత్తు నేస్తం-

కార్మిక కర్షక శక్తులంతా
ఒకటై
భువిపై
నిర్మించే వర్గరహిత స్వర్గంలో
సోమరులూ
పామరులూ
ఉండరు నేస్తం
లేవయ్యా వేగం నేస్తం
దోచుకునే దొంగలు దారి
కాచి పొంచున్నాగాని

ఆరాటం ఎందుకు నేస్తం
పోరాటం గెలుస్తాం నేస్తం
పద పద పద
పదవయ్యా నేస్తం
గబ గబ గబ
నడవవయ్యా నేస్తం!

?

9. 5. 46.

# ముందున్నది

ముందున్నది ముందున్నది
ముందున్నది మునస్ళ్ళ పండగ
సందడిగ పొలాల నిండుగ
దండిగ మన గుండెల నిండుగ
ముందున్నది హాలాల పండగ
సుఖం కురిసి
శుభం పండి
బతుకంతా దండిగ నిండగ
ముందున్నది హాలాల పండుగ.

దండిగ మన బతుకుల నిండుగ
ముందున్నది కలాల పండగ
కవిత కురిసి
పదం పండి
బతుకంతా దండిగ నిండగ
ముందున్నది కలాల పండగ

ముందున్నది
ముందున్నది.

6. 7. 46

# చక్రదనం

రోజులకు నే నాహారం
రోజాలు నా ఆకారం
ఉనికిపట్టు తేనె పట్టు
ఉరి త్రాళ్ళతో సాలెపట్టు

క్షణంలో వికసిస్తాను
క్షణంలో చనిపోతాను
ఆత్మహత్య నా రహస్యం
ముళ్ళే నా ఆయుధాలు

సంగీతం వినిపించుతూ
ఏదో అనిపించుతున్నప్పుడు
సాహిత్యం కనిపించుతూ
ఏదో అనిపించుతున్నప్పుడు
చిత్రాలలో వెదుకబడుతూ
చిత్రంగా బతుకుతాను
క్షణంలో వెలుగుతాను
క్షణంలో క్షణంలా ఉండిపోతాను
రోజాలు నా ఆహారం
రోజులు నా అవతారం

**రచన విశాఖపట్నం**
**ప్రచురణ ఆంధ్రశిల్పి!**
**30-6-'46**

# భూతపు గోళ్ళు

ఒక భూతపు
పది లక్షల వాడి గోళ్ళు
ఆ గోళ్ళ క్రీనీడలు
దహించే నిప్పుల క్రీనీడల
ఎర్రని ఆకుల జాడలు
ఒక రాష్ట్రపు గడ్డమీద
ఒక రాష్ట్రపు వలవల వణికే
నెత్తిమీద
పదిలక్షల పిడుగుల పిడికిలి
పదిలక్షల గాలన్ల లావా ఉప్పెన
పదిలక్షల టన్నుల ఆకలి
పదిలక్షల పదిలక్షల
ఘోరమైన అతి భీకరమైన
ఉపమానాల బరువుతో
ఒక వినాశనం
పదిలక్షల మైళ్ళ వేగంతో
ఒక రాష్ట్ర మీద విరుచుకు పడి
ఒక రాష్ట్రాన్ని విరుచుకు తినబోయే
ఒక భూతపు
వికటాట్టహాసం
దారుణ మారణలాస్యం
నల్లబై అయిదులక్షల దృఢ సంకల్పానికి
నల్లబై అయిదులక్షల ఏకాండీ ప్రతిఘటనకి

నలభై అయిదులక్షల ఒక్కుమ్మడి ఉమ్మడిదెబ్బకి
ఒక భూతపు
వికటార్తనాదం
ఒక రాష్ట్రపు చేతుల్లో
ఒక రాష్ట్రపు చేతల్లో

[చెన్న రాజధానిలో పదిలక్షల టన్నుల ఆహారపు కొరత ఏర్పడ్డాదని శ్రీ శాంతి రామమూర్తిగారి ప్రకటన]

అంబాలా
(ప్రచురణ ప్రజాశక్తి)
10-2-46

# పీర్లగుండం-II

ఈ దేహం పంజాలో
నా చేతుల పీర్లని నిలిపి
నా గుండె బాజావాయిస్తున్నా

నా నాడి పులివేషం ఆడగ
నా చైతన్యపు పంచకళ్యాణి నెక్కి
యుద్ధానికి వెళ్ళిన
ఓ కుర్రాడా!

మెదడు బులాకీ పిట్ట పడ్వగ
నా అవ్యక్తపు గుండంలో
నరాల కర్రలు కాలగ
ఈ వాక్యం గానం చేస్తూ

ఈ దేశంలో
మా హిందూ ముస్లిం, గుండెలు రెండూ
ఒక టేనంటూ
తొక్కు తొక్కు
గుండం తొక్కు.

ఆనందవాణి
7-1-1945

# అవలీలగా

నిజం బరువైందీ అన్న
అబద్ధం నిజమైందీ అన్న
నిజాన్ని దాచినా దాగదన్న
నిజాన్ని బైటపెడుతూన్న
యదార్థాల తోకలు కత్తిరించిన
పాడు కలల పాల కడలిలో
మర్రాకుమీద
పాలపీక నోట్లో పెట్టుకొని
పడుక్కుంది కాలం

వెడల్పుగా అపాయాలు పరచుకొని
పొడుగ్గా తుపాకులు పేర్చుకొని
నిలువుగా నిశ్శబ్దాన్ని పేనుతూ
వినాశనాన్ని వాళ్ళో పెట్టుకొని
హాలాహలాన్ని కషాయం కలుపుతూ
అయస్కాంతాల కాంతారాలలో
విద్యుత్కిరణాల కెరటాలమధ్య
శూన్యానికి కాలు దన్ను పెట్టి
అలవోకగా నిలుచుంది ఆకాశం

సౌర కుటుంబం హోల్డాలు చుట్టుకొని
గెలాక్సీల సూట్ కేసు పట్టుకొని
దుగ్ధపథం కండువా వేసుకొని
తోక చుక్కల టిఫిన్ కారియర్ నిండా

జననమరణాల చపాతీ దొంతితో
ఉపనిషత్తుల నేపథ్య గానం వింటూ
టికెట్టు లేకుండా ప్రయాణం చేస్తున్నాడు
విశ్వయాత్రికుడు

శ్రీశ్రీతో కలిసి

ఆనందవాణి 22-7-45

# నవోదయం

భూమి ఇచ్చి అప్పు ఇచ్చి
మదుపు పెట్టి మిల్లు పెట్టి
సేద్యగాళ్ళ కడుపుకొట్టి
కూలివాళ్ళ బతుకుమాడ్చి
జమీందార్లు గొప్పవాళ్ళు
లాభాలను గడిస్తారు
లకారాలు గుణిస్తారు

పంటదోచి
సేద్యగాళ్ళ మంటతోసి
సరుకు దాచి
కూలివాళ్ళ కడుపుకోసి
జమీందార్లు గొప్పవాళ్లు
ఇంటిమీద ఇల్లు వేసి
మదుపుమీద మదుపులాగి
కడుపుచల్ల కదలకుండ
కలకాలం బతికేందికి
జమీందార్లు గొప్పవాళ్ళు
వాళ్ళ వాళ్ళ అనుచరులూ
చుటాలూ బంధువులూ
కచేరీల కెక్కుతారు
శాసనాలు రచిస్తారు

చేనూడ్చే సేద్యగాళ్లు
చెమటోడ్చే కూలివాళ్ళు
జమీందార్ల గొప్పవాళ్ళ
దోపిడీకి ఆహుతయిన
వాళ్ళతోటి పేదవాళ్ళు
జడివానలో కడుఆకలి
మండుటెండ మాడిమాడి
చలి లోపల కొరడు బారి
కొయ్యబారి సగంచచ్చి
తమ హక్కులు గుర్తించని
తమ బాధలు తప్పించని
గొప్ప గొప్ప వాళ్ళమీద
వాళ్ళు చేయు జులుంమీద
తిరుగుబాటు ప్రకటిస్తూ
క్రాంతిపథం చేరుతారు

జమీందార్లు గొప్పవాళ్లు
పోలీసుల సాయంతో
సేద్యగాళ్ళ కూలివాళ్ళ
సంఘాలను అణగతొక్కి
తమరాజ్యం తమభాగ్యం
నిలుపుకోనాలని చూస్తే
సేద్యగాళ్ళ కూలివాళ్ళ
గొంతుకతో గొంతుకలిపి
దురాక్రమణ దౌర్జన్యం
అవినీతీ అన్యాయం

అక్రమాలు సాగించే
జమీందార్ల గొప్పవాళ్ళ
వాళ్ళ వాళ్ళ వాళ్ళమీద
కవిచాపం సారిస్తాడు
తన శాపం సంధిస్తాడు

సేద్యగాళ్ళ కూలివాళ్ళ
సంఘాల్లో చేరనట్టి
దారి తప్పి పోయినట్టి
బీదవాళ్ళు పేదవాళ్ళు
వ్యసనాలకు బానిసలై
జమీందార్ల గొప్పవాళ్ళ
గాలంలో చిక్కుకొన్న
దారిలేక తెన్నులేక
దగాపడ్డ వెర్రివాళ్లు
తమ అన్నల తమ అక్కల
వీపుల్లో బాకుగుచ్చి
గుండెల్లో గుళ్లు పేల్చి
నోరులేని వాయిలేని
పసి పాపల పట్టి కాల్చి
తమ చితులను పేర్చుకొనే
తమ గోతులు తవ్వుకొనే
సమయంలో కవిగీతం
కవి వాక్యం వినబడితే
జమీందార్ల అండ చేరి
గొప్పవాళ్ళ నాశ్రయించి

దగాపడ్డ వైరివాళ్లు
తమ ద్రోహం ఆపుతారు
సేద్యగాళ్ళు కూలివాళ్ళు
సంఘంలో చేరుతారు

క్రాంతి పథంలో సాగు
సేద్యగాళ్ళు కూలివాళ్ళ
సంఘరథం కదులుతుంది
కదులుతుంది కదులుతుంది
జమీందార్ల గొప్పవాళ్ళ
దోపిడికి ఆహుతయిన
ప్రజాశక్తి కదులుతుంది
ఆనాడే ఈనాడై
సేద్యగాళ్లు కూలివాళ్లు
శ్రమియిస్తూ నిర్మించే
నవధరిత్రి శుభచరిత్ర
రాబోయే కవిగీతం
క్రాంతిపథం మీద కదులు
సంఘరథం మీద ఎగురు
జయ పతాక నాగీతం
యువ పతాక నా ప్రాణం.

నవోదయ
నవంబరు 1946

# నేనూ, కాఫ్కా

ముప్ఫై ఆరు అంతస్తుల మేడమీద, ముక్కోణం ముఖంలోన నేనూ కాఫ్కా.

ముందే అనుకున్నాను దంతపు రేకుల పెడ్డులో పెరాబలాలో ప్రమాదాలను పడుకోబెట్టి గాలిషికారుకి ముక్కోణం పటిష్ఫజీ...

ముప్ఫైఆరు అంతస్థుల మేడమీద ముక్కోణం ముక్కులోన నేనూ కాఫ్కా.

మూడో భుజంమీద కూర్చొని పాడే ఆ ఆసామీ ఎవడు?

గోరు వెచ్చని పుసిరీ పచ్చడి పాళాలుగా నేపాళం మాత్రలు.

ఎక్కడ మొదలుపెట్టి ఎక్కడికీ యాత్ర?

ఎన్ని వరండాలు? ఎన్ని గదులు? ముప్పై ఆరు అంతస్థుల భవంతిలో ఎన్ని కోట్ల గదులు?

నేనూ, కాఫ్కా! ముందే అనుకున్నాను. దారి మరచిపోయామని
కాగా పోగా విచారణ సంగతి ఏమయింది?

నిజానికి ఇది అనంతంకాదు. అంతం ఉంది. మార్గం లేదు. భూగోళం పరిభ్రమిస్తున్నంత కాలం కథ కంచికి వెళ్ళదు.

ఉగాదికి పద్యాలు రాసీకన్న ఉప్పుపిండి తింటే నయం.
కాఫ్కాని ఎక్కడ వదిలేశాను?

అద్దరినో పట్నం. అందులో మనుష్యులు మనలా వుండరు.
నేనూ కాఫ్కా.

భూగోళశాస్త్రం భరతనాట్యం ఆడుతుంది. గ్లోబు సర్వకాల సర్వావస్థలలోనూ ఒక భంగిమంలో వుంటుంది.

హిరణ్యాక్షుడు భూమిని చాపచుట్టలాగ చుట్టినట్లు మేపుని చుట్టేశాను.

మేపులో అక్షాంశ తులాంశ రేఖల ఇరుకుల్లో నేనూ కాఫ్కా.
ఆ మూడో భుజంమీద పాడే ఆసామీ ఎవరు?
నేనూ, కాఫ్కా.

ఆనందవాణి
దీపావళి 1946

రాజరికం

# రాజూ — మంత్రీ

తిరగ బడతారట
వెధవ ప్రజ
తిని బతకలేక
వెధవ ప్రజ
——దానికేం——
పులి మీద పుట్రలా
వసూలు చేయిస్తా పన్నులు.
మహాలక్ష్మి, డెర్బీ, గిండీ
లెక్కలకేం
కుక్కలకే అవుతాయి లక్షలు
ఈ లంజకి లక్షా,
ఆ రైతుకి శిక్షా,
నేనెలా పోతే వాళ్ళకేం?
వీళ్ళ సొమ్మేం పోయింది?
ఈ ఎర్రజెండా వెధవల
కెందుకో ఈ కక్ష?
నల్లిని నలిపినట్టు
నలిపేస్తా
కిరస్తానీ వాళ్ళను
సింహాలకు వేసినట్టు
నా కుక్కల చేత
కరిపిస్తా

అన్నట్టు జానీకి ఎలా ఉందో?
పెయ్యేమిటి, పదివేలేనా
ఫీజిస్తా
డాక్టరుగాడి పెళ్ళాన్ని
లంచికి పిలవాలి
అదేవిటీ–ఆ హాలీవుడ్
పిక్చరు–అందులో అమ్మాయిలా
ఉంటుంది
హాలీవుడ్ వాళ్ళాపిల్లని
అమ్ముతారూ?
నా రాజ్యంలో ఆడవాళ్ళంతా
హవాయిన్ గుంటల్ల డెస్సు
కట్టుకోనేటట్టు చూడాలి.
పోనిద్దూ,
తోలించు, తోలించు
తెల్ల గుర్రాలను
గళ్ళాసులలోకి
తోలించు
ఊటీకా? సిమ్లాకా?
ఊహూ పారిస్‌కే ప్రయాణం
మంత్రీ! నా ప్రజలు
నా సంతకం కానప్పుడు
నాకున్నది ఒకేఒక్క–
సంకటం

రాసి పెట్టేడండీ
భగవంతుడు
రాజులని రాజకీయాలని
ఆశ్రయించి బతకమని
డబ్బులేని నోరున్నవాళ్ళకి
రాసిపెట్టేడండీ
రాసిపెట్టేడు
రాసిపెట్టేడండీ

డబ్బులేని నోరులేని
వెధవలని రోడ్డుమీద పడి
అడుక్కు తినమని
రాసిపెట్టేడండీ స్వామీం
రాసిపెట్టేడు
రాసిపెట్టేడు
రాసిపెట్టేడు

సొగసయిన గుంటలని
ఒళ్ళమ్ముకొని బతకమని
రాసేడు స్వామీ
రాసిపెట్టేడు
రాసింది జరిగితీరాలండీ
జరిగితీరాలి

ఈ వెధవలు తమ పొట్ట
చేతులు అడ్డు పెడితే సరా
గీత ఏవని చెపుతోంది
"వినాశ కాలే విపరీత బుద్ధి"

అందుకే విప్లవం, విప్లవం
అని వాగుతున్నారు
పోతారు పోతారా వెధవలు
తుడిచి పెట్టుకొని
పోతారు

ఏనుగులాంటి మీతో
ఎందుకూ పొందని
కక్కాగట్లా యుద్ధం?
వేమన్న - అవును వేమన్నే—
వేమన్న చెప్పినట్టు
"కరిరాజున్ బిసతంతు సంతతులచే కట్టన్"
ఏవిటో మర్చి పోయేను,
ఆ—ఫరవాలేదు
మరి నాల్గయినా మన్నేం
చెయ్యావ్
ఇంతకూ చెప్పొచ్చేందేవిటంటే
భగవంతుడున్నంత కాలం
మనకేం భయం లేదు

రాజా! మనకున్నది
ఒకే ఒక్క అంకుశం

దైవాంశ
మనవర్తక రహస్యం!

మాలి
మే-47

# సత్యం, సమ్మె, సానిపిల్ల, సాహిత్యం

నిముషాలమీంచి వస్తారు
నిశ్శబ్దంలోంచి
నిశీథంలోంచి
ఈదుకొంటూ
తడుపుకోకుండా
శోణితాన్ని ఆచమిస్తూ
గుణింతాన్ని ఆచరిస్తూ
కాలాన్ని విభజిస్తూ
విజ్ఞానాన్ని భుజిస్తూ
నిముషాల నుంచి వస్తారు
రాజులూ రాక్షసులూ
కవులూ కార్మికులూ
గుమస్తాలు గుడిసేటులు
వర్తకులూ వగైరాలు
నిముషాలలోంచి వస్తారు
నిముషాలమీద వెళ్ళిపోతారు
సూటిగా శూన్యంలోకి
నిశ్శబ్దంగా నిశీథంలోకి
నిరాకారంగా నిశ్శబ్దంలోకి
వెళ్ళిపోతారు అంతా
ఐపోతారు అవును
అంతా
కొండెక్కిపోతారు

"ఆదంకుజా
అవాకుజా
అందానయే గందంకుజా"

*

ఖర్దైన చెమట
బలిష్ఠమైనవి ఉక్కు కండలు
శూన్యహస్తం
నిర్మించింది
ఆకుపచ్చని భూమిని
బలిష్టమైనవి
ఉక్కుకండలు
నిర్మిస్తాయి
రమ్యహర్మ్యలని
బలిష్టమైన
ఉక్కు కండనులు
కండ చీమలచేత
దోచుకోన బడతాయి
బలిష్టమైన
ఉక్కుకండలు
తనకూ రమ్యహర్మ్యలకు మధ్య
నిర్మించ నిస్తాయి
బలిష్టమైన రాతిగోడలని
బలీయమైన
ఉక్కుకండలు
పదునైన నిట్టూర్పులను
విడుస్తాయి

పదునైన నిట్టూర్పులు
నివురు కప్పిన ద్వేషాన్ని
రగిల్చి
ఆక్రమిస్తాయి
రమ్యహర్మ్యాలను,
ఖరీదైనది స్వాతంత్ర్యం
పదునైనది చెమట

*

ఎర్ర దీపాల జిల్లా
అవినీతికి
పెట్టని ఖిల్లా
పరిస్థితులు ప్రతిపాదిస్తే
ఆకలి ఆమోదిస్తే
దరిద్రం తీరిఫీదిస్తే
పదారవ వన్నె
మేలిమి పాపపుకన్నె
పడుచుకొని
తన్ను తాను తినేస్తుంది
సూర్యుడు వెలుగుతున్నంతకాలం
చీకటిని పరిపాలిస్తుంది
చెదపట్టిన శరీరాన్ని
మదుపుపెట్టి
రూ ఆ పైలని పోతపోస్తుంది
అశాంతికి బానిసవుతూ
ఆకలిని జయిస్తుంది
తనకాళ్ళ కింద

గోతులు తీసుకొని
అగాధంలోకి పడిపోతూ
వెలుగుని గుర్తిస్తుంది
పశ్చాత్తాపాన్ని టికెట్టుగా
పరలోకంలోకి
ప్రయాణం చేస్తుంది

'మారు మనసు' ఆస్తి
పెట్టి
స్వర్గాన్ని నిర్మించుకొంటుంది
సమాజం వెన్నుమీద
మానని కురుపుకి
ఉపమానంగా
కలకాలం
నిలబడిపోతుంది

*

పదునైన నది
ఖరీదైన నది
పటిష్టమైనది సాహిత్యం
గరళంలాంటిది
ఈ ద్రావకం
అన్ని రోగాలకీ
ఒకే ఒక్క చుక్క
నిపురు కప్పిన ప్రబోధంతో
రంగరించి—
వివరాలకి
లోపలి కరపత్రం చూడండి

[మాలి
నవంబరు'-47

# రాక్షసుని స్వగతం

సాహసిక యాత్రలేని
సాయంత్రం
సాయించదు నాకు
కోరలు తీసిన రాత్రి
కోరిన ఆనందం ఇవ్వదు

చీకటి దట్టంగా కమ్మి
భయాన్ని వర్షించని
రోజంటే కిట్టదు నాకు

నిర్జనమైన సాయంత్రపు
అడవులలో
దౌర్జన్యంతో క్రీడిస్తాను

కొమ్ములు తిరిగిన రాత్రి
అగడ్తలలో
భీభత్సంతో రమిస్తాను

అప్రతిష్టతో నిందలతో
తడిసిన
జీవితాన్ని విప్పి
లోకంమీద ఆరవేస్తాను

సభ్యత విడాకులిచ్చిన
సత్యాలను నేసి
ధరిస్తాను

నీతి నియమాలను
శాసించే
జాతిమీద కాండ్రిస్తాను
తంబీ! ఇదుగో
ఒకే ఒక్క సత్యం
పిడికెడు బూడిదలో
భీభత్సం

[మాలి
1947

# సింహ కన్యకలు

భాస్వరపు తీగెల జూలు
వసూలు కొనుకొని
(ఔను, అక్కడే అక్కడే
ఆ సందు చివరనే)
కుళ్ళు కాలువ తన
ప్రారంభాలను వెతుక్కొనే
ప్రయాణంలో
ప్రవహిస్తోంది

*

బూజు జూలు (కాబోలు)
విరాళాలు రాబట్టి
(ఔను, అప్పుడే అప్పుడే
ఆ క్షణం చివరనే)
ఇరుకు సందు తన
పేదతనపు వైశాల్యాన్ని
చదరపు మైళ్ళలోకి
మార్చుకోవాలని

*

వెలుతురు కిరణాల జూలు
జాబితా వేస్తూ
(ఔను, అందుకే అందుకే
ఆ సుఖం చివరకే)

కుళ్లు సందుల్లోని
ఇరుకు కాలువ పక్కలాంతరు స్తంభం
చీకటి ఏనుగు పిల్లల్ని
చీల్చుకు తింటోందని

[శ్రీశ్రీతో కలిపి
ఆనందవాణి-1947

# తులం వృశ్చికం

గొలుసు గొలుసుల బొమ్మ కుట్టు యంత్రములోన
కవుల నల్లమందు కలల సందుల్లోన
ఆంధ్రజాతికి నేడుగాది పండుగ కాదు
ఆంధ్రరాష్ట్రం నిద్రయందు వసూల్ కాదు

*

కుట్రదారుల కళ్ళు కుట్టు యంత్రంలోన
రాజకీయ నీతి బీరకాయలలోన
చెన్నరాజధాని చిన్నదా చితకతా
పది తులాలబాటు పసిడిగా బతకరా

*

మతనిషేధపు కల్లుకొట్టు యంత్రం లోన
సివిలు యుద్ధ మనెడు క్రిమినల్ కోర్టులో
భరతగోవు పాలు పట్టెడైనను చాలు
పొదుగు కోయ పాలు పిదుకు టెట్లు?

[శ్రీశ్రీతో కలిపి
ఆనందవాణి-1947

# మాతృకాంక్ష

అడిగింది ఒక తల్లి
ఒక తల్లి అడిగింది
ఇహం పొలిమేరలో
పరం తొలి దారిలో

నిలచి కొడుకుని తలచి
కలచు గుండెలలో
అలలమాదిరి పొంగి
పొరలు ప్రశ్నలతో
అడిగింది ఒక తల్లి
ఒక తల్లి అడిగింది

కబురు అందని చోట
కలలు విరిగిన చోట

అడిగింది ఒక తల్లి
అడిగింది తొల్లి

"మోహనదాసు కులాసాగా ఉన్నాడా?
అయ్యో అమ్మ పోయిందని అన్నాడా?
సీమనించి తిరిగొచ్చాడా?
పెద్ద పరీక్ష ఇచ్చొచ్చాడా?

అందరిలాంటివాడు కాదు అబ్బాయి
అలాగని అసలేకాడు ఆకతాయి

మబ్బు వెనకాతల సూర్యకిరణం మల్లే
గుబురు ఆకులమధ్య మల్లెపూవు మల్లే
అందరికీ అందనివాడు వాడు
వాడిలాంటి వాడు ఇంకోడు లేడు

దివాన్గిరీ చేశాడా? దివాలా తీశాడా?
కుటుంబం పరువు నిలబెట్టేడా?
పెళ్ళాన్ని ఏలుకొంటున్నాడా?
సజావుగా సంసారం చేస్తున్నాడా?"

ఆడిగింది ఒక తల్లి
ఒక తల్లి అడిగింది

మేఘాల భూమిలో
కోరికల కోటలో

నోము పండిన వారు
పూచి మురిసే తోట

తనువు పీడినవారు
వేచి ఉండే చోట

మృత్యు సీమను నిలచి
కన్న కొడుకుని తలచి

అడిగింది ఒక తల్లి
ఒక తల్లి అడిగింది

"అబ్బాయి ఆడి తప్పనివాడే గానీ
సారాయి తాగననీ, మాంసం ముట్టుకో ననీ

సానిఖ్ళకు వెళ్ళనని, చేతిలో చెయ్యివేసి
ప్రమాణం చేశాడు; నిలబెట్టుకొన్నాడా?
మోహనదాసు కెంతమంది సంతానం?
మా కోడలు నింపాదిగా ఉందా?"

అని

తనకు తానే ప్రశ్న
అడిగింది ఒక తల్లి
తనకు తానే వ్యథను
పొందింది ఒక తల్లి

బదులు చెప్పెను ఒకడు
బరువు మాటలతో
భక్తితో, బాధతో
బదులు చెప్పెను ఒకడు

"అతడు సామాన్యుడా?
అతడు మాన్యుడు సుమా
అతడు పుట్టిన కడుపు
అవని తీర్చని ఋణము
అతడు మెట్టిన భూమి
అత్యంత పావనము

అడుగడుగునా విఘ్నాలు, ఆశలకు అవాంతరాలు
ఆశయాలకు ఆనకట్టలు, ఆవేశాలకు చన్నీళ్ళు
అభిప్రాయాలకు సంకెళ్ళు, ఆలోచనలకు బేడీలు
ఆదర్శాలకు ఉరిత్రాడు, ఉత్సాహానికి కంట్రోలు

ఉద్రేకాలకి రేషను, ఇహంలో నో వేకెన్సీ
పరంలో నో ఎడ్మిషన్, కళ్లకు కటకటాలు
కనికరానికి కారాగారం, కడుపులోకి కంకర
మా గీతలు వంకర, మా చట్టూ బానిసత్వం

ఇటువంటి ఇరుకులలో
ఇటువంటి వ్యథలలో
అడుగు పెట్టెను అతడు
అవని పండెను అపుడు

భయంకర స్వార్థాచ్ఛాదితమై
లయంకర స్వార్థాస్ఫాలితమై
సర్వదేశ ప్రజ సంక్షోభిస్తే
సత్యాహింసలు బోధనచేసిన
అతడు సామాన్యుడా?
అతడు మాన్యుడు గాని,
బ్రహ్మదేవుని నాల్గు వేదాలు
ధర్మదేవత నాల్గు పాదాలు
సకల మతములలోని సత్యాలు
అతని బోధనచేత నిత్యాలు"

భక్తితో, శ్రద్ధతో
బదులు చెప్పెను ఒకడు
బదులు చెప్పెను అతడు
బరువు కన్నులతో

అంతంత మాటలు తనకు
అర్థం కాలేదు కనుక

అడిగింది ఒక తల్లి
అబ్బాయిని గురించి
అడిగింది ఆ తల్లి
అశ్రులు ధరించి
మోహనదాసు బాగున్నాడా అంటే,
ఏమేమో చెప్తారేమన
మీరేనా చెప్పండి స్వామీ
మా వాడు ఎలా గున్నదీ
మా వాడు రాజ్యాలేలక్కర్లేదు
కులాసాగా ఉంటే చాలు
మంచివా డనిపించు కొంటే
అదే నాకు పదివేలు
అని

అడిగింది ఆ తల్లి
గుండె కొట్లాడ
అడిగింది అడిగింది
ఆత్రం తోడ

మొరడు గుండెలు వాడు
మూర్ఖచిత్తము వాడు
**పలుకు** విషము లొలుక
బదులు చెప్పెను ఒకడు

"మీవాడా? ఛండాలుడు
మీవాడా? దుర్మార్గుడు

మాలవాళ్ళని మాతో పాటు కూర్చోమన్నాడు
భోం చెయ్యమన్నాడు, ఇంకా
ఏం చెయ్యమనలేదూ!

పవిత్రమైన దేవాలయాల్లో
అంటరాని వాళ్ళను అంటగట్టేడు
తురకాళ్ళతో భుజం భుజం కలిపి
తుంటరులను వెనకేసుకొని
తూలి పడ్డాడు
చెయ్యరాని వెన్నో చేశాడు
అందుకే అన్నిసార్లు జెయిల్లో పెట్టారు
అందుకే ఆఖరిసారి మనవాడే మీవాణ్ణి
గుండేసి కాల్చి చంపేశాడు
మీవాడు దుర్మార్గుడు
మీవాడు పాపాత్ముడు"

"ఓరి పాపాత్ముడా అతడు పాపాత్ముడా?
మహాత్ముడు పుణ్యరాశి"
అని సకల జీవరాశి
ఎలుగెత్తి పలికింది
కుమిలిపోయెడి ఆ తల్లి
నూరట పరిచింది

అడిగింది ఆ తల్లి
అపుడు వేదన తోడ
ఈ భూమి మరణించు వారల సీమ
అయినచో అబ్బాయి కానరాడేల

అనుచు దుఃఖముతోడ
అడిగింది ఆ తల్లి
అడిగింది అడిగింది
అబ్బాయి జాడ

“తన జాతి గుండెలో
తన జాతి ఇండ్లలో
నిరతమూ నిలిచేటి
నిండి వెలిగేటి అతడు
అమరుడు కదా అతడు
నిత్యుడు సుమా

అతని
నిలయము ఎప్పుడూ
అక్కడే
అతని మనుగడ ఎప్పుడూ
ఇప్పుడే”
అని చరిత్ర సమాధానం ఇచ్చింది

[గాంధీజీ నిర్యాణం 30-1-1948
తర్వాత మద్రాసు రేడియోలో

# పిలుపు

ఒక నూతన సాంఘిక వ్యవస్థ
ఈ పతిత మానవ హస్త
సంగ్రస్తమయే
సూచనలు
మొలకెత్తుట
చూడండి
లెండి, పదండి
సోదరు లారా
తయారవండి
భావికి
స్వాగత మనండి
మీ లోలోపలి
నేత్రం
తెరచి తరచి
చూడండి
ఇవిగో
కోతల కొచ్చిన పలుస్వప్నా
లవిగో
కుప్పలు పోసిన పటు సౌఖ్యాలు
రండి, రండి
వేవేగ రండి
సోదరులారా
శ్రామిక జనసందోహపు

సంకల్పం
కవి గాయక బృందపు
సన్నాహం
ఈ ఉత్సాహం
చూడండి, రండి
మాతో కలసిరండి
నిర్మిద్దాం
ఒక స్వర్గం
పండిద్దాం
మన స్వప్నం
ఓహో సోదరులారా!
చూడండో
పెచ్చిన స్వార్థం పన్నిన
ఉచ్చులు
దుమికే వరదలు
పొంగే వరదలు
ఓ హో హో
మరొక విఘ్నం
మన పసి పాపల
ప్రాణాలకి హాని
మన ఆడవాళ్ళ
మానానికి గ్లాని
అయినా
సోదరు లారా
నక్కకండి
వెనక్కి వెనక్కి
తగ్గకండి

పదండి
కొడవలి వడిసెల
సుత్తి కత్తి
పిస్తోల్, ఫిరంగి
పట్టుకు పదండి
ఆ పొగరెక్కిన
కారేను బోతులమీదికి
ఓ హో హో
ప్రజలకు విజయం
మన ఆదర్శానికి
అవకాశం
రండి సోదరులారా
ఒక నవయుగ నిర్మాణానికి
మహాదుజ్జ్వల చరిత్ర రచనకి
రండి పదండి
సోదరు లారా
కలసి రండి

[ఈరా విశాలాంధ్ర
మార్చి 1948

# మళ్ళీ యుద్ధం?

చూడు, ఆకాశం వైపు
శూర్పణఖ లాంటి మేఘాలు
చూడు, సముద్రం మీద
శీత నగ్న మంత స్త్రీమర్లు
చూడు, నీ చుట్టుపక్కల
తుపాకుల కీకారణ్యం

మళ్ళా
సైన్య విన్యాసాలు?
మళ్ళా
దౌర్జన్య స్వైర విహారం?
మళ్ళా
ప్రపంచం కళ్ళకి
బ్లాక్ఔట్ గంతలు?
ప్రపంచం మెడలో
సెన్సారు బండరాళ్ళు
కర్ఫ్యూలు, కూపన్లూ
కూలిన జీవితాలూ
కాలిన జ్ఞాపకాలూ
క్రిక్కిరిసిన
అక్క పక్షిగాళ్ళ మీదకి
ఇంకో
క్రొక్కారు విప్లవం?
క్రొంగొత్త విప్లవం?

చూశావా తమ్ముడూ!
కిందటి యుద్ధంలో
మిగిలిన శాంతిని
చెరిగి
వండుకొని తింటూ ఉంటే
ఈ పాల బారడం
మళ్ళా యుద్ధం
తలచుకొంటున్నదా
మనల్ని?
మళ్ళా యుద్ధం
వొలుచుకొని తింటుందా
మనల్ని?
మళ్ళా క్రౌర్యం
విరుచుకొని పడుతుందా?
మళ్ళా దౌష్ట్యం
సేద్యం చేసి
కపాలాలు పండించి
చిచ్చులా వ్యాపించి
చీకటిలా పాలించి
ప్రపంచాన్ని
ధ్వంస ధూళి చేసి
పారేస్తుందా?
చెయ్యదని
ఎలా అనగలం
తమ్ముడూ,

చూడు పశ్చిమం వైపు
వ్యాపార సంస్థల్లాంటి
రాజ్యాలు
సంతకాలతో
నిచ్చెన కట్టి
అటకమీది యుద్ధాన్ని
దింపిందికి చేసే
సన్నాహం
చూడు అటేపున్న
గోళం—
సూర్యుళ్ళా ఉడుకుతున్నాది
బోధపడలేదా
తమ్ముడూ!
క్షణం మించ బెడితే
రణం తప్పదంటూ
బోధపడలేదా
తమ్ముడూ
కీలకం!

నిన్న నిన్నటిదాకా
మనల్ని దోచుకొన్న
భూతాలన్నీ
మొఖంమీద రంగుమార్చి
వొంటి మీద కోటు మార్చి
కూడ బలుక్కొని
కలిసి కట్టుగా

మన ఎముకల గూళ్ళు విరిచి
శాంతిని కాపాడాలంటూ
యుద్ధాన్ని రాజపెట్టడం
బోధపడలేదా
తమ్ముడూ!

ఏదో ఒక ఉపద్రవం
ఏదో ఒక విపత్తు
దేశాలమీద
స్వారి చేస్తేనేగాని
సింహాసనాలమీది
పార్టీలు
శ్మశానాల వైపు
నడవాలని
బోధపడలేదా?
మళ్ళా సహించగలమా
యుద్ధాన్ని

మళ్ళా ఒప్పుకుంటామా
మానవ జాతిని
తుడిచి పెట్టే
మారణ హోమానికి
మళ్ళా ఊరుకొంటామా
అమాయక పట్టణాలమీద
పవిత్రమైన కట్టడాలమీద
ప్రశస్తమైన ప్రాణాలమీద
బాంబుల భాద్రపద వానలు

ఇన్నాళ్ళూ కష్టపడి
నిర్మించిన నాగరికతని
ఏ కొద్ది మంది
వ్యాపారస్థుల కోసమో
ఏ కొద్ది మంది
స్వార్థపరుల కోసమో
ఏటంబాంబుకి
ఎర చేస్తామా!
ఏమంటావు తమ్ముడూ!
పసుపు హిట్లర్లను
ప్రతిష్ట చేసి
మృత్యుపూజ చేయనిస్తామా?

రా, రా,
చీకట్లను కూకటి వేళ్ళతో
లాగి పారేద్దాం
శాంతిని నరికే వాళ్ళని
నరికి నరికి పారేద్దాం
చేతులు కాలక ముందే
నిప్పును ఆర్పేద్దాం
సూర్యుడు ఆరక ముందే
శాంతిని వెలిగిద్దాం

[ఈరా విశాలాంధ్ర
మే 1948

# ఓపెన్ ఫైర్!

(తెలంగాణా రణగీతం)

ఆహాఁ అన్నలారా!
ఓహో తమ్ముళ్లారా!
నిజాం భూతమండోయ్
నిజాం ఆపదండోయ్
మనం చెరుకు గడలం
నిజాం గానుగండోయ్
నిజం తెలుసుకోండోయ్
భుజం కలిపిరండోయ్
క్షణం ఆగకండోయ్
రణం ఆపకండోయ్
పదండోయ్, పదండోయ్
పదండోయ్, పదండోయ్!

తెలంగాణ కాంతామణీ
మానభంగమ్ము చేసే
నిజాం కీచకుణ్ణీ
నిజాం పాతకుణ్ణీ
క్షమించం సహించం
సహించం సహించం
అనండోయ్...

నిజాం మిత్తి అయితే
మనం కత్తి అవుదాం
నిజాం ఎర్ర ఇనుమై
మనం సుత్తి దెబ్బై
ప్రతీ చెట్టు కొమ్మా
ప్రతీ రాయి బెడ్డా
తుపాకీ, ఫిరంగీ
ఫిరంగీ గ్రెనేడై
పదండోయ్...
నిజాం ఫౌజుమీదా
రజాకర్ల మీదా
రజారర్ల మీదా
పిశాచాల మీదా
భుజంగాల భాతిన్
తురంగాల రీతిన్
పదండోయ్ పదండోయ్!

తెలంగాణ ముక్తి
విశాలాంధ్ర ప్రాప్తి
ఒకే ఒక్క మార్గోయ్
ఒకే ఒక సార్గోయ్
"కరేంగేయ మరేంగే"
ఇదేనోయ్ నినాదం
విశాలాంధ్ర కోసం
మహా శాంతి కోసం

మహా శాంతి కోసం
మహా క్రాంతి కోసం

పదండన్నలారా!
పదండమ్మలారా!
పదండోయ్ . . .

[ఈరా విశాలాంధ్ర
జూన్ 1948

# ఛలో నౌజవాన్

గట్లు తెగిన నదులారా!
కట్లు తెగిన నరులారా
వైరి పడే పైరు చెడే
ఈ సమయం పెనుప్రళయం

పాటలాగ పాములాగ
వేగంగా కోపంగా
ప్రతి ఒకడూ సైనికుడే
ప్రతి ఒకడూ అతిరథుడే

ప్రతి ఒకడూ రణయంత్రం
ప్రతి నేత్రం శివనేత్రం
ప్రతి హస్తం యమవేత్రం
ప్రతి ఒకడూ ప్రతి ఒకడూ
ప్రతి ఒకడూ బ్రహ్మాస్త్రం

ప్రతి ఒకడూ చక్రధరుడు
ప్రతి ఒకడూ వృకోదరుడు
రిపులబూంచి సవ్యసాచి
మండుతున్న కర్మసాక్షి
ప్రతి ఒకడూ ప్రతి ఒకడూ
ప్రతి ఒకడూ నిటాలాక్షి

గట్లు తెగిన నదులారా
నదులారా! నదులారా!
పాములాగ, పాటలాగ
వేగంగా! వేగంగా! వేగంగా!

[శ్రీరా విశాలాంధ్ర
ఆగస్టు 1948

# తెలుగు సుబ్బోత్రిక్

ఫాక్టరీ గొట్టాల పొగ
కారు మేఘాల రీతిగ
దట్టంగా చంద్రుణ్ణి
ముట్టడించే రోజు,
పంచాంగాలలో
అచ్చు కేసుల్లో
మ్యూజియమ్లలో కూడా
ఉండకుండా
బూర్జువా దోపిడీ
ఫ్యూడలిజం విధంగా
ఉండే అమావాస్య చీ
కట్లని — జీవనదుల
లోని నీళ్ళని తమ ర
క్తం మాదిరిగా, ప్రా
ణం మాదిరిగా కూడా
ఎంచుకొని, లోభంగా
ఆన కట్టలు కట్టి
దాచుకొనగా తయా
రయే విద్యుచ్ఛక్తి
పటాపంచలు చేస్తే

ఊళ్ళో గాలీ వెలుతురూ
తప్ప మరెవరూ

లేరనిపించేటట్లు ఉండే
రోజు - విశాలంగా
ను వస్తాదులు ఉస్తాదులు——
వీళ్ళకి కండలు
తప్ప, మెదడు తప్ప
ఆనందం తప్ప ఇంకే
మీ లేదనిపించేరోజు

వీ ళ్ళందరిలో ఏ
నాడో ఉండే అజ్ఞా
నం పరిగెత్తి పరి
గెత్తి పారిపోలేక
రోడ్లమీద పడిపోయి
లేవలేక పడి ఉం
దన్నట్లు రోడ్లన్నీ
తారు పూతతో
కనబడుతూ ఉండే
రోజూ కావాలి
నాకు - నాకు కావాలి

ఆ రోజు మట్టుకే
కావాలి కావాలి నాకు

ఆ రోజు తప్ప మ
రేదీ అక్కర్లేదు ఉ
హూ! ఇవాళా నిన్నా
పోండ్రా అంతా
పోకపోతే తంతా

(జారు చక్రవర్తుల కాలం దాకా రష్యాలో విశ్రాంతి దినమైన శనివారాన్ని సుబ్బోత్నిక్ అని పిలిచేవారు. విప్లవం తర్వాత ఆ రోజును తమ నవసమాజ నిర్మాణానికి కృషి దినంగా ప్రకటిస్తూ లెలిన్ కూలీ లాగ స్వయంగా రాళ్ళెత్తాడు. నాటి నుండి అది సోషలిస్టు పర్వదినం.)

[ఆనందవాణి
18-12-48

# ఆగస్టు 15

మూలపడి విరిగిన చరఖా
గాంధీజీ పేరు అనే బురఖా
ధరించి వచ్చిన ఈ తారీఖు
మా చెడ్డ నిషా చేసే అరఖు.

నట్టనడి సముద్రం హాంగరు
ఎత్తరేం జీవితం లంగరు
ఎలా వుందో పీపుల్సు పల్సు
ఏ నాయకుడి కయ్యా తెల్సు?

గూ నినడ్డితో ఎగిరే జెండా
నింపింది నిరాశ దేశంనిండా
ఏదయ్యా స్వరాజ్యం అంటే
అదే పదివేలు కదా వింటే!

ఆగదే ఆకలితో పోరాటం,
ఆరదే దహించే ఆరాటం!
అశాంతి కోటిన్నర వోల్టులు!
ఎక్కడ చూసినా రివోల్టులు!

స్వేచ్ఛగా వీస్తుందా గాలి
నేడు, మనకర్మం కాలి?
మచ్చుకేనా లేవు పచ్చిక బైళ్ళు
లెచ్చిపోయాయిగానీ జైళ్ళు.

గరుత్మంతుళ్ళు తెచ్చిన అమృతం
దక్కిందని అనుకోడం అనృతం
దర్భలు నాకేరు మన ఏలికలు
అందుకే ఈ నాలుకల చీలికలు.

కరి మింగింది వెలగపండు,
కాదు కాదంటే పోనిండు
మన స్వతంత్రతం మేడిపండు
మన దరిద్రం రాచపుండు.

ఆనందవాణి ?
15-8-48

# వెయ్యి వోల్టుల కవిత్వం

గారడీవాడు ప్రవేశించి రకరకాల ప్రణాళికల
\+ కాగితం పువ్వులు
వాసన చూపెట్టి

నా బాధే నా ప్రేయసి
— అది
స్వర్గాదపి గరీయసి

పారిజాతసుమాలు సుమా అంటే గారడీవాడి
\+ కోరిక మీద పుర
జనులం మనం చప్పట్లు

ముళ్ళ కంచెలు మేసి బలిసిన
— చింతనిప్పుల కంటిరెప్పలు
ఎప్పుడయ్యా కప్పుకొంటాయి

కొండతాం ఆకలితో హాహాకారాలు హో
\+ రాడి కాందిశీకులైన
ప్రేగులకు కట్లు

ఏడు మేడల మీదనుండే
— ఏడు మల్లెల ఎత్తుతూగే
రాచ చిన్నది ఎప్పుడయ్యా
తొంగి చూస్తుంది

కడతాం జోగి తూలుతున్న శరీరాన్ని
\+ నిటారుగా నించో పెట్టిందికి
గారడి వాడి బె

పువ్వుతొడిగిన పసిడి రవికలు
— నవ్వుతొడిగిన రవిక ముంగురు
నువ్వు అడిగిన ప్రశ్న కేమని
బదులు చెప్పాయి?

త్రంతో వెన్నముకని కట్టివేయమని
\+ ప్రార్థిస్తాం గారడీ
వాడిని మళ్ళీ మళ్ళీ

— దారితప్పిన దేవకాంతను
కానుపొమ్మని చెయ్యి ఊపిందా

ప్రార్థిస్తాం అతగాడు తినిపించే
\+ రసగుల్లాలు మనలో తెరసెల్లా
లకు మధ్యనే ఉండే ఆ

కోటి జలపాతాల మాదిరి
— ఉరుకు కోర్కెల కానకట్టలు
విరకొట్టిందా

కలితో దెబ్బలాడతాయి, అంచేత
\+ గారడీవాడా తంత్రీ
మళ్ళా వాయించు నీ డో

వెతుక్కొంటూ ఇలావస్తే
— పుస్తకాల్లో మాటుమణిగిన
మాటలెందుకు సానపడతా
వెందు కన్నాదా

లు మళ్ళా చెప్పు నీ హాస్యం
+ మా కడుపులు ఆకలిచేత
కాక నీ హాస్యం
— తోనే కడుపులు చెక్కలవనీ

+ భూదేవంత అరుగు
ఆకాశమంత పందిరి

— గుచ్చిన ముత్యాలు తోరణాలుగా
గుచ్చని ముత్యాలు తలంబ్రాలుగా

+ ఇంతలోకే ఇంద్రజాలం
కరిగి పోవాలా ?

[జ్యోతి
15-8-49

# చైనా

మెరుపు మెరుస్తుందని
వెలుతురు వస్తుందని
దారి తెలుస్తుందని
కొన ప్రాణం నిలుస్తుందని

వార్తల పంక్తుల మధ్య
ధూర్తుల భయాల వెనుక

పడుచు గుండెలు సాగిపోతే
ముసలి కొండలు వీగిపోతే
కన్ను బార్లా తెరచుకొంటే
వెన్ను బోర్లా పరచుకొంటే

వార్తల అంచుల మీద
ధూర్తుల సఖ్యతవల్ల

వాన వెలుస్తుందని
వెలుతురు వస్తుందని
వరద చస్తుందని
వంతెన నిలుస్తుందని

చావో మావో తేలాలని
నేడే వీడే కావాలని
పసిడి రెక్కలు విప్పుకొంటే
ఇనుప డెక్కలు రొప్పుకొంటే

ధూర్తుల ఓటమి వల్ల
వార్తల వెలుతురు వల్ల

గడియారం నడుస్తుందని
వెలుతురు వస్తుందని
ఫాక్టరీ పని చేస్తుందని
పంట నిలుస్తుందని

[ఈరా విశాలాంధ్ర (పక్ష పత్రిక)
1-7-1949

# రేపు

ఈ క్షణంయొక్క గుండెల్లోని ప్రాణం
మరీమరీ దారుణం;
అయితేనేం—
నేడు ఎంత కరువుగా ఉందో
రేపు అంత పుష్వ్యగా ఉంటుంది!
అందుకే
జీవించడం నిజంగా మంచి!
కానీ, కోప్పడకు—
ఆశలు పొడుగు
ఆకలి లోతు—
అదీ తప్పే
ఆశలు పడుగు,
ఆకలి పేక
అప్పుడు
రోదసి నీ ప్రేయసి
అడక్కు—
చూలాలు కుమారి చీకటి
ఎవరి పుణ్యం ఈ వ్రేకటి
రేపు ఇంకా పుట్టని పాప
అయినా బ్రతకడం బాగేనా?

[తెలుగు స్వతంత్ర,
5-1-51

# కన్నీటి పాట

(కవిగారి కోసం)

"నుడి కడలి కడుపులో – నుడుల అడుగున పడిన
ఏ మంచి ముత్యాలు – ఏరుటకు ఏగిరో
కవిగారు మరిరారు – కంటి కగుపడబోరు"
పిడుగువంటిమాట – ఎడదపై పడగానె
వాడి ముమ్మొనవాలు – మేనుచీల్చిన లీల
వెలువడును వెల్లువై – వేడి నిట్టూరుపులు.
మృతి వార్త ఆప్తుల – స్మృతులు మదిలో రేపు
ఒక నిమేషముసేపు – గతము భావిని ఊపు
అతి చిన్నవయసులో – అతడు చెప్పిన కతలు
ఆలకించెను చెవులు – పులకరించెను ఒడలు
అతని సన్నిధిలోన – అచ్చ తెనుగును గంటి
అతడిచ్చు పెన్నిధికి – ఆసపడుతూ యుంటి
అచ్చులో నుడి సిరులు – వచ్చునని తలచితిమి
ఆ ఆస అడియాస – అవరాదు ఆంధ్రులకు
సిరిమించు నుడిమణులు – సేకరించే ఋషులు
అస్తమించిన, కొరత – అది తీరెంచెమా? ఊహు.

[విశాఖపట్నంలో ఎంతమంది కవులున్నా "కవిగారు" ఒక్కరే. మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారి మరణంవల్ల ఆయన చాలావరకు పూర్తిచేసిన "నుడికడలి" అనే అచ్చ తెనుగు నిఘంటువు ఆగిపోతే ఆంధ్రులు అక్షరాలా అదృష్టహీనులు. ఆయన శిష్యులు, అభిమానులేకాక భాషా సేవకులంతా ఆ గ్రంథం అచ్చు ఆయేటట్టు పట్టువిడువకుండా పనిచేస్తే మనం ఎరుగని మన భాష కనీసం పుస్తకంలోనైనా బ్రతికుంటుంది.]

[తెలుగు స్వతంత్ర
12-10-1951

# వోటు పాట

[వ్రాసిన అదృష్టం ఆరుద్రది.
పాడుకొనే హక్కు ప్రజలది]

చిచ్చో, చిచ్చో, నా చిట్టి తండ్రీ
మన కడుపు చిచ్చు ఆరిపోవచ్చు ॥చి॥

మీ నాన్న వోటివ్వడని కెళ్ళేరు
మనబాధ తప్పే ఆశ తెస్తారు
ఆశతో ప్రాణాలు నిలుపుకోవచ్చు
ప్రాణాలతో బతికి బైట పడవచ్చు ॥చి॥

కన్నీటివానలో తడిసి ముద్దయితే
కష్టాల సేద్యమ్మె కడుభారమౌను;
కడగండ్ల వడగళ్లు పడరాని పాట్లు
కడసారి యీసారి కడతేరవచ్చు. ॥చి॥

నీ బాధ చూసి నిలువునా నీరై
నీ మామ ఎన్నికల నిలబడినాడు;
అబ్బాయి, నీ మామ ఎటువంటివాడు
ఆడితప్పనివాడు, అతి మంచివాడు ॥చి॥

పాపాయి, నీ మామ కేమి కావాలి
బాధితుల పీడితుల వోట్లు కావాలి
నీ మామ నెగ్గితే ఏమి చేస్తాడు
పక్షపాతం లేక పాలించుతాడు. ॥చి॥

[తెలుగు స్వతంత్ర
9-11-1951

# విజయవాడ పౌరులార!

విజయవాడ పౌరులార! విజ్ఞాన వంతులార!
విజ్ఞాపన చేస్తున్నా! ఇది కొంచెం వినండి!
మీ నియోజక వర్గంలో ఉదయిస్తున్నాడు రవి
మీ నియోజక వర్గంలో నిలబడున్నాడు కవి
రాజకీయ గగనంలో స్వార్థమేఘ తతులు క్రమ్మి
నోరులేని గోవులాంటి పేదజనుల కనుగోనల
విషాదాశ్రు కుంభవృష్టి ధనస్వామి చేయుసృష్టి
వీక్షించిన మరుక్షణం – తన తీక్షణ కాంతులతో
ధన మదాంధ తిమిరావళి దునుమాడే నిమిత్తమే
మీ నియోజక వర్గంలో ఉదయిస్తున్నాడు రవి
మీ నియోజక వర్గంలో నిలబడున్నాడు కవి
రాబోయే విశాలాంధ్ర కాబోయే రాజధాని
విజయవాడ నగరంలో నివసించే జనులారా
విజ్ఞాపన చేస్తున్నా ఇది సాంతం వినండి.

కల్లబొల్లి కథలల్లి చెట్టుపేరు చెప్పుకొనుచు
కుక్కమూతి పిందెలన్నీ చక్కని కాయలు అంటూ
స్వంతలాభ కాంక్షలతో కిరాతులూ, కీరాటులూ
వింత వింత సాకులతో వంతపాట గాళ్ళనే
ఆసేతు హిమాచలం అభ్యర్థులగా నిలిపిరి
స్వాతంత్ర్యం సాధించిన సంస్థ ఒక తామరాకు
దానిమీది నీటిబొట్టు ఆణిముత్య మవగలదా

తామరాకుమీది నీళ్లు—దండ గుచ్చినందువల్ల
దేశమాత కంఠసీమ-తారహార మవగలదా
దేశమాత పాదసీమ సాటిలేని అమల సుమం
జాతిపిత రూపంలో సమర్పించినాడి జనత
స్వార్థ పాప పంకంలో—తమకించే తామరాకు
సాధించే ప్రయోజనం ఇపుడు పీస మెత్తు లేదు.

ధనవంతులు భూస్వాములు, పరిశ్రమల అధినాథులు
వాళ్ళవాళ్ళ వాళ్ళవాళ్ళు వాళ్ళవాళ్ళ లాభాలకు
పదవులకై నిలబడితే — సంపదలకు ఎగబడితే
బాధితులగు జనావళికి - బాసట నిలిచే దెవ్వరు?
నోరులేని ప్రజాతతికి తలలో నాలుక ఎవ్వరు?
విశాలాంధ్ర కడుపుమంట-విజయవాడ గొంతుకతో
ఢిల్లీ దర్బారులోన-దిక్కులు నినదించునట్లు
వినిపించే నాథుడెవడు? జయించే యోధుడెవడు?
సరిహద్దులు లేనివాడు-సమతను ఆశించువాడు
శాంతిప్రియుడు కాంతికరుడు-కవే కదా అతడు
ఏమంటే అనాదిగా-'మానిషాద' పునాదిగా
కూడులేక గూడులేక అల్లాడే జనులగోడు
ఆలకించినాడు కవి-ఆలపించినాడు కవి
ప్రజలబాధ తనబాధగ పాటలల్లినాడు కవి
తనమాటల ఈటెలతో తనపాటల కత్తులతో
కోటికోటి జనుల వ్యథల కూకటివేళ్ళను చీల్చి
కారడవుల మించిన మన ఘోరదరిద్రాన్ని కూల్చి
బంగాళాఖాతంలో ఈ బాధల పడవై చి
జగమంతా పొలంచేసి తన కవితను హాలంచేసి

ఆశయాల ఎడ్లజతల ఆదర్శం కాడి పూడ్చి
బీటలువారిన గుండెల బీళ్లు దున్నుతాడు కవి

చిరకాలం పరపాలన పదఘట్టనవల్ల నలిగి
నిరుపేదల కడుబీదల కడుపునిండ తిండిలేదు
పరరాజ్యం ఖ్యతించినా నైరాశ్యం ఉన్నదేల?
పరపీడన నశించినా ప్రజ నేడు హసించదేల?
భాగ్యలక్ష్మి తాండవించు స్వర్గసీమ సస్యశ్రీలు
రత్నగర్భ పేగులలో సిరిమించే ఖనిజాలు
దోచుకొనే దాచుకొనే దుర్మార్గులు పోలేదా?
పరపీడన పోలేదని కవులంతా గుర్తించిరి

చేనూడ్చే చెమటోడ్చే శ్రామికులను కాల్చుకునే
ధనవంతుల కారణాన కరువు కాటకాలొచ్చెను
పనిచేసే ప్రతివాడికి పట్టెడన్నమే గగనం
పనిచేయని సోమరులకు పంచభక్ష్య భోజనాలు
ఒక్క—చిక్కనట్టి పేద—దుక్కి—దున్నుతాడుగాని
ఒక్క—గింజ మిగలకుండ ఎత్తుకు పోతాడెవడో
విధి విరామ మెరుగకుండ ఫ్యాక్టరీలు పనిచేస్తే
నిర్మించిన చేతులకే-అందదు ఒక సామానూ
తిండిలేదు గుడ్డలేదు-ఉండేందుకు ఇల్లులేదు
ఇంట్లోపల వస్తువులు—ఒంట్లో సుస్తీలు
కార్మికుడూ, కర్షకుడూ, కచేరీ బంట్రోతూ
జాలారీ, పాలేరూ, అగసాలీ, కమసాలీ
చదువుకొన్న ఎన్.జీ.వో. చదువురాని పనివాడూ
ఎవడైనా ఇంతేకద-ప్రజ చుట్టూ చింతేకద
ప్రతి చోటా ప్రతి వీటా ఇదేకథ ఇదే వ్యథ.

ఈ బాధలు కనిపిస్తే ఈ గాథలు వినిపిస్తే
కవులంతా కలం పట్టి కార్యదీక్ష పూనినారు
కలం పట్టి కంఠమెత్తి రంగమందు దూకినారు
రాజకీయ నాయకుల గాజులు తొడిగిన చేతులు
దారిద్ర్యం రూపుమాపి సుఖం మనకి ఇవ్వలేవు
ప్రజలనుండి ప్రజల కొరకు ప్రజా ప్రతినిధులు లేచి
నడుంకట్టి నపుడుగాని నాశనమవబోదు బాధ
జనావళికి సుఖమిచ్చే అనంతమగు పచ్చపైరు
అందరికీ సమంగా పంచిపెట్టుతాడు కవి
అందరికీ ఆనందం అందరికీ తీరుబాటు
అందించే వ్యవస్థలో స్పందించే గుండె కవి
ఆదర్శం మహోన్నతం ఆచరణ అనివార్యం
వివేకవంతులార! విజయవాడ పౌరులార!
తిరుగులేని ప్రతిజ్ఞతో నిలబడున్నాడు కవి!
మీ నియోజక వర్గంలో భువికి దిగును దివి!!

[స్వతంత్ర అభ్యర్థిగా హరీంద్రనాథ చట్టోపాధ్యాయ
విజయవాడ నుండి పార్లమెంటుకి నిలబడుతున్నారు.]

[తెలుగు స్వతంత్ర,
17-12-51

# పగటి చుక్క

వాడికోరల నోరు తెరచిన
వన్యమృగమును పోలు చీకటి
మనిషిమీదకి దుముకుచున్నది
మధ్యాహ్న వేళ!

పగలుమూసిన ఇరులమూకను
పట్టి చీల్చగ పొడిచె నింగిని
పదను పట్టిన కత్తిమాదిరి
పగటిచుక్క

పట్టపగలే కారుచీకటి
ముట్టడిస్తే మూగవోయిన
పెద్దలంతా చుక్కపొడుపుకి
బొబ్బలు పెట్టిరి.

ఇరుల బాధను తొలగజేసే
అరుణతారక వెలుగు సంపద
అడ్డు చెప్పినవారు సైతం
అనుభవిస్తరు.

[ఉదయిని
15-1-52

# ఇదీ దారి

తెనుగు నదుల నీళ్ళలాగ
మనలోగల ఉత్సాహం
నిర్మాణాత్మక శక్తుల
నిర్వాహణం లేనందున
ఉప్పునీటి కడలిలోకి
ఊరక ప్రవహించి పోయె;
అందరాని చందమామ
యందలి కుందేటి కొమ్ము
సాధించే యత్నంగా
సాగించే ఉద్యమాల
ఆర్భాటం ఆపేద్దాం
సంరంభం చాలిద్దాం
పదిమందీ కలిసి కూడ-
బలుక్కునే పరిషత్తున
ఎవడో ఒకడే నిలబడి
ఎల్లరికీ అడ్డంపడి
అల్లరికే దారితీసి
అందరికీ హానిచేసి
నియంతృత్వ ధోరణిలో
నిజంమీద ముసుగు కప్పి
తనదారిని తా బోతే
మనరాష్ట్రం వస్తుందా?
ఆచరణకు కాకుండా
అసలొక తీర్మానమేల?

కాపుర మిష్టంలేందే
కల్యాణం ఎందుకొరకు ?
సోడా పొంగిన పోలిక
శుష్కావేశాలెందుకు ?
తాఁడుఁ బొంగరములేని
దండుగ పథకాలెందుకు ?
తాతలు నేతులు తాగిన
పాతకథలు త్రవ్వవేల
చారడేసి కళ్ళయినా
శవంవల్ల ఏంలాభం ?
తెలుగునేల వికసించే
తెరువేదో వెతకొద్దా ?
తెలుగుకోర్కె ఫలియించే
తెరగేదో చూడొద్దా ?
చీటికిమాటికి వచ్చే
కాటుకాల మాటేమిటి ?
కూటిని గూటిని చూపే
సూటియైన బాటేమిటి ?
అన్నలార తమ్ములార !
అఖిలాంధ్ర జనమ్ములార
ఆవేశాలొదిలిపెట్టి
ఆలోచించండి మీరు
పాతను నెమరేసుకొనే
తాతలు మన నాయకులా ?
నూతన మార్గం చూపే
నేతలు లేనేలేరా ?

చేతికందనున్న ఫలం
గోతిపాలు కావాలా ?
మదరాసుకు ముడివేసుకు
మనరాష్ట్రం పోవాలా ?
మొదటి పనులు మొదటచేసి
తదుపరి సంగతి చూద్దాం
మనదేదో మనకొస్తే
మడిమాన్యా లొచ్చినట్టు
విరోధాలు రాకుండా
వివాదాలు లేకుండా
సత్వరమే మనరాష్ట్రం
సాధించడమే శ్రేష్ఠం.
మొట్టమొదటి మెట్టుమీద
గట్టిగ కాలూని, పిదప
చిట్టచివరిదాకా మన
పట్టుదలను సాగిద్దాం.
మూడుకోట్ల జనం మనం
ముమ్మాటికి గెలువగలం
సాటిలేని తెలుగు బలం
మేటిదనుమ చాటగలం
చీల్చబడిన పరగణాలు
చేర్చి ఒకటి చేయువరకు
విశాలాంధ్ర వచ్చువరకు
విరామమే లేదు మనకు.

[శ్రీశ్రీ పేరు కూడా కలిపి
తెలుగు స్వతంత్ర
12-12-1952

# జిందాబాద్

వర్ధిల్లు వర్ధిల్లు ఓ ప్రజా నాయకా
వర్ధిల్లవయ్యా! చిరశాంతి దాయకా
వెయ్యి నోట్లుల వైరు పాకు తర్వాత
వెన్ను కంపింపగా వింటి దుర్వార్త
ఏ నోట విన్ననూ ఆరాటమేకదా
ఏ చోట చూసినా ఆవేదనేకదా
ఫ్యాక్టరీ గొట్టాల పొగ సన్నగిల్లింది
ట్రాక్టర్లు ట్రక్కులూ స్తంభించి పోయాయి
వేచి యున్నవి చెవులు రేడియో దగ్గరే
కాచు కొన్నవి కనులు పత్రికల కోసమే
పక్షవాతముతో పృధివి పడిపోయినది
పక్షిలా గిలగిలా కొట్టు కొంటూంది
పోరు మబ్బులదండు కదను త్రొక్కె అతను
కారు చీకటి కత్తి రెండు ప్రక్కల పదును
నిష్క్రమిస్తే నీవు విక్రమించును రణము
కోలుకొంటే నీవు నిష్క్రమించును భయము
దేశ దేశ ప్రజలు సుఖినో భవంతు
ఈ సూక్తి నిజమయే బరువు నీ వంతు
ఈ క్లిష్ట సమయాన ఈ కష్ట తరుణాన
నీవు జీవిస్తే సమత నిలబడుతుంది
నీవు దీవిస్తే జనత చూపడుతుంది
జీవించు జీవించు హే సూర్యబింబమా
దయయుంచి జీవించు ధర మూలకంబమా

[విశాలాంధ్ర
1953 మార్చి 8

# ఉద్యమ నాయకా! చదువుకో:

విదూషకుడిగా మారిన అభ్యుదయ ప్రవక్తా!
విప్లవయ్యా నీ చమత్కారాల చమ్కీకోటు
విసిరెయ్యవయ్యా పనికిరాని ఊసుపోని కొయ్యతుపాకీ
విసర్జించవయ్యా బాల్యం వర్జించవయ్యా చాంచల్యం.

కొక్కిరాయిమాటలకీ వెక్కిరింతలకీ కాలం కాదిది
పక్కవాళ్ళనీ బక్కవాళ్ళనీ నక్కలు పీక్కుతింటూంటే
ఎక్కడికిపోయిందయ్యా ఫలప్రదమగు నీ శాపాలకాఠిన్యం
ముక్కుపచ్చలారని వాడిలాగ తప్పటడుగులు వేయడం తగదు!

వ్యష్టిప్రవర్తనవల్ల సమష్టి సంక్షేమానికి విఘాతం వచ్చేటప్పుడు
శక్తులను కూడదీస్తే ఆ వ్యక్తుల పతనం సంభవించక తప్పదు
కుంభసంభవుడివై ఈ దుఃఖాంబుధిని ఔపోసన పట్టకుండా
కుర్రాడిలా కూర్చుని మాటలతో పిచ్చిగ్గోళ్ళకడతావెందుకు?

పనివాడితనం అంటే పసివాడితనం ఎన్నడూకాదు
మొనగాడితనం అంటే పిల్లి మొగ్గలు వెయ్యడంకాదు
నీరధికి వారధికట్టు సాంఘికపయనానికి సారథ్యంచెయ్యి
పాంచజన్యం పలికించు ప్రస్థానమార్గాన మమ్మల్ని నడిపించు!

నిన్న ఎంత ఉదాత్తమైనగీతాల సంగీతాలు ఘాటుగా మీటావు
నిన్న ఎంత ఉన్నతమైన ఆదర్శగిరిశిఖరాలు మాకళ్ళకు కట్టించావు
ఇంతలో ఇంత వివేక భ్రష్టసంపాతం ఎందుకు జరిగిందయ్యా?
చింతించదగ్గది నీవు ఆచార్యపీఠానికి రచిస్తున్న రాజీనామా!

నీనాదాలు పలికిన నీ కంఠం వినోదాలజోక్కు పలుకుతుందా
అనాథల బాధలు చిత్రించిన కుంచెలాంటి నీగొంతుక వెలుగురాసిందా?
నీలో జవసత్వాలుంటే నిన్నటివలె గాండీవం నారి సారించు!
నీ రచనలు ప్రవచనాలుగా నీ స్వప్నాన్ని వెంటనే సాధించు!

గాండీవివి శిఖండి కాకూడదు బృహన్నలగా కలకాలం అవకూడదు
శమీవృక్షంమీది శవాన్ని గుర్తించు! ఆయుధాన్ని సత్వరం అందుకో
సొమ్ములు దోచుకుంటున్నారు, ఇప్పుడు రథాన్ని మళ్ళించకయ్యా
ఉత్తరకుమారుడవుకాదు ఉద్యమనాయకా! నిన్ను నువ్వ
మరచేసితోడుకో.

[తెలుగు స్వతంత్ర
1953?

# ఎంచక్కని కల ...

మీటనొక్కి చంద్రుణ్ణి వెలిగించు
మీటనొక్కి చిరుగాలి విసరించు
ప్రియురాలి పెదవిమీద పెదవి మూసి
సన్నని సంగీతంలాంటి నడుం చుట్టూ చెయ్యి వేసి
ఆనందించు అబ్బాయీ! ఆనందించు
అందించు అమ్మాయీ! పెదవి అందించు
సద్దు చెయ్యకుండా పడుక్కొంది సముద్రం
ముద్దు పెట్టుకుంది చంద్రుణ్ణి మేఘం
మీ యిద్దరి కోసమే ఆగిపోయింది రాత్రి
మీ కోసమే వెలుగుతుంది అగరువత్తి
కావలించుకొండి కావలసినంత ఏకాంతం
కలకలా నవ్వండి మీ చుట్టూ ప్రశాంతం!

నిన్న సాధ్యంకాని తీరుబాటు
నిన్న అందనటువంటి ఆనందం
ఇవాళ ఒడ్డులొరసి పారుతూంది
చేతినిండా దొరుకుతూంది!

నిన్న మన తండ్రులు చాలా నిస్సహాయులు
వాళ్ళ తండ్రులు అంతకన్న అసహాయులు
వాళ్ళ చుట్టూతా మైళ్ళకొద్దీ బీళ్ళు
ఎప్పుడో యింకిపోయాయి వాళ్ళ కన్నీళ్ళు
నిన్న చెరువులూ చెట్లూ ఎండిపోయాయి
బావులూ బతుకులూ యింకిపోయాయి

పశువులూ శిశువులూ చచ్చిపోయాక
కడుపు దహిస్తే ఆడవాళ్లు పడుచుకొన్నాక
కడుపున పుట్టిన వాళ్ళని అమ్ముకొన్నాక
మన తాతలూ తండ్రులూ విలపించారు
తమ దరిద్రం కారణం గుర్తించారు

తెరచిన కన్నులు మూయకముందే
దీనులు పేదలు లేచేవారు
తీరుబాటుగా నిదురించే
తొలికోడిని తామే లేపేవారు

అరక కట్టుకు దున్నబోతే అంతా మెరక
అందులో మొలిచేదికాదు కనీసం గరిక
బక్క చిక్కిన ముసలి ఎద్దులకు, పాపం,
దుక్కి దున్నకముందే వచ్చేది ఆయాసం
ఒళ్లు హూనం చేసుకొని పండించిన పంట
కళ్ళలో వత్తులేసుకొని కాపు కాచిన పంట
సగం వడ్డీకింద తతిమ్మాది శిస్తుకింద
రోజంతా పనిచేస్తే అరగంట విశ్రాంతి
తన బ్రతుకులాగే మాసికలు సైతం చిరిగి
అమావాశ్య ఆకాశంలా ఆరవేసేది చీర
గుడిసెలోంచి బయటకు వచ్చేదికాదు చెల్లి
పొయ్యిలోంచి లేచేదికాదు ముడుచుకున్న పిల్లి !
అప్పుడు అందరం కలసి ఆలోచించాం
ఎగుడు దిగుళ్ళు చదునుచేసే
యంత్రాన్ని తీసుకువచ్చాం
అప్పుడు అందరం కలిసి సంతోషించాం

బండలూ బాధలూ పగిలిపోయాయి
చింతలూ వంతలూ చితికిపోయాయి
రాళ్ళూ రాళ్ళూ నలిగిపోయాయి
కంచెలూ కరువులూ కరిగిపోయాయి
కలకలా నవ్వుతూ యంత్రాలు తోలుతూ
కనుచూపు మేరంత చదును చేశాం
మళ్ళు కట్టి పొలం పదును చేశాం
అరగంట పనిచేస్తే రోజంతా విశ్రాంతి
వానలు కురిశాయి పంటలు విరిశాయి
చెరువులు నిండాయి చేలు పండాయి
గనులు దొరికాయి పనులు దొరికాయి
ఫ్యాక్టరీలు వెలిశాయి పట్నాలు నవ్వాయి
ఇవాళ విశాఖపట్నం సందిట్లో గోదావరి పరిహాసం
ఇవాళ విశాఖపట్నం సందిట్లో కృష్ణవేణి దరహాసం
శోభనం పెండ్లికూతురిలా పండింది ధాత్రి
పచ్చపైరు తలవంచి సిగ్గుపడుతూంది
పుష్కలంగా పంటలూ ఆశలూ పండే
పుష్యమాసమంతా మనకి పండుగే
కోతలు కోశాక కుప్పలు వేశాక
చేతినిండా మనకి తీరుబాటే
తాతానగరంలో చెంజీకటిలాగ
ఆంధ్రదేశమంతటా ఎర్రని రాత్రి
ఆరుబయట చలిమంటలు వేసుకొని
ఆడా మగా సాయులా పాయులా ఆడుతూ పాడుతూ
అప్పుడే గానుగాడిన చెరుకు పానకం తాగుతూ
మూడ్డోర్ఘూము దాటాక అలసిపోయాం

జామిచెట్టుమీాద జాతి రామచిలుక
చింతచెట్టుమీాద చిన్ని గోర్వంక
జోడీలుగా వాళ్ళకి వలపులు
బేడీలుగా చెట్టా పట్టాలు!

అందించండి అబ్బాయిలూ! ఆనందించండి
ఆనందించండి అమ్మాయిలూ! పెదవు లందించండి
ఒంటరిగా ఎవ్వరూ వుండకూడదు
జంట మాత్రం విడువనే కూడదు
పంట కాలువలో పడవషికార్లు చెయ్యండి
పరవశత్వంతో కన్నులు మూయ్యండి
పోయింది పాడు కలలాంటి నిన్నటి రూపు
పోబోదు తియ్యనికల మనకి నేడే రేపు!

చీకూ చింతా లేని ఏ దేశంలోనైనా
శాంతీ సౌఖ్యం వెలసే ఏ కాలంలోనైనా
కౌగిలిలో కనుమూసిన ప్రియురాలి పెదవి
కలకాలం కోరదగ్గ దేవేంద్ర పదవి!

**1953?**

# శోకాల బాకాలు

విరిగి పోయిన సోపానాలమీద
అరిగి పోయిన అడుగు జాడలు
పడిపోయిన భావాల గోడలమీద
పడతాయి భూతాల నీడలు
విడిపోయిన ప్రేమికులమధ్య
పుడతాయి తలపు కలుపు మొక్కలు
చుక్కాని లేని నీ వలపు పడవ మునిగి పోతుంది ఈ తడవ

సూర్యోదయం యొక్క గరుడ ముక్కుమీద
ఆర్యోక్తులు నెమరువేసే వెర్రి గొంతున
చంద్రకాంత శిలా వేదిక చేతిమీద
ఇంద్రజాలం మరచిపోయిన గుడ్డికన్ను
కాలుగాలిన గాలి దేవుని వీపుమీద
తేలుకుట్టినట్టు స్వారి చేసే పిచ్చిమనసు
తొణకని నీ ఎడద కడవ పగిలిపోతుంది ఈ తడవ

పుస్తకాల కాటుక కొండలమీద
అస్తమించని అరుణారుణ ఆశాబింబాలు
ముళ్ళ సలయేళ్ళ కుంటి వలపు గుర్రాల
కళ్ళ కళ్ళాలు లాగలేని సన్నని వేళ్లు
శుక్తిలో, స్వాతిచినుకులాగ సుప్తిలోపడ్డ
రక్తిరహిత విరక్తిభరిత రక్త పాశాలు

మన్మథుడు పోకిరీ భడవ: గోల చేస్తాడు ఈ తడవ

శోకాల బాకాల నూదుతూ సాగే
రాకాసి సైజు ఎర్రని విరాగాలబస్సు
ఆగే స్టేషనులో ఆగకుండా నీళ్లు తాగకుండా
పోగాలపు పొగలు గ్రక్కే విరహాల ఇంజను
కారుమేఘాల పొలాల గుబురుల్లో
దారి తప్పి రెక్కవిరిగిన ప్రేమ డకోటా

దిగ మింగుకోవాలి ఈ తడవ వ్యక్తిగత విషయాల గొడవ

[తెలుగు స్వతంత్ర
—1953 (?)

# వేదన - చింతన

చీకటి చిరునామాగల
చింతన రిప్లయి కార్డు
జాబును రాసినవాడికి
జవాబు రానేరాదు

ఉడుకు నెత్తురు కక్కు-
యువతయె టీబీవార్డు
సందేహాల పెనురోగం
స్వస్థత చేకూరదు

నవీన మత తత్త్వాల
సువాసనల పద్మం
శవాలు వ్యూహాం పన్ని
సవాలు చేస్తాయి

నభః పద్మవ్యూహాంలో
అభిమన్యుడు యువకుడు
జీవన సంగ్రామంలో
శ్రీకృష్ణుడు సూత్రులు-

భరించలేని గాయాలు
ధరించిన ధర్మితి
మారుగొంతు పెట్టుకొనే
ఘోరున ఏడుస్తుంది

బీటలు వారిన కన్నుల
బితుకు బతుకుతుంది
కోట బురుజు పడిపోయి
గుర్తు మిగల నంది

నిడివి మీద నిజం
పొడుగాటి ధ్వజం
నడి నెత్తిన సూర్యుడు
పడనివ్వడు నీడ

ఇరుల సూటు కట్టుకొన్న
ఇనుడు వెలగ డిప్పుడు
ఇనుప కాళ్ళ డెక్కలతో
అని చేయును చప్పుడు

అబద్ధాల వేళ్ళతో
ఆశను విరచిస్తే
భద్రత మధుర స్వప్నమై
నిద్రను కలుగించదు

ఆడ కరువు హృదయంలో
గోడ కట్టినప్పుడు
నీడ కూడ కడవరకూ
నిన్ను అనుసరించదు

నీవు విడుచు నిట్టూర్పులు
నిన్ను గుర్తు పట్టవు
నీడ కరువు దేశంలో
తోడెవరూ రారు.

రాలి పడని చూపులతో
మేలుకొన్న మేకులు
మిషిన్లు పరిపాలిస్తే
నిషా నీకు మిత్రుడు

నీడబరువు నీడబరువు
నిన్ను మోసుకోలేవు
నీతికరువు నీతికరువు
ప్రీతి బండిసున్నా

శ్వాసలేని మనిషిని
శాసించదు చావు
మృత్యువునకు మాత్రం
అసత్యాలు రావు

మృత్యుంజయుడు కిరాతకుడు
నిత్యతపశ్శాలి నరుడు
ఆశాజీవన మాతని
పాశుపతం కావచ్చును

నిరుడు నీతిపరుడు
నరుడు ధనంజయుడు
నేడు స్వార్థ శప్తుడు
వాడు పేడివాడు

వెలుతురు చిరునామాగల
వేదన రిప్లయి కార్డు
జాబును రాసిన వాడికి
జవాబు అందేదెప్పుడు ?

[1953 (?)

# ఏంటల పాట

పిచ్చివాళ్ళ భావాలకు
బ్రేకుల్లేవు, పోనీ, జానేదేవు

బిచ్చగాళ్ళ కన్నీళ్ళకు
బ్రిడ్జేలేదు, బల్లకట్టే లేదు

శ్రీమంతుల నల్ల ప్రభకి
స్విచ్చే లేదు, హాయ్‌రామ ఫ్యూజేపోదు

ముందున్నది మెయిన్‌రోడ్డు
మూఢా! ఆగు; విను; ముందుకు సాగు

పెద్దవాళ్ళ స్వప్నాలకు
పెట్రోల్కరువు, ఇవ్వరు అరువు

ప్రిడిక్షన్లు అచ్చేస్తే
ప్రింటు దండుగ; శుద్ధ దండుగ

భగవంతుడి ఆఫీసుకు
ఫోనేలేదు నేను పోనేపోను.

[తెలుగు స్వతంత్ర

25-12-1953

# ఒకటో ఎక్కం

(నీళ్ళమీద నడిచే E. E. Cummings కవిత్వానికి కుంటిగా ఆరుద్ర అనువాదం.

(1)

ప్రేమ ఒకవాగు అచ్చట
పిచ్చి'వాళ్లు' గ్రోలుతారు ఎవరైతే ఎక్కాలలో
ఆశలకన్నా నిటారు భయాలు
గాని ఎన్నటికీ పేసుపెట్టని పర్వతాలు
ఒకదాని ఒకవేళకన్నా వేరొకదానికి పె...

తెలిసిన సమస్తత అంతర్ధాన మగును.
ప్రేమికులు మనోరహితులు వాళ్ళు
భయాలుకన్నా ఎత్తు ఆశలు కదా
ప్రేమికులు ప్రణమిల్లువాళ్ళు
ప్రేమికులు వాళ్ళు ఎవరి పెదిమలు
సంహరించు అనూహగగనాన్ని
నాకముకన్నా లోతు నరకమ్మగా

(2)

ఎవరైనా (నరుల నరకాలతో కుస్తీనిపట్టాక)
తన స్వర్గంలో తాను కృతజ్ఞతా పూర్వకంగా
పడుతూ ఉండగా

సంపూర్ణమైన ఇంకా అనంతమైన ప్రస్తుతం యొక్క
ఆకుపచ్చని సత్యం అసంఖ్యాకమైన అస్మిసముదాయంలో
ప్రతి ఒక్క ఎవరుల గతాలకే స్వాగతాలు పల్కును.

(ఒక స్పష్టమగు నిర్దుష్టమగు 'బే-వాడు' నొదిలిపెట్టి
టిక్కుటిక్కుగ కొట్టుకొను భూతాన్ని మెరికలాంటి కాలముయొక్క-
ఉత్త మెదడుచే కనిపెట్టబడిన: పిసరంత ఆగు పిమ్మట ఫో)
నేను మరియొక నిట్టనిలువైనదాన్ని సాధించగలనా—
ఎంత హెచ్చుగ నిదురకన్నా నిర్ణీతవ్యవధిలేని మదీయం
—ఇంతగా జననమైనందున పిట్టలేపి పాడంగలేవు
సమస్తాకాశాల సృష్టివలె అత్యంత సులభముగ
(భ్రాంతిగా 'సత్తు'కాని లోకం, బహుశా నీవు
నేను లేనప్పుడు నాబదులు నాఊపిరి పీలుస్తావా?)

(3)

'అవును' ఒక హాయైన సీమ
ఒకవేళ' శరత్కాలమైనన
(నా అందాల భామా)
ఏడాదిని తెరిచెదముగాక చాల
యుగళి తగినట్టి వాతావరణమ్ము
(విడివిడిగ కాదు)
నీవు నా గుండెలసొమ్ము
కాశీరత్నములు పూసేటివేళ
ప్రేమ సబబుకన్నా
నిగూఢ ప్రగాఢ ఋతువు
నా అన్నులమిన్న
(మనమున్నచోటే వసంతలీల)

(4)

కాబట్టి కాలేదు స్వల్పమగు అల్పాల 'యేల'
అది 'అయితే'ల లోలోన కెగబ్రాకి ఎక్కితే

నీలాల స్వర్గాన పచ్చని నేలగాక సంద్రాలకు
ఇచ్చోట చోటుందిలే ముగ్గురు నేసులకు
నీ మధురనేత్రాలు మూసుకొన్నప్పుడే
శతకోటి ఎందుకులు విగతమైపోతాయి
తెరువబడెనా చాలు నీకనులు ఒకమారు
ఒకొక్క కనుకయూ చంపబడు ఇనుమారు

[తెలుగు స్వతంత్ర
నవంబరు 20 1953

# ఒకటో ప్రేమగీతం

ప్రేయసీ నీ కొరకు నా రక్త మొలుగెత్తి
యుప్పొంగి పాడంగ మొదలాడు

అందుకే "అందుకే" యను ప్రేమవృక్షాలపై
నెక్కి "కాబట్టి" పుష్పాలు కోసుకొని వచ్చాను

పుష్పలావికలమ్ము పూలచెండులకన్న
బాష్పధారల పెరుగు వేదనాలతలపై
విరియబూచిన వేడినిట్టూర్పులే నీదు
చీకట్ల కురులలో సింగార మొలికించు

అందుకే "అందుకే"యను నాదుబాధాగ్రముల
నెక్కి ప్రేయసీ నా రక్త మొలుగెత్తు !

[1953?]

# ఒక్కో ఓ చెలియా!

బేడీలుపడ్డ చెయ్యి ఏం రాస్తుంది?
పేడివాళ్ళకి సాహసం ఎలా వస్తుంది?
ససవలూ బానిసలూ సంఘటితం కాలేరు
అసలు అజ్ఞాను లెన్నడూ తిరగబడలేరు

విసం విసం విసం విసంగాక విసం అనే
సీసం బిరడాలు తాపడం కాబడ్డ
చెవులముందెందుకీ విమల గాంధర్వం?

ధనం ధనం ధనం తప్ప వేరేదీ
ఘనం కాము కాదు కానే కాదనే
గాజు కళ్ళముందెందుకీ రసమయ కళాఖండం?

తరుణోపాయం లేదు తమ్ముడూ జీవించి లాభం లేదు
మరణించడానికి కూడా మార్గం లేదు మరో దారి లేనే లేదు
అరుణోదయం అయ్యేదాకా ఆశలుంటాయో లేదో చెప్పు
కరుణలేని లోకంలో కడుపు నిండుతుందనుకోడం తప్పు
అయోమయమైన వర్ణచిత్రంలాగ అలుక్కుపోయింది భవిష్యత్తు
క్రియాశూన్య పథకాల కీలుంపాత్రల నీరుచే కరిగే మత్తు

అఇ ఉణ్ ఋ ఌక్
అందమే హుతభుక్
క ఖ గ ఘ ఙ
కష్టాలకు సంజ్ఞ

చ ఛ జ ఝ ఞ
చావుకి అనుజ్ఞ
అ ఇ ఉణ్ ఋ ఌక్
ఆశే మనశుక్కు—

అందమైన బ్ర—
కొంత మెతుకుతో
నిండుతుంది స్మృ

కడుపునింపు మె—
కొంత బ్రతుకులో
దొరుకుతుంది లే

[తెలుగు స్వతంత్ర
1954

# రొండూ రోకళ్లూ

విను విను విను
విను రూపాయిల డెక్కల ధాటి విను
సిపాయిల క్రొన్నెత్తుటి ధారల
తుపాకుల కత్తులపై చారలు కను

సరి సరి సరి
ఉరి కంబాలకు మన ఆశయాలు బలి
రాంబందుల రాజ్యం లోపల
ఆంబోతులే అమాత్యులు కదా మరి

పాలితుల మెదళ్ళకు దళ్ళు కట్టి
వాళ్ళ చూపుదారిలో కాపలావాళ్ళని పెట్టి
వాళ్ళ కళ్ళ కిటికీలుమూసి మేకులు కొట్టి
పరిపాలించ బోతుంది రేపటి రాజ్యం
మొరలాలించడం అందులో పూజ్యం
ఆశయాలకోసం అసువులు బలిచేస్తున్నా మిప్పుడు
అసువులకోసం ఆశయాలు బలిచేస్తా మప్పుడు!
అప్పుడు ప్రతి ఒకడు ఇంకొకడికి కార్బను కాపీ
అప్పుడు ప్రతియింట్లో శవంలేచినట్లు మరిగే నిశ్శబ్దం

వైతరణికి కాలువలు, కట్టలు కట్టి
రైతులను పండించమంటారు వ్యథ
పద దానివల్ల తీరుతుందా క్షుధ
పద పద పద

[తెలుగు స్వతంత్ర
1954

# మూఢూ మంచ్చెలుకా

ఉండిపో
ఊరుకో
ఎదిరించకు ఏం లాభం
ఒక్కడివే
ఎక్కడికి?
ఎక్కడైనా ఒక్కటే

"నన్ను చూడు
మిన్ను చూడు
మీదని పయోధరాలు"

వానొస్తే
వరదొస్తే
వెళ్ళకు చీకట్లో పడుకో గా వాకిట్లో

ఊపిరి పీలుస్తున్న చూచుకం
ఊరిస్తున్నది చర్మంలో కోర్కెలు
జీరాడుతున్నవి ఉలిపొర కుచ్చిళ్ళు
పోరాడుతున్నవి వాటితో ఉవ్విళ్ళు

పయనించడానికి బదులు మైమరచి
శయనించెను మేధావి మెదడు
పువ్వుని తెలిసినవాడు అతగాడు
రేకు లొక్కొక్కటీ తెంపివేస్తున్నాడు

దైన్యం నిండిన జీవన సమరంలో
దైన్యంగా ఓడిన మానవుడా
ధనానికీ నిధువనానికి
దాసుడైన దాసవుడా

మేలుకో
కోలుకో
మేలైన పనికి పూనుకో

తెలుగు స్వతంత్ర
1954

# నాలుగు నందన్నా

నందుడు రాజవుతాడు–ఆనందం కలుగుతుంది
మందుడా మరణించుతావు అందరి వ్యథ తొలగుతుంది

నందోరాజా భవిష్యతి
ఎందుకో ఒకందుకు ఆ
నందోరాజా భవిష్యతి

కొనసాగే ఉద్యమానికి వెరచి
మూసిన కిటికీ తెరచి
చూడంగలేదు నీ కన్ను
భయపడి వణికేను వెన్ను
తల్లి పెదవిపై చిరునవ్వు తొల్లి ముచ్చిలించావు నువ్వు
తెంపివేశావు జాలిమాలి తోడబుట్టు పసుపు తాళి

కలిపావు నోటిముందు కూట్లో దుమ్ము
కోశావు పాలుతాగిన తల్లిరొమ్ము
ఒలిచావు కాశీలో గోమాతచర్మం
చెప్పులు కుట్టించి చేశావులే ధర్మం
ఎరుపురంగంటే నీకు వెగటు ఎందుకో తగని వెరపు
ఐదువరాలి కుంకుమరేఖ అందుకా చెరిపావు దయలేక

నందో॰రాజా భవిష్యతి
నందో॰రాజా భవిష్యతి
నందో॰రాజా భవిష్యతి

మందుడా మరణించుతావు నీ పీడ విరగడవుతుంది
కందుకంలాగ ఎగురుతాం కల్పవృక్షం అందుతుంది

[తెలుగు స్వతంత్ర
1954

# అయిదూ చిటిగోలుసూ

చాంగు భళారే చాంగు భళా
జంకేల గొంకేల చాంగు భళా

చెరసాల ద్వారాలు తెరిచారు పారాలు
ధరలోన యికమీద చాంగు భళా
చెరసాల లుండవు చాంగు భళా!

హుంకరించెను విప్లవాంకురము మృత్యువై
కంకాళములు సమర ఘీంకారములు జేసె

ఢంకా బజాయించి చాంగు భళా
సంకెళ్ళు విరిగేయి చాంగు భళా!
భూతాలు వైప్లవ్య గీతాలు పాడేయి
ప్రేతాలు 'లావా'కు ఏతాము తోడేయి

చేతనముతో వేగ చాంగు భళా
ఛాతీలు విరుచుకొని చాంగు భళా!

మలయ పవనముకాదు మరణ ఝుంఝులు రేగ
విలయ రుద్రుని యాన వీరభద్రుని సేన

విజయసాధనకై చాంగు భళా
విశ్రమించుటలేదు చాంగు భళా!

పిరికి గుండెలు పేల్చు, కరుకుగుండెలు కాల్చు
నరకాన్ని నరకాలి చాంగు భళా!
దొరకాలి స్వర్గమే చాంగు భళా!

చాంగు భళారే! చాంగు భళా!
జంకేల గొంకేల చాంగు భళా!

ఈ పొలము నీదే యీ హలము నీదే
ఈ ఇల్లు నీదే యీ మిల్లు మనదే
గనులన్నీ మనవే కదరా భళా!
పనిముట్లు మనవే పదరా భళా!

[తెలుగు స్వతంత్ర
1954

# ఆరుందారాలు

ఇరుకు మురికి రోడ్ల మీద
క్రిక్కిరిసిన ఇళ్ళమధ్య
ఈ కాలము స్తంభించెను
ఇరులు భువిని చుంబించెను

ఈ చీకటి కొండలపై
ఇనబింబం ఉదయించదు
ఈ బజారు ముండలలో
ఇన్నురంభ కనిపించదు

పడుతున్నది కన్నీటి జడివాన
కొడుతున్నది నిట్టూర్పు చలిగాడ్పు
కన్ను పొడుచుకున్నా ఇది ఏమాత్రము
తెన్ను తెలియని పాశవిక కాళరాత్రము

ఇపుడు ఏగుండెల వాకిలిలో తల దాచుకొనుట ?
ఏ కౌగిలిలోగిలిలో నా ప్రేమను కాచుకొనుట ?

వణుకుతున్న నా ఈ పేలిన పెదిమలకై
కణకణలాడును ఏ రొమ్ముల కుంపటి ?
కొరడుబారి మరణించే కోర్కెల మేనికి
వరప్రసాద మే కురుల కమ్ముల దుప్పటి ?

ఏ ఎర్రంచుల తెల్లనవ్వు ఈ చలిలో కప్పుకొనుట?
ఏకొనచూపుల కొవ్వొత్తుల కీ చీకటితప్పుకొనుట?

ఆప్తు డెవ్వడు? నీ మిత్రుడెవ్వడు?
చెలి
తప్తహృదిలో దీర్ఘ
సుప్తవాంఛకు పరి
తృప్తి ఎన్నడు? సంతృప్తి ఎన్నడు?

కమను డెవ్వడు? నీ రమణు డెవ్వడు?
సఖి

యముడు వెంటాడగా
సమసిపోయెను కోర్కె

శమన మెన్నడు? సుఖ శయన మెన్నడు?
తోడు లేని నా చుట్టూ చీక టావరించు
దూరదూర తీరాల్లో చుక్క లావులించు
శవంమీద ముసుగులాగ భూమ్మీద మంచు
చలిబారిన గుండెలలో ఆవేదన మించు

[తెలుగు స్వతంత్ర
1954

# ఏడుం బేడీలు

ఏ కొమ్మమీదనో ఎలుగెత్తు పులుగు
ఏ కొమ్మకోసమో ఈ కనులు కనలు
ఆకొన్న కంటిలో ఆతురత రగులు
రాకున్న ఈగుండె వేయిగా పగులు

ఆకొన్న ఈగుండె వేయిగా పగులు
రాకున్న నీకొరకు నాగొంతు నొగులు
నీ కేలు నీ కీలుజడ కుచ్చు తలచి
శోకాన పడిపోయె నా బ్రదుకు వగచి

ద్రవీభూత విరహమ్మున తడిసెను నా'మున్న'లు
ఎవరికొరకు ఎవరికొరకు వెదుకు వెర్రికన్నులు
గగనమందు చిగురించిన నెరవెన్నెల వేసవి
నగవుల నీ పెదవులకై తెగవాచెను వాచవి

పగిలిన నా హృదయఫలక శకలము లొకవేయి
ఎగిరిపడిన విచటకొన్ని అచట పడినవెన్ని
దవుదవ్వుల వినవచ్చెను మంటల జేగంట
దవానలము చివాలుమని రేగెను నా కంట

ఏమున్నది ఏమున్నది ఇకమీదట బ్రదుకు
ఎండమావి గున్నమావినెందు కాశ వెదుకు
ఏమన్నది ఏమన్నది కదలని నీ మోవి
ఏమన్నది ఏమన్నది మోవిమీది కావి

ఇంతలో మెరసింది ఇరులలో మెరపు
సంతోషకళికలను వెలిగించె వలపు
చింతించు హృదయాన చిగురించె వెలుగు
కాంత నీ రాకచే కర్కశత తొలగు
ఓ కలికి ఎడతెగని నీ కనుల పొందు
ఆకొన్న నా కనుల కమృతంపువిందు
నీ కేలు నీ కీలుజడ-కుచ్చుతోను
లోకాని కెదురీత ఈదేను నేను

[తెలుగు స్వతంత్ర
1954

# ఎనివిఁది మనమందా

నీ చేయి నా చేయిపై వేసి
నీ చూపు నా చూపుపై చేసి
నిను బాసి మనలేననే బాసను
నీ పెదవి నా పెదవిపై చేసెను

'ఉన్నాది ఆశపై కొన ఊపిరి
కన్నీరు కాదిదే గోదావరి
నన్నేల విడనాడి పోతావ'ని
అన్నావు బరువుగా ప్రాణేశ్వరీ

విడనాడక తీరలేదు
ఎడబాటు తప్పలేదు
ఇపుడంతా చేదుచేదు
ఈ దుఃఖము పోదుపోదు

నేను ఆకాశమార్గాన పోతుండగా
నీవు ఏకాకివై భూమిపై నుండగా
నాకు నగరాన శతకోటి దీపావళి
కాక అగుపించె నీకంటి చింతాఝరి

నీలమేఘాలు తాకి నా రెక్కలు
ఏల కారాదు రెండు ముక్కలు
నేలపై పడిపోయి నీ అక్కున
జాలిగా చేరెదను గ్రక్కున

నా మేను నీ మ్రోల పడవేసి
నా బ్రతుకు నీ బ్రతుకు ముడివేసి
నినువీడి మనలేననే మాటను
నా ఎడద నీ ఎడదలో నాటును

[తెలుగు స్వతంత్ర
1954

# తొమ్మిది తోకుచ్చు

వస్తున్నా వస్తున్నా
వస్తున్నా వస్తున్నా
కాస్త ఆగు!
ఇది నిటారుమిట్ట
నను పైకిలాగు!

ఎత్తు తెలియని నిటారు
నిట్టనిలువు అనంతం
"ఎన్నడులు?" ఎద దున్నుకొంటూ
భయం విస్మయం మేస్తూంది
మెస్మరించింది యౌవనం నన్ను
విస్మరించాను లోకమా! నిన్ను

నరకం ఇపుడుంటున్నది ఇది నాకొద్దు
స్వర్గం చూపిస్తావా? ఎందుకు పోనిద్దు
త్రిశంకు స్వర్గమిస్తావా? అదికూడా వద్దు
పలురకముల సౌఖ్యమ్ములు పాతకాల పద్దు
నలుచదరపు భోజనమ్ము నాకు ఇయ్యవద్దు
చెలిపోడిమి నిరర్థకం రేపటికది రద్దు
మూఢ తమోగాఢతలో సఖిగాజుల సద్దు
గాఢ పరిష్వంగంలో వేడివేడి ముద్దు
గబ్బుకొట్టు నరకానికి ఇవతలి సరిహద్దు

ఊబిలోన ఈదడమా
ఊహాలలో బ్రతకడమా

గర్జించుము గర్జించుము గమ్యం సామీప్యం
విసర్జించు విసర్జించు విసర్జించు జాప్యం
రాదు రాదు రాదు ఎడదకు వృద్ధాప్యం
తెరువంబడె తెరచుకొనని దివ్యలోక దేహాళి
వినవయ్యెను బధిరులకే పికోచిత కాహాళి

వస్తున్నా వస్తున్నా
కాస్తా ఆగు
చేయూతనిచ్చి మిత్రమా!
మున్ముందుకు సాగు

[తెలుగు స్వతంత్ర
1954

# పదీ పట్టేడా

"ఎన్నాళ్ళు?" వెంటతరమగా
"ఇంకానా?" ఒళ్ళుతురమగా
"ఎక్కడలు" వర్షించి
"ఎప్పుడులు" దట్టించి
"ఎందుకులు" రెట్టించి
పొగలాగ పొరలాగ
పోలేవు నీవు

అంత ఎత్తు ఎగురలేవు విదిలించకు రెక్కలు
ఒక్కడవే ఎక్కలేవు ఎందుకోయి చిక్కులు

ఒక్కడనే ఎక్కలేను
ఇంత ఎత్తు ఎగరలేను
ఎవరేనా తోడురండి
జీవితాన్ని పంచుకోండి

నాచుట్టూ ముళ్ళపొదలు
నాచుట్టూ మంచుపొరలు

కొరడుబారె గడియారం
కరడుకట్టి ఎదభారం
సాగలేను సాగలేను
కొండకొమ్ము ఎక్కలేను

ఎవరేనా తోడురండి
జీవితాన్ని పంచుకోండి
ఎత్తుని చిత్తుచేద్దాం
మత్తుని మాయంచేద్దాం
చేయి చేయి కలుపుకొనుచు
శిఖరాలను ఎక్కుదాం

ఇక్కడే
ఇప్పుడే
ఇందుకే
బ్రతుకుదాం

[తెలుగు స్వతంత్ర
1954

# శ్రీశ్రీ ప్రస్థాన గీతి

స్వేచ్ఛా సమీరంలా శాంతి తీరానికి పయనిస్తున్నావు
హృదయానికి చేరువగనే ఉన్న దూరానికి పయనిస్తున్నావు
మా ఉత్సుక నయనాల ఆమయనమంట నీ పయనం
తెరవు పొడుగునా స్నేహ సౌహార్ద్రాల సుమనస్సంచయనం
నీ ప్రయాణ విమాన యంత్ర నిరంతర ముఖర స్వాతంత్ర్య మంత్రనాదం
ఊదుతోంది నీ చెవిలో కోటికోటి సముత్కంఠిత కంఠాల అకుంఠిత నినాదం
వినీలవ్యోమంలో విమోచన విహంగలా
దశ మావతరిత యుగపురుషుని శ్వేతరంగత్తురంగంలా
సాగుతోంది నీ విమానం
మ్రోగుతోంది సముల్లసిత శుభగానం
లేచి వస్తోంది ప్రాణం

2

సాగు, సాగు సైనికుడా, సాగు
తెల్ల పల్లటీ సాహిణీ! సాగు
కల్లకపటాల ఖద్దరు తెర తొలగించుకుని
కళ్ల కాగడాలతో నీ మార్గం వెలిగించుకొని
కవితా గగనంలో కల్పనా విహంగంలా
స్వప్నాల సాగరంలో స్రియలిజం సబ్ మెరీన్‌లా
లోక్‌సభ రేడియో చర్చలో నీ నేస్తం హరీన్‌లా
జంకు గొంకులు లేక బొంకురంకులు చీల్చుకొంటూ
ఆలోచనల సిగరెట్ లోంచి ఆవేశం పీల్చుకొంటూ
భవితవ్యపు కల్లంలో తాలు చెరిగి పిసలు గింజలు తేల్చుకొంటూ
రేగు, మ్రోగు, ఓ ఆశావైణవికుడా? సాగు

3

శాంతి సరిత్సంగమంలో అఘమర్షణ స్నాన మాచరించి
జన తీర్థాల పావన వనాంతరాల సంచరించి
సుఖజీవన కామనల శుభ సౌహార్ద్ర సందేశా లుచ్చరించి
సుముఖులతో సహకరించి సంసేవ్యుల నుపచరించి
చూడవలసినదంతా చూసీ! రాయవలసినదంతా రాసీ!
భావాల పడుగుపేకల కవితా చీనాంబరాలు నేసే!
(వెడగులు, బడుగులు, చెడుగు లేమనుకొంటే నేమి ?
తెల్లం మన హృదయాలలో కల్ల కపటాల లేమి)
చల్లంగా సాగి పొమ్మా, క్షేమంగా తిరిగి రమ్మా
ఈ పయన మ్మెన్నటికీ కాదు వమ్మా
చల్లంగా సాగి పొమ్మా, క్షేమంగా తిరిగి రమ్మా.

[శ్రీశ్రీ ప్రపంచ శాంతి మహాసభలకు స్టాక్‌హోం వెళ్ళిన సందర్భంలో వ్రాసినది. తెలుగు స్వతంత్ర దీన్ని తిరస్కరించడంవల్ల అముద్రితంగానే ఉండిపోయింది. ఈ అపూర్వ్యం పశ్య ఆలూరి బైరాగి సంస్మరణ సంచిక (1979) లో వెలుగు చూసింది.)

[బైరాగితో కలిసి
రచన : నవంబరు 1954

# కునాయక నింద

గంట స్తంభం చూపెట్టేకాలం తప్పు
మింట చలిబాని ఆరిపోతోంది నిప్పు
గడియారం సరిగ్గా తిప్పు
సూర్యుడి ముఖంమీది మబ్బు గొసెన విప్పు

అమరవీరుల త్యాగాల బేరరు చెక్కులు
ప్రజల బ్యాంకులకు ఫోర్జరీ చేసి మార్చే పెద్దలు
సత్యం సాధించడం కోసం అబద్ధం చెప్తున్నామంటారు
నిత్యం అబద్ధాలాడుతూ
సత్యం సంగతే మరచిపోతూ ఉంటారు

దూర తీరాల్లో ఉన్న గడ్డి పోచతో
జాగుముడి వేస్తాడు నీ జీవితం
మునిగిపోతున్న ఆశయాల ఓడకేస్తాను
ముందుగా తనే గెంతేస్తాడని చెప్తాను

రేపటి స్వాతంత్ర్యం కోసం
ఇవాళ మెదడుకు వేస్తాడు సంకెళ్ళు
రేపటి సౌభాగ్యం కోసం
నిన్నటి దేశభక్తుడు ఇవాళ విద్రోహాట

మనిషికి లక్షణాలు మనస్సూ హృదయం
మనస్సు పరాధీన మయ్యాక
హృదయం శిలారూప మయ్యాక
మనిషి మనిషే కాదు వాడో దెయ్యం

తాను రేపు చేస్తానన్న మంచి
ఇవాళే ఇంకొకడు చేస్తే తప్పా
నేలవిడిచి చేస్తాడు కత్తిసాము
అది వాడి రాత్రికి నాలుగోఝాము

సామాన్యుడా! మనసులోంది భయపడక చెప్పు
సనవలాగ మెదడప్పుకోడం నీకే ముప్పు
కన్ను మూసి తెరిస్తే నేడు నిన్నవుతుంది
ఇవాళలాగే కరిగిపోతుంది నేటి మెప్పు

[1954 ?

# అజావు రాజావ

ఈ రేయి ఇంపుగా నీరెండ కాచి
నీరెండ మోవిపై నీహారహాసం
ఆకాశమధ్యాన చీకటులు చెదిరి
వేలాడుతున్నది వెలుతురుల గుత్తి
కడుదూరమందున కడలి గొంతెత్తి
పాడి చేస్తున్నది పాట కచేరీ.

అగరొత్తి పొగలాగ అగుపించు తీగెల
వీణ వాయిస్తోంది విహాయస కాంత
వినబడీ వినబడని వీణ వినడానికి
విచ్చేయుచున్నారు విగతజీవాలు
విగతజీవుల నల్లసిగలోని పూలకు
తొడిమలే ఉండవవి పడునెపుడో నేలకు.

ఈ నేల ఈ మూల ఇలకోనలసీమ
మసక ఊహాలలోని రసరాజ్యరమ
మోక్షసుందరి కఠిన వక్షోజములవలె
కనుచూపు మేరలో కవల మల లున్నవి
జమిలికొండలనుండి జాళువా జలధార
పారి వైతరణిగా పేరు పొందినది.

నురగలు కక్కుతూ నునువెచ్చని వాగు
దొరకనిదానికై పరుగులెత్తేను
సెలయేటి కెందుకో పొలబారినట్లు
మల మలుపులో పడును ఎలజలపాతం
సెలయేటి మేనుపై వెలుగు ప్రసరించి
తళతళా మెరిసింది తరుణి వైతరణి
వైతరణి సాక్షిగా ప్రేత ప్రేమికులు
ప్రేమించుకొందు రీ రేయి నీరెండలో.

ఈ ఎండ నీరెండ ఇంకెంత సేపు
చిమ్మ చీకటి బూచి కమ్ముకొనిరాదా ?
చంద్రుడో సూర్యుడో తెలియని బింబం
ఎక్కించబడెకదా మింటి ఉరికంబం
అణువుచాపముబూని మొనగాడెవడో
వినువీధి మొగదల నిలబడినాడు.

పిడికెడు కోపాలను
మంత్రించి విసిరేస్తే
ఉడికిపోయింది ఉర్వీతలం
ఉబికింది ఉవ్వెత్తున ధూమం
ఆమడదూరంకాదా
భూమి ఎరుపెక్కింది
కనుచూపుమేర దాటిన చోటున సైతం
కంటికగుపించింది మంటల రోజారంగు
రోజారంగు కూజారంగుగా మారి
కూజారంగు నలుపెక్కింది.

రాకాసి కుక్క—గొడుగా ఇంతెత్తు లేచింది?
ఆకాశమంత, ఆకాశమంటే కేబేజీమంటా?
మిన్నంటిన వామనదేవుని ఒలిచేసిన మెదడా?
ఏమిటీ భయానక ఆకారం?
ఏమిటీ మేఘాకార అఘం
ఏమిటీ ఎగరేగే పొగ?

ఉత్తుత్త బాంబు ఉత్త ఊహాలబాంబు
అమ్మయ్యో బాంబు అణువుబాంబు
రూపిడి ఊహాలలోంచి రూపం కల్పించుకొంది
పాపాలను పండించుకొనే మన శాపంగా మారింది

అణుచాపం అణుచాపం
అణుచాపం మనశాపం
అణుచాపం అణుచాపం
అణుచాపం మనస్తాపం.

ఇంకా పూర్తికాని పెద్ద రచనలోంచి
[తెలుగు విద్యార్థి, 1955

# అభ్యంతరం

పండుగా? ఏదీ? చూపెట్టూ?
పాడనా? ఎందుకూ? పోనిద్దూ!
అరగడుపు తిళ్ళ దేశంలో
పరగడుపున పద్యాలు వద్దులే!
కులం మద్దత్తుతో ధనం గద్దెక్కితే
గూండాలు తగలెట్టిన వాటితోనే
గుణం కూడా తగలడిందిరా తండ్రీ!
మదం తప్ప మనకేం దక్కుతుంది?
మేదకుడివైతే కళ్ళూ నోరూ మూసుకో
మేధావివైతే చెయ్యీ నాలుకా కోసుకో
చేతుల్లో రాళ్లున్న వాళ్ళదే రాజ్యం
గోతుల్లో పడతారా వాళ్ళ ఖర్మం.
ఏకుల యుగం పోయింది మేకుల పెత్తనం వచ్చింది
బాకుల యుగం పోలేదు బాకాల రాజ్యం వచ్చింది
పుస్తకాలు మూసెయ్యి, మస్తిష్కం కట్టెయ్యి
మస్తుగా జీవించు! మైకంలో మరణించు!
హక్కులే అందరికీ ఉన్నాయి బాధ్యతలంటే చిక్కులు
పశువుల్ని అసయ్యించుకోకు అవి మన సోదరులు
జంతువులు విచ్చలవిడిగా రంతులు వేస్తున్నపుడు
మనుష్యులకు బందులదొడ్డి సురక్షిత స్థానం.

# పితృ్రాణము

ఈ వెలిగించిన దీపాల వెల్లువ
ఏ మహనీయుని చేతి చలువ
ఈ భారతీయ చైతన్యస్రవంతి
ఏ భగీరథుని ఫలించిన కృషి?

మాతృభూమి పెదవులపై నవ్వు లే
మనిషి వికసింప చేసిన వాడని పువ్వులు
సంకెళ్ళున్న కంకాళాల నెవరు
సజీవులైన మానవుల చేసినది?

ఆయన మన జాతి నాయన
అహర్నిశలు వీక్షించుతూ ఉంటాడు మనల్ని
జీవిస్తున్నాడు మనలో నే
దీవిస్తున్నాడు మనసులో నే

మెచ్చుకొంటాడు పచ్చగా మనం బాగుపడితే
నొచ్చుకొంటాడు నోములపంట పురుగుపడితే
పూజలు చేస్తారా అతనికి
రోజూ నమస్కరించడం దేనికి?

ఉపదేశం మరచిపోకుండా
అపచారం చేయకుండా
అనుక్షణం అనుక్షణం అనుక్షణం
మనం మనమైతే మంచిది

[ఆంధ్రమహిళ
1956 ?

# మంత్రపుష్పం

కాల ప్రవాహంలో ఒకానొక అనామక తరంగాన్ని!
నీలాకాశంలో ఒకానొక అదృశ్య మేఘాన్ని!
ఇక్కడ పైకి లేస్తూ
అక్కడ తొంగిచూస్తూ
ఎక్కడో పుష్పించిన మంత్రాన్నై
ఇప్పుడు పరిమళిస్తాను.

గణితాలకు లొంగని గులాబీ రేకునై
సంగీతాలకు నోచని నెమ్మోగ పిట్టనై
గుండెల్లో గుబాళించి
కుత్తుకలో విహరించి
మళ్ళీ మళ్ళీ పాడే మంచి పాట నవుతాను
కళ్ళల్లో గడ్డకట్టే నిండు వెలుగు నవుతాను
అప్పుడు దేదీప్యమానమైన చప్పుడు
ఎప్పుడూ జీవాత్మలో ఉండే నిప్పులు

అనామక తరంగాలు ప్రత్యేక మవుతున్నప్పుడు
అదృశ్య మేఘాలు సాక్షాత్కరిస్తున్నప్పుడు
బండరాతి నుండి పిండిన పీయూషాన్నవుతాను
మండుటెండలో ఒలికిన తుషారాన్నవుతాను

అప్పుడు నా పేరు చైత్రం
అప్పుడు నా పలుకు పవిత్రం
ఆనాడే నా విశ్వాసం
అశాంతికి లవిత్రం

సహస్రశీర్షాలతో ఒక జీవం రూపించి
సహస్ర కంఠాలతో ఒక గీతం నినదించి
చిగురించిన చైతన్యం చిద్విలాస మొలికిస్తే
పడగవిప్పి మేధస్సే పరవశించి నటియిస్తే
లోహ ఘంట మోగి మోగి
మెరుపు తీగె సాగి సాగి
నిద్ర వీడి చిద్రూపం
నీహారపు చిద్రుపత్రై
రాకెట్టుల తోరణాలు
స్పుత్నిక్కుల వీరణాలు
అణువు గుండెలో మనిషికి
అమరత్వం లభించాక
ఈ కెరటం తరగమీద
ఆ మేఘం తునకమీద
చెరగనట్టి గీతంలా
చిరకాలం జీవిస్తా.

అయినా ఇది హేమంతం
అంతులేని విధ్వాంతం
ఈ రోజున వినిపించదు
తీరుబాటుగా కాకలి
ఈ రోజున చిగురించదు

హేరాళంగా ఆమని
హిందోళం నినదించదు
మందారం వికసించదు
విరమించని వక్త్రలాగ
వీడి పోదు దారిద్ర్యం

బోరుకొట్టే స్వేచ్ఛలాగా
హోరెత్తును దౌర్భాగ్యం

విషాదాల ఆసావేరి
నిషాదాన స్థాయి నిలచి
ఒకటే రోదన గీతం
ఒకటే వేదన తానం

దోచబడిన పేద చెమట
మున్నీరై పొంగుతూంది
తెలివిలేని హుంకారం
బడబానల మవుతున్నది

మేలుకొన్న అసంతృప్తి
పేలుతున్న తుపాకీలు
ఊరేగే పతాకాలు
చెలరేగే విఘాతాలు

కొమ్మువిసింది రాంబందు
సమ్మె దొమ్మి బందు చిందు
పొలిమేరల విద్రోహం
బుసకొట్టే అపచారం
మతిపోయిన ఋతువా ఇది
గతి మాలి రుజాసా ఇది

పంజావిప్పిన కోపం
శింజానం సడుల పిడుగు
కుడిచేతిని ఎడమ చెయ్యా!
గొడ్డలితో బెదిరిస్తే

అడుగు పెదవి పై పెదవిని
అశ్లీలంగా తిడితే
రెండు కళ్ళు మూతపడ్డ
వెన్నెలోన విధ్వంసన
కుత కుత ఉడికే గుండెల
అగ్నిడుగున లావా సాన
స్వర్గానికి వేయనున్న
దీర్ఘమైన ఆ నిచ్చెన
వైతరణికి వంతెనగా
మార్చుదేల మనిషి మనసు
పేరులేని ఈ కెరటం
రూపులేని ఈ మేఘం
తప్పని సరి ఉప్పెనగా
తెరిపివ్వని పెనుజడిగా
దారుణాన్ని ముంచెత్తే
కలుషితాల కడిగేసే
శుభ సమయం ఏనాడో
ఆ 'డీ–డే' ఈనాండే
ఈ నాడే ఈ నాడే
అనగలిగే అదనులోన
సగటుమనిషి గుండెపువ్వు
ప్రణవానికి ఆయతనం
వైరికవుల పిచ్చిపాట
నరకానికి టా, టా
స్వర్గానికి బాట

[విజయవాడ రేడియోలో :?]

# చెప్పా! చూద్దాం!

హృదయం! హృదయం! ఏం చేస్తావ్?
ఉదయం నేడిక కాదంటే,
చదల చీకటే పోదంటే,
హృదయం! హృదయం! ఏం చేస్తావ్?

కర్రి చీకటులు కదలవు మెదలవు
పుర్రెలు తారల పుక్కిలించినవి
ఎర్రని సంధ్యా? ఏదీ? రాదే?
వెర్రి హృదయమా! ఏం చేస్తావ్?

అరాచకంలో అమానుషంగా
విరామ మెరుగని విషప్రయోగం!
వినాశనంతో పరాసికాలా?
ఒరేఁగ్ హృదయం! ఏం చేస్తావ్?

ఏమిటి చావుని రేపెడతావ్,
ఏమూ నెత్తురు నీలో లేవా?
ప్రేమించిన వారొకరూ లేరా?
స్వాఁమీ హృదయం! ఏం చేస్తావ్?

పిడుగే గొంతుగ్గై విచ్చిన పిమ్మట
ఎడా పెడా బ్రతుకు కెగిరినమీదట
కడలి పొంగితే కథ పూర్తయితే
ఎడదా! ఎడదా! ఏమౌతావ్???

[ఆంధ్ర మహిళ
?

# కుక్క చంపిన బిడ్డ

ఆశలు పెట్టుకున్న ఇజాల ఆసుపత్రిలో
అప్పుడే పుట్టిన ఆశయాల ఆడపిల్లను
ఏభై మెగాటన్నుల విద్రోహం లాంటి
ఊరకుక్క పబ్లిగ్గా ఎత్తుకుపోయింది,

కునికిపాటు పడే మెదడు
కుక్కని చూడలేదు.
హుషారుగా ఉండవలసిన హృదయం
నిషాగా నిద్రపోయింది.

ఉద్యమ మాతృమూర్తి పడ్డ నొప్పులు
వృథా వృథా నిట్టూర్పు లయినవి.
పురిటికందును ఊరకుక్క
భుజించిన పిమ్మట గాని
కాపలా కాయవలసిన కళ్ళు
కర్తవ్యాన్ని గుర్తించలేదు.

గతాల సేతుబంధనానికి
కాంక్రీటు స్తంభాలకు
కాంట్రాక్టు పాడుతున్నారు.

పాతిపెట్టిన శవాలను
పైకి తీస్తున్నారు – ఎక్కడో దాస్తున్నారు.
సమాధులు పగలకొట్టినంత మాత్రాన
చచ్చిపోయిన సత్యానికి ప్రాణం పోస్తారా?

బకాసురుడు దేవు డని
భజనలు చేశారు.
భస్మాసురుడు సాధు వని
బాకాలు ఊదేరు.

నిర్దాక్షిణ్యానికి నియంతృత్వ మిచ్చారు.
కర్కశత్వానికి కట్టేరు పట్టం.

ఆకలిని రూపు మాపుతా రనుకుంటే
అమాయకుల్ని పొట్ట పెట్టుకున్నారు.
చీకటిని చిదిమి పారేస్తా రనుకుంటే
ఇరుల పంటకు వారు ఎరువులు వాడేరు.

భల్లూకం ఆర్డరేసి ఆడమన్న
హాల్లీసః మాడాయి పిపీలికలు.
కుక్క మొరిగిన ఉరుములే
ఋక్కు లనుకొని వల్లె వేశాము.

కమ్మని మన తండ్రిమీద వాడు
దుమ్మెత్తి పోస్తే దోసిళ్ళు పట్టాం.
నొచ్చుకోవలసిన తిట్లు విని
మెచ్చుకున్నాం – మెడల్సుగా గుచ్చుకున్నాం.

దూరపు కొండల నునుపు
దూదిపరుపు లనుకున్నాం.
అక్కడ వర్షం పడితే మనం
ఇక్కడ పంచనుండి ధారకు బాల్చీలు పట్టాము.

ఆశలు పెట్టుకున్న ఇజాల ఆస్పత్రిలో
అందరి రోగాలు కుదురుతా యనుకున్నాం.
కుదరని రోగాల కోరలు
గుచ్చుకుంటున్నాయి గుండెల్లోను.

నెత్తురు కక్కుకుంటూనే
నిచ్చెనలు మోస్తున్నాం,
ఆకాశంలోకి వేస్తున్నాం.

భూగోళం చుట్టూ ముళ్ళకంచెలు
మంచు కెరళ్ళ మండలంలో మంటలు
మానవుడు చేస్తున్న హోమంలో
మంచితనం సమిధగా మండిపోతోంది.

ఇతర గోళాలకు ఎగబ్రాకే మనిషి
ఇరుగు పొరుగువాళ్ళను చేస్తాడా మసి ?
అష్టకష్టాల అష్టగ్రహకూటం
అరిష్టాల తయారీకి ఆసన్న మవుతోంది.

గ్రహచారం తప్పి గాలిమేడలు
గాలిలోనే ప్రేలి కూలిపోతున్నాయి.
పవిత్రులు పితుకుతున్న ప్రణాళికల పాలలో
మజ్జిగనీళ్ళు పోయబోతున్నారు దుర్జనులు.

కబంధుడు హస్తాలు చాస్తూ ఉంటే
కరతాళధ్వనులు చేస్తున్నారు పిచ్చివాళ్ళు.
సాలెగూడులోనికి ఊరేగి
సందడిగా పోతున్నాయి మక్షికాలు.

ఎక్కడా ఆశాకిరణం లేదా ?
ఒక్కడికీ చీమ కుట్టినట్లు లేదా ?
కన్నీళ్ళపైన కట్టిన ప్రాజెక్టు
కరెంటు ఉత్పత్తి చేయదా ?

కటిక చీకటి గంతలను
శాంతి హస్తాలు విప్పవా ?
హింసాత్మకవాది హిడింబాసురుడు
ఇంతకుముందే మరణించబడ్డాడు కదా ?

గంధోళీ గారడీవాడు ఘటోత్కచుడు
గాభరా పెట్టినా కనుకట్టు విప్పడా ?
ఆశలు ఫలించే ఇజాల ఆస్పత్రిలో
ఆదర్శాలు నిజం చేసే ఇంకో బిడ్డ పుట్టదా ?

పూర్ణ గర్భిణి శాంతికి
పుట్టబోయే పాపను
పట్టుకుపోనివ్వరాదు కుక్కను
పెకలించనివ్వరాదా మొక్కను.

మెదళ్ళ దళ్ళు విరక్కొట్టండి
కళ్ళపరదాలు కత్తిరించండి
చూపుదారిని శుభ్రం చెయ్యండి.
పుట్టని పాపకోసం ఇప్పట్నుంచే
హృదయాన్ని ఉయ్యాల చేసికోండి !

[మద్రాసు రేడియోలో
1956 _అనుభవాలతర్వాత ఎప్పుడో ?

## బహూ పరాక్!

పొలిమేర నెవడురా పొంచున్నాడు ?
అద్దాని నెవడురా ఆక్రమించాడు
బంగారుసీమ ఇది అంగుళమైనా
పగవానిచేతిలో పడనీయబోము.

కండబలమున్ననూ గుండెదిట వున్ననూ
కదన మొనరించగల కారణా లున్ననూ
సాధుశీలముతోడ సర్దుకొనిపోతే
ససవలని భావించు సాహసుల మనల.

విక్రమించిననాడు విజయమ్ము మనదే
ఆక్రమించినవాడు హతుడు అవుతాడు
సరిహద్దు దాటితే సమరమే కదరా
శత్రుత్వ మొద్దని చాటరా పదరా.

[ఆంధ్రప్రభ దినపత్రిక
ఆగస్టు 1959

# ముచ్చటైన విందు

హిమం కరిగి తమం తొలగి
సుమం నేడు విరిసెను
సుమం విరిసి సుఖం మెరిసి
శుభం ఇదే వెలసెను.

చిరునవ్వులు చిందుతోంది
చేదు చేదు పువ్వు
సొగసు కోర్కె రేపుతోంది
పగరు వగల కాయ

చల్లని చవులూరించెను
పుల్లనైన పండు
మూడు రుచుల కలగలుపే
ముచ్చటైన విందు.

# తస్మాత్ జాగ్రత

ఊళ్ళో కరెంటు ఆగిపోయింది
ఉప్పెనలా చీకటి విరుచుకు పడింది
అగ్గిపుల్లలు వెలగడం లేదు
కొవ్వొత్తులు కాలడం లేదు

జనరేటర్లు, మోటార్లు మూగపోయాయి
క్లబ్బుల్లో పేకాటలు ఆగిపోయాయి
సినిమాహాళ్ళలో ఈలలు గోల పెడుతున్నాయి
కలవాళ్ళ యిళ్ళలో ఫ్రిజిడయర్ల మంచు
కరిగి కరిగి నీళ్ళు కారిపోతున్నాయి
బ్యాటరీ లైట్లు లాటరీ కొడుతున్నాయి
ఎన్నికల వాగ్దానంలాగా ఏ లాంతరూ
ఏమాత్రం పనికిరావడం లేదు

చేతులు ముడుచుకొన్న సంఘం
చేతనా రహితమై స్తంభించి పోయింది
కళ్ళున్న వాళ్ళంతా కంగారు పడుతూ వుంటే
కబోదిని నేను మాత్రం కలవర పడలేదు
నాకు తెలుసు! నాకు తెలుసు! నాకు తెలుసు!
వెలుతురు సమ్మె చేసినప్పుడు
కదలిక కరడు కడుతుంది

# జ్యోతిర్గీతి

సాంప్రదాయకమైన సన్మార్గదర్శివై
దివ్యదీప్తుల కొరకు దీక్షబూని
దశదిశావ్యాప్తమా దట్టమాదిట్టమా
తిరమైన తిమిరాల తరిమివేయ.

స్నేహమే స్నేహమై శీలమే ప్రమిదగా
చిత్తశుద్ధిని నీవు వత్తి చేసి
వెలిగించుమమా జ్యోతి వెలిగించు మాజ్యోతి
వెలిగించు వెలిగించు విశ్వశాంతి

వేడిమి కానట్టి వెలుతురు కావాలి
అది నువ్వు తేవాలి అక్షరాల
కోటి వోల్టుల కాంతి మూటకట్టుకు తెచ్చి
పది మందికీ నువ్వు పంచిపెట్టు

పంచిపెట్టుటకొరకు మంచిప్లానులు వేసి
కనిపెట్టు వెలుగుల ఉనికిపట్టు
ఆవేశవాహిని కానకట్టను కట్టి
పుట్టించు దానితో గట్టి పవరు

చౌకరేట్లకు కాంతి సరఫరా చేయగా
ఇంటింట ప్రతిరాత్రి ఇనుడు వెలుగు
ప్రతివారి హృదయాన ప్రభలు నిండిన నాడు
జగతియే నిజమైన స్వర్గసీమ

ఆమహోన్నతమైన ఆశయ సిద్ధికై
చెచ్చిర వెలిగించు చిన్నజ్యోతి
ఈ చిన్నజ్యోతియే ఇంతలో పెరిగి
మహాజ్యోతిగా మారి హాయినిచ్చు

ఈ జ్యోతి ఈనాటి ఇరుల సంద్రములోన
లక్ష్యాన్ని చూపించు లైటుహౌసు
ఈ జ్యోతి ఈనాటి ఇక్కట్ల చీకట్ల
చిరునవ్వు వెదికెడి సెర్చిలైటు

ఈ జ్యోతి ఈనాటి ఇడుముల కడగండ్ల
టకటొంకు దారుల టార్చిలైటు
ఈ జ్యోతి రేపటి ఇంపు సొంపుల
నిత్య కల్యాణ మందున గ్యాసులైటు

[ఆంధ్రజ్యోతి డైలీ ప్రారంభ సంచిక
2 జూలై 1960

# కొత్త సద్ధలి

**స్వాతంత్ర్య సమర - ఉదాహరణం**

ధీరులు కర్మవీరులు సుదీర్ఘ రణమ్మున మాతృభూమికై
పోరినవారు జైలునకు పోయినవారు విముక్తి కోసమై
బారులు బారులై మరతుపాకుల కాహుతులైనవారు స
ర్దారులు నా మనోరథరథమ్మున సాగెద రెందరెందరో

మరియు జీవితమందు సౌఖ్యము మరిచిపోయిన మంచివారలు
ధర నహింసా సమరమందున ధారవోసిరి రక్తధారలు
కలిమి పదవుల నొక్క మాటగ కాలదన్నిన త్యాగరూపులు
తలలు వంచుక తిరుగజాలని ధామమందున పాతకాపులు
పరుల రాజ్యపు కారుచీకటి పారద్రోలిన సారసేనలు
కొరతలనియెడు గ్రీష్మమందున కురియసాగిన పూలవానలు
అలయజాలని వేకువందున ఆలపించిన మేలుకొల్పులు
తిరుగుబాటున కత్తళాలుగ తెల్లఖద్దరు పలువదాల్పులు

అరచి వందే మాతరమ్మని
వెరవనేలా వేగరమ్మని
కదన భూమికి సాగవలసిన
అదని దేయని ముందు తెలిసిన
మొదటిరోజుల మేటిశూరులు
హృదయవీధిని పెక్కుసారులు
కానుపించిరి అమరవీరులు
మేను దాల్చిన కలలబారులు

వారల ఆత్మలన్ బిలిచి స్వాగత మిచ్చెద ఘర్మవాహినీ
ధారల పాద్యమిచ్చెద ప్రదక్షిణ చేసెద తీపి తీపిక
న్నీరమునర్ఘ్యమిచ్చెద వినిర్మలభక్తిని నా ఎడందక
ర్పూరనివాళినిచ్చెన ప్రబుద్ధుల గొల్చెద పాటపాడుతూ

మరియు స్వాతంత్ర్యాబ్ధి మంథనపు తొలి వేళ
కరడుగట్టిన మొదటి కాలకూటపు కీల
గోలువారల ఉక్కు గుండె దిటవును గూర్చి
ఏలికలు బెదిరెడు సురేంద్రనాథుని గూర్చి
అల్ల బంగాళమున ఆందోళనల నెంచి
తెల్లవారల హజము వెల్లువగుటగురించి
ఆశయమ్ముల తొలుత నమలుజరుపుట గూర్చి
దేశిసరుకులు చేసి తెచ్చి అమ్మట గూర్చి

బాలగంగాధరుని
త్య్వోళ్ల మోగిన ధరణి

పులకరించుట గూర్చి
జలదరించుట గూర్చి
ఆంధ్రతిలకును దలచి
సాంధ్రభక్తిని గొలిచి
ఇతరులందరిగూర్చి
ప్రతినబట్టుట గూర్చి

ఎవ్వరిచే లభించె మనకీ తరమందు స్వరాజ్యలక్ష్మి ఆ
కవ్వడి సాటివచ్చు వెనుకాడని జోదుల సాహసాలచే
నిర్వైరపాటజెందె నవనీతలమంతయు వారిచేత నా
క్రొవ్విరిభావగీతికల కోర్కెలు పండును గుండెనిండుగా

మరియు దాస్య శృంఖలాలమనికి రోయువారిచేత
ఇరుల మధ్య బ్రతకలేని ఎదల మంట వెలుగుచేత
గదరు పార్టిలోన చేరి కత్తి దూయువారిచేత
చదువు సనిధ్యాలన్ని వీడి సమ్మె చేయువారిచేత
పగను పట్టి పాముబోలె పడగ విప్పువారిచేత
సగములోనె జీవితాలు సమసిపోవువారిచేత
పట్టరాని క్రోధమందు పరుల జంపువారిచేత
ఎట్టులైన పరులపీడ ఎగురగొట్టు వాంఛచేత

మొట్టమొదటి బాంబు పేల్చి
గట్టి ప్రభుత గుండెచీల్చి
ఉరికొయ్యకు చేరువాడు
మరణించుచు బ్రతుకువాడు
ఖుదీరాము బోసుచేత
సదాశయుని దీక్షచేత
అతనినంటి వారిచేత
చతురులైనవారిచేత

సంప్రాప్తించిన దివ్యశక్తి నిటుపై సామాన్య జీవాల కో
సం ప్రాణమ్ములనిచ్చి కాతు మన యీ సంఘంపు ప్రీత్యర్థమై
సంప్రోక్షింతును వేదమంత్ర తతిచే స్వాతంత్ర్యశస్త్రములన్
ఇంప్రుష్టై సెద నేటి జీవితము నే నెల్లుండి సౌఖ్యాలకై

మరియును చాలీచాలని బ్రతుకుల గ్రమ్మగడివారల కోసము
నిరతము వ్యథలోసతమతమయ్యే నిరుపేదకు సిరులిచ్చుటకోసము

పోరెను పోరెను భారతదేశము పూనుననాతొలియావేశము
కోరికలన్నియు తీరుటకోసము కొరతలు కొరవడిపోవుటకోసము

నల్లనిఖండపు చీకటిలోపల నరులకు వెలుగుల నిచ్చుటకొరకై
తెల్ల ప్రభుత్వపు సింహస్వప్నము తీరుగ దోచిన ధీరునికొరకై
చర్మపురంగే ముఖ్యముకాదని చాటిన మేటిమహాత్మునికొరకై
ధర్మము ధరలో స్థాపింపుట కవతారమటంచనిపించు ఘనునికై

చిందరవందర చింతలవంతల
గందరగోళపు మనుగడ పుంతల
ఘంటాపథముగ కూర్చదలంచిన
మట్టిబెడ్డనే మణిగావించిన
బంధములనియెడు ఇరులకు సరోజ
బాంధవుడగు గాంధీకై పరాజ
యమ్ముల జయముల చేయుటకొరకై
క్రమ్మిన వేదన చీల్చుటకొరకై

నడుములు కట్టినట్టి నరనారుల ధైర్యమువల్ల నేలపై
పిడుగుల వర్షమట్లు శరవేగముగా పడు గుండ్లవానబో
తడబడకుండ ప్రాణములు త్యాగము చేసినవారివల్ల చే
పడె మనకీ స్వరాజ్యరమ వారిఋణమ్మును తీర్చ శక్యమే ?

మరియు లెక్కకురాని మాననీయులవలన
శిరసుపై లాఠీలు చిట్లిపోవుటవలన
ఓ డయర్ రక్తాన ఓలలాడుటవలన
ఆడువారిని కూడ హత్యచేయుటవలన

చంపరాన్ మండలము కంపించడం వలన
సంపూర్ణ స్వాతంత్ర్య సమరశంఖము వలన
విప్లవాగ్నుల మరుగు వేడి నెత్తురు వలన
మాప్లాలు తిరగబడీ మైక మొదలుటవలన

బిరుదములు విడనాడి
హరిజనుల జతగూడి
వతను బట్టలు కాల్చి
ముతక ఖద్దరు దాల్చి

సకుటుంబముగ దూసి
పికిటింగులను చేసి
పోరు సల్పుటవలన
పేరు నిలుపుట వలన

చేతులనెత్తి మ్రొక్కి మృతజీవుల దివ్యసమాధిముందు నా
చేతపు పుష్పగుచ్ఛమిడి సేసలు జల్లి నమస్కరించుతా
మాతృపదాల సన్నిధిని మానము ప్రాణములిచ్చువారికిం
జేతును వీరపూజ విరచించిన నూతన కావ్యమాలతో

మరియు సీతరామరాజు మరపురాని ఆత్మబలికి
మరల మరల చెరల జిక్కి మనికి చితుకు జనావళికి
యుగయుగాల నిలచిపోవ ఉద్యమచేయు వీరతతికి
భగత్సింగు మనసుపొందు పవిత్రమగు అమరస్మృతికి

ఎన్నదగిన జనవరినెల ఇరవయ్యారో తేదికి
జన్మమువలె స్వాతంత్ర్యపు శపథము చేయు యుగాదికి
అసహాయోద్యమ మందసహాయశూరసైన్యానికి
అసలు సిసలు అగ్రేసరు లనూహ్యమైన త్యాగానికి

తెల్లవారుదుర్మాములందు
తెల్లవారు భీతిజెందు

ప్రభాతఫేరి సలిపినట్టి
సభలు మిగుల జేసినట్టి
పతాకాన్ని ఎగురవేసి
ప్రతాపాన్ని తెలియజేసి
పాట్లుపడిన యువజనులకు
కోట్లకొలది సోదరులకు

మొదటి దినాలలో బరువుమోసినవారల సంతతే మనం
హృదయములందు వారల శుభోద్యమగాధలు మారుమ్రోగగా
వదలిన నిద్రలో పరమపావనమైన స్వరాజ్య సస్యముల్
పదిలము చేసికోబడెను పచ్చని స్వప్నపు గాదెలందునే

మరియు నది మనయొక్క మాటలందు
సిరులు లభియించగల చేతలందు
పంచవర్షాభ్యుదయ పథకమందు
కంచములు నిండు మన కలలయందు
సోలిపోయెడి దివ్యసుఖములందు
తేలిపోయెడి వింత తీరులందు
మరచిపోరాదుకద మనుగడందు

దాచుకోవలెను
కాచుకోవలెను
పంచుకోవలెను
ఉంచుకోవలెను
సాటివారితో
తోటివారితో
అందమగు పొందు
ముందు ఎదలందు

దేశమున నా జనులు
దివ్యసుఖవాహినుల
తేలవలె సంతతము
నాలో
ఆశయము తీరవలె
ఆశలు ఫలించవలె
ఆమని నిరంతరము
పూస్తే
క్లేశము నశించవలె
క్రేళ్ళురుకు లేళ్ళవలె
గొంతులిడు నా జనుల
కోసం
పాశురపు పాఠముల
భాషణము చేసెదను
వాసిగల మంగళమహాశ్రీ.

[వివరణ : సంబోధనతప్ప తక్కిన ఏడు విభక్తులూ వాడి చెప్పిన ఉదాహరణ కావ్యాన్ని 'సద్దలి' అంటారు. సంబుద్ధి కూడా ఉంటే 'బద్దలి' అంటారు.]

[హైదరాబాద్ రేడియోలో
—1960 ఆగస్టు.

# రాఘవా స్వస్తి! రావణా స్వస్తి!

రాచరికానికి స్వాగతం చెప్పే గొంతుకతో
నీచమైన బానిస విధానం ఖండిస్తాము
జగడంలో గెలిచిన తరవాత నీతో
జట్టుకట్టి, కట్టకట్టుకొని ఊరేగుతాము.

నిన్న నీ జెండా కిందకి దింపేశాము
నేడు మళ్ళా దానినే ఎగరేస్తాము.
భాయీ-భాయీ అంటూ చేయీచేయీ కలిపిన
పక్కింటివాడు మా నట్టిల్లు దోచుకుంటే ఊరుకుంటాం

పొరుగువాణ్ణి పొగడడం మరియాద
ఇరుగువాడి లెంపకాయకి రెండో చెంప చూపిస్తాం
మా యింటికొచ్చిన అతిథి ఆనందానికి
మందు పెట్టిన పులిని విందు చేస్తాము

దాచివేసిన దగలా-గిగలా దులిపి
పాచికంపు ప్రభువులు తొడుక్కుంటారు
ఛాతీవిరిచి సగర్వంగా ముందుకొస్తారు
తాతలు తాగిన నేతులు తరువాతతరం తేనుస్తుంది

అంతర్జాతీయతపేర ఆత్మీయుల నిరసించే
అతివాదులూ మాలో కొంతమంది ఉన్నారు
అన్నం పెట్టిన యింటికి కన్నంవేసిన వాడు
ఆట్టే నేరం చేయలేదంటారు వాళ్లు

ముసలితనం గద్దెమీద నుంచి
ససేమిరా దిగనంటుంది
పదేళ్ళు పాలించిన తరవాత
పదవులు విసర్జించమన్నాం నిన్న
ఫరవాలేదు, నిర్బంధం కాదు
పట్టుకు వేళ్ళాడమంటాం ఇవాళ

నయాజమానా సోషలిస్టు నమూనా
నైతికంగా పతనమైనా ఆర్థికంగా గెలుపు
ప్రత్యర్థుల నినాదాలు మనమే అరుస్తాము
ప్రభుత్వం మన గుప్పిట్లోనే పెట్టుకొంటాము
ఎదుటివాడు గెలిస్తే ఏలాగైనా దింపేస్తాం
ఎలాంటివాడితోనైనా నేస్తంకట్టి పదవి నిలుపుకుంటాం
మనుష్యులు తిండిలేక మాడి మరణిస్తే
మనమేం చేస్తాం అది వాళ్ళకర్మ
ఒట్టిపోయిన ఆవులు గడ్డిలేక చస్తే
కట్టుకున్నా మనుకుంటాం పాపాన్ని.

కుళ్ళూ బురదా ఉండనే ఉంటుంది
కళ్ళుమూసుకోవాలి చూడనేకూడదు వాటిని
చుట్టపు చూపుకొచ్చే రాచరికానికి
పట్టాలి మేము బ్రహ్మరథం.

సగం నగరం శుభ్రం చేద్దాం
మిగతావి ఎలాగున్నా ఫరవాలేదు
కుళ్ళూ దుమ్మూ ఊడ్చేసి
గుప్ చిప్ గా తివాసికింద పోగేద్దాం

రాచరికం ఊరేగే వీథుల్లో
రాకపోకలు బంద్ చేసేద్దాం
ఏడు గంటలకి సంబరమైతే
మూడుగంటల నుంచీ మూగమందాల జనాన్ని
దారి పక్క నిలబడ్డానికి సీట్లు
దక్షతగల వ్యాపారస్థుల్ని అమ్ముకోమందాం
అమాయికమైన ప్రజలు అధికారాన్ని దర్శించి
ఆహా-ఆహా-ఆహా తరిస్తారు

మన స్నేహితుల్ని వాళ్ళ స్నేహితులు
మలమల మాడ్చినా ఆ మాట ఎత్తం
పిప్పి పిప్పిగా చితక్కొట్టి చంపేసిన నాయకుడు
తప్పించుకు పోయాడంటారు రాచరికపు చుట్టాలు
నామ్ కేవాస్తే స్వాతంత్ర్యం అంగీకరించని
నల్లవాళ్ళని చంపినా పాపంలేదు వాళ్ళ దృష్టిలో
స్వాగతం చెప్తున్న సమయంలో
స్వాగతంగా ఇవి తలంచరాదు కాబోలు
రాఘవా స్వస్తి
రావణా స్వస్తి
రాచరికానికీ గణతంత్రానికీ దోస్తి!

[1961 జనవరి

# పుట్టిన రోజు

మ్రోగుతున్నాయి బాజాలు
ఊగుతున్నాయి జెండాలు
పాడుతున్నాయి స్త్రీకళ్ల
పండుతున్నాయి స్వప్నాలు

నేడు కంకణం కట్టిన రోజు
నేడు ప్రతిజ్ఞ పట్టిన రోజు
పాడు కష్టం తుద ముట్టిన రోజు
నేడు స్వాతంత్ర్యం పుట్టిన రోజు

మీలో ఒకడనే గాని నేను
మీ సంతోషం పంచుకోలేను
సరిహద్దులో నిత్యం నిలబడాలి
అరి మూకల్ని నేను అరికట్టాలి

స్థాణువులాగ కనబడే నాలో
సంచలనం కల్లోలం ఉన్నాయి
మేరువులాగ నిలబడే నేను
భీరువును కాకపోయినా భీతిగలవాణ్ణి

సంపాదించిన ఈ స్వాతంత్ర్యం
చక్కగా నిలుపుకోవాలి కదా
దగా కోరులు దగుల్బాజీలు విభీషణులు
నిషాతో పన్నుతున్నాను వలలు

సిరిమంతులకు చీమ కుట్టినట్టుండదు
దరిద్రులకు నిద్రాబద్ధకం వదలదు
మంచివాళ్ళను లంచాలు వంచించి వేశాయి
మరి స్వాతంత్ర్యం రక్షించుకొనడమెలాగ?

దేవుళ్లు గుళ్ళో కళ్లు మూసుకొన్నారు
దెయ్యాలు నల్లని జడలు విరబోసుకొన్నారు
మానవులు మాంచి నిద్దర్లో పడుకొన్నారు
మరి స్వాతంత్ర్యం రక్షించుకొనడమెలాగ?

మంచుకొండలు మెల్లగా కరుగుతున్నాయి
పొంచున్న సైన్యాలక్కడే తిరుగుతున్నాయి
మండుతున్న దావాగ్ని మంచుగా మారదేమో
మరి స్వాతంత్ర్యం కాపాడుకొనడమెలాగ?

కుడి చేయి ఎడమ చేతిని కొట్టివేస్తోంది
ఎడమ కన్ను కుడి కంటిని తిట్టిపోస్తోంది
నడుమనున్న మెదడు నరకంలా జ్వలిస్తోంది
విడదీసే అవయవాలు వేరే ఏమున్నాయి

మరి స్వాతంత్ర్యం దక్కించుకొనడమెలాగ?
మనలోని భేదాలీ ఒక్కరోజు పోతే చాలా?
ఈనాడు సంబరాలు చేయడంకన్నా
రానున్న రోజులకై ఒక్కటవడం మిన్న

[1961 ఆగస్టు 15 (?)

# గయోపాఖ్యానం

హలో మిస్టర్ ఆగవయ్యా ఆగు
అదేమిటి కళ్ళల్లో కన్నీటి వాగు
నిద్రలో మాదిరిగా నడుస్తా వెందుకు
నిప్పురవ్వల్లాగ నిట్టూర్చబోకు

నెత్తిమీదేమిటా ఫైళ్లు పెట్టుకొన్నావు
నీ గుండె లెందుకు మెళ్లో కట్టుకొన్నావు
నీ కాళ్ళు చక్రాల్లో గా లెందుకు లేదు
నీ కడగళ్ళ సైకిల్ కి టాక్సు కట్టావా

జీవితం జైసికి లెందుకు విరక్కొట్టేస్తున్నావు
లైటులో నూనెందుకు ఒలకబోసేస్తున్నావు
రోడ్డు వారెందుకు చతికిలబడ్డావు
రోదిస్తూ లేచెందుకు నిలబడ్డావు

సుఖం బస్సు ఇటొస్తుందని చూస్తున్నావా?
ఒక వే ట్రాఫిక్కు ఒక్కటే రాదిటు
చిన్నప్పటి హాయిలోకి స్పీడుగా పోయేకార్లు
నిన్నెక్కించుకుంటా యనుకుంటే నీదే తప్పు

మరమ్మత్తు చేసే రోడ్డు మీద
మనిషంతలోతు గోతులుంటే నేం
ఆకలి కబళిస్తే అందుకు బాధపడకు
చీకట్లో పోయావని చింతిస్తుంది లోకం

ప్రమాదాలొస్తాయని ప్రయాణం ఆపకు
సమాధానం చెప్పక సాగిపో ముందుకు
పరమార్థం ప్రియం ప్రాణాలు చౌక
మరిది తెలిశాక ఆగుతావేం సాగిపోక

[1961 ?

# ఎడబాటు కాటు I

తెలుగు మాట్లాడే దీపాలు
తెల్లవార్లూ వెలుగుతూ వుంటాయి
మేఘాల్లో టీ తాగుతూ
మేనమామగారింటికి వెళుతున్నాను
తల్లి పుట్టింటి సంగతి
తాపీగా చెప్పాలికదా వాళ్ళకి?

ఒంటరిగా ఓపిగ్గా బతకడం
ఓ పట్టాన నేర్చుకోలేను
ఎయిర్ కండిషన్డు గదిలాంటి ప్రియురాలి
హృదయంలో బతికే వాణ్ణి
ఎలాగ ఎడబాటు ఎండలో చచ్చేది

[ఆంధ్రప్రభ డెయిలీ
—1961

# ఎడబాటు కాటు II

చక్షులు కరములు కర్ణములు
జమిలిగ యిచ్చిన దేవతలు
ఒక నాలుక మాత్రమె యిచ్చారు
ప్రకటించుట ఎట్లు నా వెతలు?

అధరామృతపానము లేనపుడు
మధుపానము కూడా మానెదను
అధరాలకు భువిలో సాటేదీ
మధువందున పెదవుల కైపేదీ?

ప్రియురాలిని దూరము పంపితినీ
వెనువెంటనె రాదని మరచితిని
నా కరుణే నేటికి పగబూని
నా బానిస నాపై యజమాని

ఎన్నో చదివినవాణ్ణి కదా!
ఎడబాటుకు వగచుట వింతకదా!
అన్నీ తానే అవును కదా చెలి
నన్నెడబాసిన చిత్రవధా!

చినబోయిన యింటికి పోలేను
నిను చూడక నిద్దురపోలేను
కనులారా ఒకపరి చూడవిచో
చనిపోవుటకైనా పోలేను

కవివేదన వింటేరి చాలు నిక
యువభర్తల కొకటే హెచ్చరిక
పుట్టింటికి భార్యల పంపొద్దు
మీ శాంతిని మీరే చంపొద్దు!

[—1961]

# అల్విదా! అల్విదా!

(శ్రీరంగం నారాయణబాబు కోసం)

మరణం మనభాష నేర్చుకొంది
మనస్సులో చీకటి ఆవరించింది
కవిత్వం జలదరించి
కన్నీళ్లు జల్లుగా
చప్పుడులేని వాన
నొప్పిగా కురిసింది.

అయినవాళ్ళు ముగ్గురు
ఆత్మలోనే ఏడ్చారు.
ఏడవ సర్గ గస్తున్నాడు
యవనాశ్వాన్ని ఎక్కి వెళ్ళినట్లు
అశ్వారూఢుడై
అంతిమయాత్ర.

ఇన్నాళ్ళ స్మృతులు
ఇంకుగా మారింది.
ఇదుగో రాస్తున్నాను
అశ్రు నైవేద్యం చేయడానికి
ఆత్మీయత కాగితంగా ఆఖరిపద్యం
హృదయాల ప్రమిదలో
రుధిరజ్యోతి.

చిత్తం ఒత్తిగా
చిన్మయజ్యోతి
సాహిత్య బంధువు చిహ్నంగా
సంతతం వెలిగేందుకు
సామిధేని పాడుకున్నాను.

ఒంటరిగా జీవించావు
ఒంటరిగా మరణించావు.
అయినా అందరిలో నిలుస్తావు
అప్పుడప్పుడు పిలుస్తావు
ఏకాకి ఎప్పుడూ
బహుకుటుంబి.

నీకోసం విలపించారు
నిజంగా ఎంతోమంది.
ఆకాశంలో ఎగురుతున్న
హంసా!
అల్విదా!

[ఆంధ్ర సచిత్రవార పత్రిక
18-10-61

# జాతీయం

మూడు రంగుల ప్రభాతం మూర్తీభవించినప్పుడు
ఏడు స్వరాలూ కలిసి ఎంచక్కా మ్రోగినప్పుడు
పంచభూతాలు మంచిని దీవిస్తున్నప్పుడు
వంచబడిన తలలన్నీ మంచుకొండల్లాగ లేచాయి.

లౌడుస్పీకర్ల మ్రోతలే రమ్యంగా తోచినప్పుడు
మూడురంగులు మాత్రమే ముఖ్య మనిపించినప్పుడు
ముప్పయి మూడుకోట్ల ముఖాలు వికసించినప్పుడు

చెప్పలేనంత ఉత్సాహాన్ని కుప్పలు వేసినప్పుడు
నేత్రపర్వమైన తృప్తి నిలువెల్లా నిండినప్పుడు
మాతృదేశవదనంపై మందహాసం వెలిగింది.

మూడురంగుల సంతోషం మొదటిసారి కలిగినప్పుడు
ఏడేడు లోకాలికీ ఎడద రాజైనప్పుడు
చెక్కుచెదరని విశ్వాసం జెండాగా ఎగిరింది.

లెక్కలేనన్ని పార్టీలు ఒక్కసారి నవ్వినప్పుడు
జోడెద్దుల కాడితో గోడలు నిండినప్పుడు
మూడురంగుల అధికారం ముందడుగు వేసినప్పుడు

అప్పటి ఆనందాన్నే
ఇప్పుడు దిగుమతి చేసి
అప్పటి గాంభీర్యాన్నే
ఇప్పుడు కాపీ చేసి

అప్పటి సంగీతాన్నే
చెప్పక మార్పులు చేసి
ఎప్పటిలాగే దేశం
ఎలుగెత్తి పాడుకొంది.

మరచిపోకు ఈ తేదీ
భరతావనికి యుగాది
విస్మరించకీ సౌభాగ్యం
వేలాది వీరుల త్యాగఫలం,

మగతగా కన్నులు ముయ్యి
మన చరిత్ర నెమరువెయ్యి
అగుపిస్తాడు అదిమరాజకీయఖైదీ
అచంచల ధైర్యసాహసాల ప్రోది

ముక్కూ మొఖమూ ఎరుగనివాళ్లు
ఎక్కడనుంచో వచ్చినవాళ్లు
వర్తకమంటూ వచ్చినవాళ్లు
వంగివంగి తల వంచినవాళ్లు
భారతరాజుల దర్బారులలో, అ
పార కరుణ నోచినవాళ్లు
దేవర చిత్తమె మాదు విత్తమని
భావన చేస్తూ మెలగినవాళ్లు
చుట్టపుచూపున వొచ్చి దయ్యమై
పట్టి వదలదను సామెతమాదిరి
ఎంతో మెత్తగ కనిపిస్తూనే
ఏకుమేకుగా మారినవాళ్లు

ఏదో మిషపై వచ్చినవాళ్ళే
ఏలికలైతే పాలకులైతే
భారతరక్తం ఉడుకెత్తింది
పవిత్ర యుద్ధం ప్రకటించింది.
పరాయి దేశపు కిరాయిబంట్లు
స్వజాతి చేతికి సంకెల వేసిరి
నిరాశ జెందక చిరాశయంతో
పురోగమించిరి పురాణవీరులు
లాఠీదెబ్బకు ఛాతీ చూపిరి
చిరునవ్వులతో జైళ్ళకు పోయిరి
మెడకో కడియం తగిలించారు
ఇనుప కడియమే తగిలించారు
కడియం నడుమ నెంబరుబిళ్ళ
చాలీచాలని గావంచాలు
గోచీపాతలు కట్టించారు
తలలు బోడిగా చెక్కించారు
మొలలు బోసిగా విప్పించారు
మలమూత్రాలకు మట్టిబొచ్చెలు
మంచినీళ్ళకూ మట్టిపిడతలు
డెబ్బయిమందికి ఒకటే కొట్టు
దెబ్బలు తన్నులు ఒకటే తిట్లు
ఉడికీ ఉడకని రాళ్ళ అన్నమే
కొత్త దాకలో తినిపించారు
ఎదురు తిరిగితే ఏమిటి శిక్ష
సిలువమాదిరిగ నిలబెడతారు
ఇనుప ఊచలకు బంధిస్తారు

పరువుపోవు పని చేయిస్తారు
మలమూత్రాలు ఎత్తిస్తారు
మర్యాదలనే చంపేస్తారు
ఏ–బీ క్లాసులు ఏమీ లేవు
ఆ బాధల కష్టాకు అంతే లేదు.
అయినా ఓర్చిరి అహింసవాదులు
అరవై ఏళ్ళకు నిట్టూర్చారు
చీకటి చివరకు చెల్లాచెదురై
వేకువ వెలుగులు ప్రసరించాయి

పుణ్యాత్ములు ఎక్కేటందుకు
స్వర్గానికి నిచ్చెన కన్నా
పాపాత్ములు తరించడానికి
వైతరణికి వంతెన వేశాం
ఈ చక్కని లోకం లోపల
నీచత్వం సహించరానిది
రాచరికం నశింపచేశాం
దోచుకొనే ప్రభువును దింపాం.
మన స్వప్నం త్రివర్ణచిత్రం
మన లక్ష్యం సువర్ణపుష్పం
అంతా మన బంధువు లన్నాం
అందరితో నేస్తం కట్టాం.

విసుగెత్తిపోయింది విద్వేషంతో
విషంలాంటి విభేదం విడిచిపెట్టు
విశాలం చేసుకో హృదయాన్ని
వినిర్మలం చేసుకో చూపు దారిని.

కలహాన్ని హాలంగా చేత బట్టి
కావేషం పొలాలు దున్ని
కాలకూటం కాలువల్లో పారించి
కపటాన్ని పండించడం చాలించు.

పెరట్లో యథేచ్ఛగా తిరుగుతున్న
పెంపుడు దెయ్యాలను వెళ్ళగొట్టు
పెరవారి బూరాగా గొంతు చించుకోకు
విరక్కొట్టిపారెయ్ పిడికట్లో బాకు.

హాయిహాయి పాటలో అపస్వరంలాగ
ఆలుమగల అన్యోన్యంలో ఆడబడుచులాగ
ఆవలింతలాంటి అంటురోగంలాగ
అనవసరంగా దాపురించకు అడ్డమైనవాడా!

భరతఖండము నే డొక వంటశాల
వండుచున్నాము తీయని పిండివంట
విందు దినుసులలోన ఓ వెర్రివాడ!
వేయవలదయ్య చాటుగా విషపుబొట్టు

ఎత్తైన మన శిరస్సు మీద
ఇటూ అటూ రెండు ముళ్ళు
పెంచిన మన నమ్మం చూసి
మంచివాళ్ళకే కుళ్ళు
సాగే మన కాళ్ళ కింద
సైతాను తవ్వే గోతులు.

ముందున్న దెయ్యానికి భయపడి
ముడుచుకోనం మన చేతులు.

ఇదుగో ఈ వాస్తవానికి
పదిహేనేళ్ళ వయస్సు
వెళ్ళగొట్టినా మొండికెత్తి
వేళ్ళాడుతూంది తమస్సు
పుణ్యంగా మార్చుకుంటున్నాం
మునపటి రోజుల అంహస్సు
అప్సరసలు చెడగొడుతున్నారు
ఈప్సితాల కొత్త తపస్సు.

పంచాగ్ని మధ్యంలో నిలబడినా
కొంచెమైనా చలించకు
వంచకుల రింఛోళిని పటా
పంచలు కావించాలి

ఒక చేతిలో విచ్చుకత్తి
ఒక చేతిలో పూలగుత్తి
వికటించిన విపత్తుపై
ప్రకటించు నీ శక్తి.

నీ వెవరో మరచిపోకు
నీ నాలుక కరచుకోకు
వెయ్యి తలలు వెయ్యికనులు
వెయ్యి కాళ్ళ మానవుడవు
తొలివేదం చిత్రించిన
పలుకూర్పులు మంత్రించిన
పురుషు డెవడు నీవే కద!
మరువకు నీ మహనీయత

ఇంటింటా నీ అంశము
ఇనుమడించె నీ వంశము
ప్రతి హృదయం ఎర్రకోట
ప్రతి నోటా ప్రగతిపాట
ఎన్నటికీ దింపకోయి
ఎగరేసిన బావుటా.

[మద్రాసు రేడియో ప్రసారం
1962

# అంతర్జాతీయం

పొలిమేరలు చెరిగిపోయి కలలన్నీ ఒకటైతే
హాజం పోయి నిజం వెలిగి అంతా కేంద్రీకృతమై
కోటికోటి సంఖ్యలన్నీ ఒకట్లస్థానంలో ఉన్నపుడు
వస్తాయి ఎన్నో ఆలోచనలు.

స్వాగతం స్వాగతం స్వకీయ భావాలకు
స్వతంత్రించిన భయాలకు, చక్కని పదాలకు
సగం సగం అబద్ధాలకు, సంపూర్ణ సత్యాలకు
స్వాగతం పైకొచ్చే స్వగతాలకు సుస్వాగతం.

కూర్చోండి కూర్చోండి, తీర్చండి సభ
పేర్చిన సుఖాలమీద కూర్చోండి గబగబ
నేర్చుకున్న మర్యాదలతో నీటుగా నిండుగా
కార్చే కన్నీటికి కాసింత వాయిదా వేసి

అతికించుకోండి అవసరమైన గాంభీర్యం
అవధరించండి ఇది చాలా ముఖ్యమైన కార్యం
పదిహేనుకోట్ల నిట్టూర్పులకు పూర్వాం
ప్రభవించిందీ మన గర్వం.

పేరుహోల్డర్లంతా చిత్తగించాలి
వారివారి అభిప్రాయాలు ఏకం చేయాలి
కుడిచెయ్యి ఎడంచేతితో పోట్లాడకూడదు

కుడికన్ను తడిగా ఉన్నప్పుడు
ఎడంచెయ్యి దాన్ని తుడవాలి

ఏ భాగం ఎక్కడున్నా, శరీరం ఒక్కటే
అన్ని అంగాలూ ఉత్తమాంగాలు
అన్నీ జీవితానికి అవసరం.

వెనక్కి వెనక్కి వెళ్ళకూడదు మనం
నక్కి నక్కి బిక్కచిక్కి భయపడకూడదు

మాంత్రికుడికి లొంగని అల్లావుద్దీన్
మనస్సు నిర్మలమైన ఫ్రీ మేన్

సీసా బిరడా తియ్యండి
బానిసలాంటి జినీ ప్రత్యక్ష మవుతుంది

చెల్లాచెదురైన స్వప్నాలు అతికించుకుందాం
తివాసీమీద పయనించి
తియ్యదనంలో కాపుర ముందాం.

మద్రాసు రేడియో ప్రసారం
[1962

# కాస్మికీయం

చిమ్మచీకట్లోనూ కళ్ళు కనిపించవు
బ్రహ్మాండమైన వెలుగులోనూ కళ్ళు కనిపించవు
చీకటి వెలుగుల మధ్యనే జీవితముం దంటావా
కాంతి కన్నుయొక్క పెద్ద కూతురా?
కంటిపాపా, మింటి వెలుగూ జంట కవులు
వేలాది వేలు లక్షోపలక్షలు
వెలుతురు కావ్యాలు వెలువడుతాయి నిత్యం
ఛందస్సుకి లొంగని అందం
ప్రస్తరించిన కొలదీ విస్తరించే వృత్తం

చీకటి వెలుతురుయొక్క చిన్నతమ్ముడు
శ్రీమంజూషిక చీకట్లో చేసే చప్పుడు
చెవులు సృష్టించుకొనే ఉపనిషత్తు
కవులు కల్పించలేనట్టి నిదురమత్తు
ఎవరి దేవుడు వారి గుండెల్లోనే ఉంటాడు
ఎవరి సూర్యుణ్ణి వాళ్ళే సృష్టించుకుంటారు
భూపతనమయ్యే ప్రతి శిశువూ ప్రతి అణువు
మొట్టమొదట చదువుకొనేదే చదువు
చిత్రమైన జీవిత వ్యాకరణం
రక్తంలో నినదించే మొదటి శాస్త్రం
అది మడత పెట్టలేని కాగితం
అది విరక్కొట్టలేని వజ్రం
అందులో ఉన్న దొక్కే ఒక్క అధ్యాయం

దానిలో మొదటిది వృత్తి లేని సూత్రం
ఒక్కొక్క జీవితం దానికో భాష్యం
అనులోమ విలోమాలలో ఒకటే అర్థం
చీకటికి వెలుతురు పరం బైనప్పుడు
జీవిత సత్యా మాదేశ మగును
ఊపిరికి ఊహా పరం బైనపుడు
ఉన్నత కావ్యం విభావ యగు.

మానవుడు ప్రతి ఒక్కడూ
మమతకు పుట్టిన వాడే
దేదీప్యమాన మైన ప్రతి నరుడూ
దీర్ఘతమసుడే
ప్రశ్నించలేనివాడు బ్రతకడం దండుగ
జవాబు చెప్పినవాడే కవిత్వానికి నవాబు
విస్మయంలోంచి పుట్టించే కాస్మిక్ కావ్యం
రశ్మి దాని ప్రవాహం రహి దాని ప్రాణం
అబద్ధ మాడని పద్యపాదం ఒకొక్కటికి
అమ్ముడు పోయిన ఆది హరిశ్చంద్రుడు.

రాత రాతకీ తలొక కాపలావాడు
నక్షత్రాని కో వాచ్ మెన్ తప్పనిసరి
ప్రతి గోళం ప్రజ్వరిల్లే రుద్రభూమి
విశ్వకవి వీర దాసుడు

పొగలోంచి సెగలోంచి పొయిట్రీ పుడుతుంది
భువిలోంచి దివి సదా తర్జుమా అవుతుంది

అర్థం అనేకానేక కాంతి సంవత్సరాల
అనంతరం నిరంతరం హృదంతరంలో
దారి తప్పిన ప్రయాణికుడి మల్లే
జారవిడిచిన శూన్యం లాగ
పయనించి పయనించి
పైనా క్రిందా ఒకేసారి ప్రసరించి
భావమై రావమై మ్రోగుతుంది
చప్పుడు ఎల్లప్పుడూ సాగుతూంది

కొంతసేపు కోతుకం, కొంతసేపు భీకరం
సూర్యుడు చప్పుడు చేసే సూదంటురాయి
కార్యానికీ కారణానికీ అదే మొదటిస్థాయి.

మంటలు మంటలు మహాగ్నిజ్వాలలు
మరణించడం చేతకాని మహోన్నత శక్తులు
తెల్లని ఎర్రని పసుపు పచ్చని మంటలు
తల్లీ దండ్రీ కొడుకూ తామే
అయిన ప్రకృతికడుపు పంటలు

రోదసి ఒక కాండం లేని చెట్టు
వేళ్ళూ కొమ్మలూ పరస్పరం
వింతగా ఆలింగనం చేసుకొనే వృక్షం
చెట్టుతో ద్రసి ఊహించుకుంటుంది
మానవుడి బుర్ర

హిరణ్యగర్భుడు బంగారు పిచుక
అరణ్యంలాగ ఉంటుంది అతని గూడు
అది తనకు తాను అల్లుకొనే సాలెగూడు
సాలెపురుగు మారుపేరు శ్రీకారం

శ్రీకారం అసలు పేరు ఓంకారం
అదే అదే, అదే ఆదిత్యుని ఆకారం
రంగూ రుచీ వాసనా లేని రమ్యమైన జ్వాల
రకరకాల రూపాలకు ఆధారం
సూర్యుడి వంశ వృక్షం
క్రౌర్యానికి శాంతానికి పుట్టిన సంతానం

రెండు తోకచుక్కలు మాట్లాడే రహస్యం
రెండు ఆలిచిప్పలు ధరించే ఒకే ముత్యం
భూమినుంచి చంద్రుడిదాకా హైరోడ్డు
భూతకాలానికి భవిష్యత్తుకి బోడ్డుతాడు

భూమినుంచి చంద్రునిలోనికి ప్రయాణం
మెదడులోంచి హృదయం చేసే ప్రస్థానం
చంద్రుణ్ణి చేరుకొనే తొలి మనిషికి
అతడే ప్రత్యుత్థానం చేస్తాడు
అతడే గెస్టు, అతడే హోస్టు
మెదడే హోలీ గోస్టు

అనంత విశ్వంలోనికి యాత్ర
అర్థంలోనికి వెళ్ళే రథయాత్ర
అద్దంలోని ప్రతిబింబం, ఆధునిక విజ్ఞానం
హస్త చాలనం చేసుకుంటాయి ప్రతి క్షణం

ఫిజిక్సు మెటాఫిజిక్సు కలిసి మెలసి
బ్రెయిన్‌లో చేసే క్షీరసాగర మథనం

హాలాహాలం అవని నిండా పారుతోంది
అమృతం అందులోనే అంతర్లీనమైంది
బేస్ మెటల్ బంగార మైనట్లు
విషం అమృతంగా మారుతుంది

సైన్సు యొక్క సారాంశం
సర్వం శ్రీ జగన్నాథం
మానవుడు నిజానికి పరమాణువు అయినా
అతని కతడే ప్రభువు.

మద్రాసు రేడియో ప్రసారం
[1962

# ఓహో!

వైకుంఠ వాకిళ్లు విడివడిన వేళ
వైదేశ సంకెళ్లు తెగిపడిన వేళ
సైన్యాలు ముందడుగు వేసేటి వేళ
సైతాను మరణించబడుతున్న వేళ

స్వాతంత్ర్య వాయువులు స్పర్శింపగానే
చర్చిగంటలు కదిలి స్వయముగా మ్రోగె
జయజయధ్వానాల సవిత ఉదయించె
భయదాంధకారమ్ము భస్మమైపోయె

తల్లి బిడ్డలమధ్య ముళ్ళసరిహద్దు
కళ్ళెర్రజేస్తే కరిగిపోయింది
తప్పిపోయినబిడ్డ ఇల్లు చేరింది
తల్లి కౌగిలిలోన తలదాచుకొంది

చెప్పులోపలి రాయి, చెవుల జోరీగ
ఇప్పటికి ఇండియా తప్పించుకొనెను
కంటిలోపల నలుసు వెంటనే తొలగి
ఇంటిలోపల మనకు ఇకపైన శాంతి.

[గోవా విమోచనం
1962

# థాంక్యూ బేబీ! థాంక్యూ!!

మాట్లాడు బేబీ మాట్లాడు
మనస్సులో మధువులు చిమ్ముతూ మాట్లాడు
నీ నాలుకపైన నాట్యం చేసే స్వరాలు
నీ చిన్నారి పెదవులు గులాబీరంగుల ఇంద్ర ధనుస్సుల్లా
ఒంపులు తిరిగినప్పుడు ఒలికే శబ్దాలు
నీ మూసిన పెదవుల పెట్టెల్లో దాచిన రత్నవీణలు
తానం పలకడానికి చేసే ప్రయత్నాలు
నీ సంతృప్తి గుమ్మరించే మధుర ధ్వనులు
నీ సగర్వ మందహాసాల నాదలేశాలు
నిగమాలకన్నా నిగూఢమైనవి
అర్థమవని నీ మాటలు రైళ్లు రాబోయే ప్లాట్‌ఫారాలు
వింత ధ్వనిచేసే నీ గొంతుక ఓపెన్ కాబోయే రేడియోస్టేషన్
మాట్లాడు బేబీ! మాట్లాడు!
తెలియరాని నీ మాటల ద్వారా
తెలుసుకొంటాను మన భాషల పుట్టుక
అచ్చులూ హల్లులూ నీ కంఠంలో చేస్తున్న
అపూర్వమైన మహాసభని తిలకిస్తాను
నీ ముద్దుమాటల అద్దంలో నా చిన్నప్పటిముఖం చూసుకుంటాను
నీ ఊసుల పూసలకి భావాల దారాలు లేవుగాని
నీ చక్కని పదాల ముక్కలు నా గుండెలకి రెక్కలిస్తాయి
ఎవరూ వీక్షించనపుడు నువ్వు పలికే నుడులు
ఏ బాణుడు ఎంగిలిచేయని పిండివంటలు
పదాలకి దగ్గట్టు నువ్వు తిప్పుకునే చేతి ఊపులు

బాలసరస్వతికి అభినయం నేర్పే ముద్రలు
ఎడతెగకుండా నువ్వు పొడిగించే పాటల కాంబినేషన్లు
ఏ విశ్వనాథ సత్యనారాయణా కట్టలేని సమాసాలు
దేవుడికన్నా గడుసు దానివి నువ్వు
మా వాక్యాలు అర్థం చేసుకుంటావుగాని
నీ ఉద్దేశాలు అర్థం కానివ్వవు
దేవతలకన్నా మంచిదానివి నువ్వు
ఏ విహాయస పథాలలోనో వినిపిస్తాయి వాళ్ళ గానాలు
నీ విసర్గల స్వరాల సింఫొనీ
గుండెల్లో ఊపిరికాస్త చేసుకోనిస్తున్నావు
మళ్ళా వినే అవకాశం మనస్సులో
కలకాలం నిలుపుకోనిస్తున్నావు
థాంక్యూ బేబీ! థాంక్యూ!

1962

# ప్రాచీన స్వైరిణి

ఫల్గుణీ, ఫల్గుణీ, ప్రాచీన ప్రణయినీ
దాక్షాయణీ, బృహన్నక్షత్ర రూపిణీ,
సింహాన్ని అక్కతో, చెల్లితో సృజియించి
సంహితా మంత్రాన స్థానమార్జించావు

ఆర్యులగీతమ్ము అదివేదమ్ములో
సూర్యకన్యక వరుడు సోమదేవుని నెలవు
ఏక్కడో వివరించి ఎడ్రస్సునిచ్చారు
అచ్చంగ అది నీదు హృత్సముతో ఉంది

ఫల్గుణీ, ఫల్గుణీ, భావాభ్ర సుందరీ
బహునామముల తోడ భాసిల్లు భామినీ
అల్ల యీజిప్షియన్ వల్లికా, వల్లికా
ప్రాచీన గ్రీకుల ఫగాసిన్ నామికా.

శత సహస్రాబ్దాలు గతియించి మరికొన్ని
శతకోటి వర్షాలు గతియించునందాక
వెల్గుతూ వేర్వేరు పేర్లతో చెలగినా
తెల్గులో పుబ్బవే, తీయని బొబ్బవే.

మానసోల్లాసినీ, మాధుర్య మోహినీ,
మావాళ్ళు నీ పేర మాసము సృజించారు
నిండు పున్నమి రాజు నిన్ను కలసిన రోజు
పండుగై పబ్బమై ఫాల్గుణోత్సవమాయె.

ఇమ్మగా తెలగాణ తమ్ములు కీర్తించు
కమ్మని పండుగే కాముని పున్నమ
కనువిందు జాబిలితో కావించు పుబ్బ
కన్నడుల కిచ్చావు కామన హబ్బ.

హోలికా డోలికా ఉత్సవమ్ములలోన
ధూళి జల్లెడు వాళ్ళ దుందుడుకు చైదాలు
పెండ నీరమ్ములతో బండ బూతులు ప్రేలు
విచ్చలవిడితనము వచ్చింది నీవలన.

అవును లే నీగుణము అటువంటిదే మరి
చంద్రునికి నిన్నిచ్చి చేసినారము పెండ్లి
సూర్యుణ్ణి కలిశావు క్షుద్రమై పోయావు
తెలుగు రైతులు నిన్ను తిట్టి పోశారు లే.

పుబ్బ కెరలినచో భూతమ్ము కెరలు లే
పుబ్బలో జల్లుట దిబ్బలో పోయు టే
రిషివంటి మా తెల్గురైతు చెప్పెను నిజము
ఇటువంటి సామెతలు ఇంకెన్నియో గలవు.

బంధకిని సర్వదా నిందించు నీ జగము
బహుభర్తలుండుట పాంచాలికే తగును
ఇద్దరు పెండ్లాము లిప్పుడు నిషేధమ్ము
ఏకపత్నీ రతమె మాకు సమ్మతము.

ఫల్గుణీ, ఫల్గుణీ, ప్రాచీన స్వైరిణీ,
సౌరమానమ్ముతో సూటిగా తిడతాము
చాంద్రమానముతో సన్నుతింతుము నిన్ను
సంస్కరణ నీపట్ల చాల శ్రేయస్కరము.

ఆగవోయ్ ఆర్యుద, ఆగవోయ్ ఆగు
ఏమిటీ ఛాందసం? ఏమిటీ కవిత!
ఆకసమ్మునన చుక్క అతివ అనుకున్నావ?
పురానవుల ధర్మాలు మాకు అందిస్తావ?

సైన్సు పెరిగిననాడు చదువు పెరిగిననాడు
సాంప్రదాయకమైన ఛాందసం తగదు.
పుక్కిటి పురాణాలు పూర్తిగా మరచి
నీగాధ తొలినుండి నెమరేసుకొనుము.

ఆర్కిటిక్ సీమలో "సర్కారమా" వంటి
నక్షత్ర కావ్యాలు వీక్షించి వీక్షించి
ఆకసం స్టేజిపై ఆనంద నర్తకుల
ఆదిజ్యోతిర్లీల కలవాటు పడ్డావు,

గగనమందున కదులు గంధర్వనగరాలు
పగటిపూటల చూచి పరవశము చెందావు.
దివ్యశక్తులు ప్రకృతి దృశ్యాల కిచ్చావు
దేవతల నూహించి తీపుగా పాడావు.

ఆదివేద సమాజ మందు నీ జీవితము
ఆకాశ తారలకు అంటగట్టిన పిదప
అమరిన తారకా సముదయంబుల లెక్క
గణిత శాస్త్రములోన గడతేరి కట్టావు.

కోటిలెక్కలనుండి మేటి లెక్కలదాకా
వూహించి వూహించి ఉపనిషత్తులు తెలిసి
ఉద్బ్రహ్మ నాసికల ఉదజని మూలాన
శతకోటి విశ్వాలు జనియించె నన్నావు.

ఈశ్వర భావనల సేద్యమ్ము చేశావు
బ్రహ్మజిజ్ఞాసతో ప్రకృతమ్ము మరచావు
పండిన జ్ఞానాన్ని పశుల కిచ్చేశావు
సాంఖ్యుల వాదాన్ని చంపించ చేశావు.

సున్నాను దర్శించి జ్యోతిష వేత్తవై
పన్నెండు రాశులుగ మిన్ను భాగించావు
చిన్ననాటి "మెటాఫిజికలు" లెక్కతో
ఫలితాలు కలగంటు పవ్వళించావు.

ఆది భారత భాను డస్తమించే వేళ
పడమటికి చేరావు భాసిల్లినావు
పాశ్చాత్య వైజ్ఞానివై ప్రజ్ఞావిశేషాన
భూమి పరిధులు దాటి ముందడుగు వేశావు.

పణాంకునకు పోటి శ్వానాంకు రచియించి
స్పుట్నికు లెక్నికు పూర్తిగావించావు
మిన్నులోపల గగాగారిన్నువై గ్లెన్నువై
విశ్వయాత్రకు కొత్త వీథులను తెరిచావు.

ఈ దినము మానవుడు దాదాపు దేవుడే
ఇసుమంత వినయాన యీశ్వరుడు కాగలడు
లెక్కలు గుణించి పెనురెక్కలు ధరించి తను
రేపటికో, మాపటికో రిక్కలు జయిస్తాడు

చరిత్రాత్మకమైన సమయాన ఓ కవీ,
ఫల్గుణీ! అనివేల పలువరిస్తావోయి
పాతపాటలు నీవు పలికించ మటాపేసి
కొత్తపాటల కొరకు గొంతు సవరించవోయ్.

[—1962 ఉగాది

# తప్పకుండా

(రేపటి చూలాలు)

కలలాగ కర్పూరంలాగ కరిగిపోకుండా
అలలాగ అద్దంలాగ విరిగిపోకుండా
ఎన్ని ఆశలు ఎన్ని కోర్కెలు ఎన్నెన్ని కలలు
ఎడదలో దాచుకొన్నాను నిజం చేయాలని

భూతకాలం భూతంలాగ పీక్కుతింటోంది
వర్తమానం అస్తమానం భయంకరంగా నర్తిస్తోంది
దారుణ సమకాలిక వ్యధలకు తల ఒగ్గలేను
కారణాలకోసం వెతకండే నిద్రపోలేను

అల్లకల్లోలంలో కల్లకపటాల కాసారంలో
తల్లడిల్లే హృదయం తను మునిగి పోతోంది
బరువు కన్నులు బాధగా మూసుకొన్నాను
భావి కాలాన్ని ఆవాహనచేసి చూసుకొన్నాను

పుట్టని పాపల స్వరమేళ పుణ్యగీతలు పాడగా
కట్టని కోటలమీద జెండాలు కలకలలాడగా
ఒంటరిగా ఒంటిరిగా ఒడ్డుకు చేరుకొన్నాను
అంటు కట్టిన భావాల చెట్లకింద సేద తీరాను

అంతరిక్షంలో ఎగిరే రాకెట్టు అక్కడే ఆగింది
అంతరంగంలో మెదిలే స్వర్గం అక్కడే దాగుంది
ఉడుకునెత్తుటి కోనేరు ఉత్సాహమిస్తుందక్కడ
ఒయాసిస్సులు కోటి ఆశీస్సులవుతాయక్కడ.

అనంతకాలాన్ని నేను అణువుగా మార్చివేశాను
చిరంతన వేదనరూపం చిత్రంగా మార్చివేశాను
అణువుని పేల్చి నేను ఆనందాన్ని పుట్టించాను
తనివి తీరే లోకాలు చక్కగా కట్టించాను

పరపాలనలోనున్న ప్రతి అంగుళం విడివడ్డది
చెరసాలలన్నీ క్షణంలో చిత్రశాలలుగా మారిపోయాయి
నల్లని శరీరాల వాళ్ళంతా తెల్లగా నవ్వుతున్నారు
తెల్లని శరీరాల వాళ్లు చల్లగా దీవిస్తున్నారు

ప్రొద్దున్నే స్వాతంత్ర్యమిచ్చి మధ్యాహ్నం మళ్ళావచ్చి
సాయంత్రం నెత్తిమీద సవారీ చేయడం పోయింది
ఉన్నట్లుండి ఉలిక్కిపడి ఉక్కిరిబిక్కిరైనాను
ఉత్సాహ వంతమైన కల ఒక్కుమ్మడిగా పీడకలగా మారింది

బారులు బారులుగా రోగుల పరీక్షిస్తున్నారు
బాధగా ఖైదీలు గుండెరాళ్లు కొడుతున్నారు
బానిసలు సంకెళ్ళ చేతులతో పడవ నడుపుతున్నారు
బాలబాలికలు యవ్వనం రాకముందే మృతులవుతున్నారు

చిత్రహింస చేయబడ్డ నాయకుని గుండెకాయ పగిలింది
నడుస్తున్న ప్రతి ఒక్కడి కాలికీ అది తగిలింది
ఎగురుతున్న జెండా ఎగురుతూ చిరిగింది
సూర్యబింబం మధ్యనుంచి రక్తాశ్రువు చిందింది

గుంటనక్క గుడ్లగూబ బొల్లిగద్ద రాంబందు
గుడిలోపల విగ్రహాల నడినెత్తిని కూర్చున్నవి
పరదాలూ, బురఖాలూ, పంజరాలు సంకెళ్లు
చిరునవ్వుల సరదాగా నరమేథం చేస్తున్నవి

జోగుతున్న తాగుబోతు జోలపాట పాడుచుండ
తెగదూడ ప్రాణాలను జాగిలాలు తీస్తున్నవి
అగ్నిపర్వతాగ్రమ్ముల అస్థిపంజరాలున్నవి
నగ్నాంగన త్రోలబడుచు నడివీథిని పోతున్నది

కెవ్వుమనుచు కేకవేసి రివ్వుమనుచు పరుగుతీసి
కపర్దినై విషద్రవం కంఠమందు దాల్చినాను
దక్షాధ్వర విధ్వంసిగ తాండవమ్ము చేసినాను
అడలిపోవు జనావళికి అభయముద్ర ఇచ్చినాను

పరమశివుని రూపువీడి పసిపాపగ మారినాను
సర్వజ్ఞుని మేనువీడి అవివేకిగ ఏడ్చినాను
విశ్వాసం సడలిపోయి విద్రోహం పెరిగిపోయి
మంచుకొండ మీదనుండి దొర్లిదొర్లి పడిపోతిని

ఆగమించు కాలమ్ముకై మానవునకు ఆందోళన
స్వార్థమందు జన్మించే సైతానుకు అవహేళన
కనులు మూసుకొన్న నాకు కనుపించే ప్రతి దృశ్యం
కారుచీకటై, అకటా, అయినదేల దుస్స్వప్నం

అంతలోన వేగుజుక్క ఆకసాన కనబడ్డది
అతిసన్నని మేలుకొలుపు చెవులలోన వినబడ్డది
వికసించిన మల్లెపూవు నా దోసిలిలో పడ్డది
కరుణామయ దరహాసం గడపవద్ద నిలబడ్డది

చల్లని గోదావరిలో రాదారీ పడవలాగ
పెళ్ళి ఊరేగింపులోని మెల్లని తనంలాగ
కమ్మని నవ్వులలో కదలి వస్తున్న గర్భవతి రూపంలో
కళ్ళు మూసుకొంటే కనబడింది నాకు రేపటి ఇండియా

చూలాలి నెవరైనా చూడగానే నేను
జోడిస్తాను చేతులు పూజిస్తాను మనస్సులో
మానవజాతి యికముందు మరణించబోదని
మౌనంగా హామీ యిస్తుంది ప్రతిగర్భవతి

పురాణాలు చెప్పే బూటకాలు పూర్వం పఠించాము
భూభారం వహించేది ముసలి ఏనుగులు కావు
నిజం తెలుసుకొన్నాను నేను నిస్సందేహంగా చెప్తాను
నెలలు మోస్తున్న ప్రతి నెలతా ఇలను మోస్తూ వుంటుంది

మాతృమూర్తి కాబోతున్న మానిని
మాట్లాడింది నాతో ఏమని
నాలో ఏర్పడుతున్న ఆకారం
ఈ లోకాన్ని బ్రోచే కల్క్యావతారం

స్త్రీప్పిల క్రిందనున్న నీ సోదరుడు
స్ఫూర్తిక్కులు సృజించాడు
శుక్రాచార్యుని వద్దకు
సూటిగ పంపించారు

మృత సంజీవిని విద్యను
ముఖ్యంగా నేర్చుకోండి
హతాశల్ని మీరవ్వుడు
బ్రతికించుట జరుగుతుంది

విన్నాను ఆమె యిచ్చిన సందేశం
పోయింది నాకు కలిగిన సందేహం
చెరిపి వేస్తుంది యిండియా యొక్క రేపటి ప్రేకటి
చదలనుండి కారుతోన్న ఈ చిమ్మచీకటి.

[రేడియో ప్రసారం
1961 (?)

# గ్రంథక్రిమి స్వాగతం

వస్తున్నా నెవరనుకొన్నావు?
పుస్తకాల పురుగుని.
చెప్తా నాకు స్వాగతం;
విను నా స్వాగతం.

కాయా కసరూ తినే మానవుడు
అన్నం మొదలెట్టిం దెప్పుడు,
కర్రా కంపా మెక్కే నేను
కబ్బాల తుదముట్టిన దప్పుడు.

చెప్పిందే చెప్పి చెప్పి
తిప్పి తిప్పి తిరగ రాసి
తిప్పలుపెట్టే కవితను
చప్పున భోంచేసేస్తా.

సుదీర్ఘ దుర్భావసమాసాలు
నాకు ఇరానీ సొమాసాలు
ప్రాసాదగుణానికి పావుతావు
నాకు గరమ్మసాలా పులావు.

పాతకవులు చేసిన
కొత్తకల్పనలు చూసి
కొందరు రాస్తారు మక్కీకి మక్కీ
అందులో సుందరత హుళక్కీ.

కొరకరాని కొయ్యలు
విరవించు కొందరయ్యలు
చూపు లేకివిద్దెలు
నాకు వెన్నముద్దలు.

కాగితాల కెక్కదు గ్రామ్యరమ్యత
కానీ బతికిస్తుంది దాన్ని జనత
అనుశ్రుతంగా వచ్చే కవిత
అయ్యో తినలేనే అని నా వెత.

ఎన్నో చవులూరించినా నేను
నన్నయ్యని తినలేకపోయాను
తిక్కన్నకీ ఇతనికీ మధ్యనున్న
తక్కిన్న కవులని తినేశాను.

అన్నమయ్యను తిందామంటే
అతడు కాగితాలకే ఎక్కలేదు
చిన్నయసూరి ఎన్నటికైనా నాకు
సన్నబియ్యపన్నం కాకమానడు.

తంజావూరు రచనలన్నీ
తిందామనుకొన్నాగానీ
ఇంగ్లీషులో చెప్పినట్టు మీ మాంసం
నా పాలిటి చేదు విషం.

ఏమన్నా సరేసరి
వేమన్నని తిందామంటే
తొలి మూడు పాదాలు తిన్నా
నాలుగోది నా కసాధ్యం.

విరాటపర్వంలోని
సింగంబాకటి పద్యం
పారిజాతాపహరణంలో
పాదతాడనఘట్టం
విజయ విలాసంలో
వెలలేని సు-శ్లేషం
పోతనా శ్రీనాథులు
నాకు హామేషా వర్జ్యాలు

ఆధునిక కాలం
ఆహా! సుభిక్షం.
లక్షోపలక్షలు నాకు
అందే తియ్యద్రాక్షలు

రుచీ పచీ మీరు లేదనే
ప్రచారకవనం నా పాలిటి
శుచిగా పచనం చేసిన
సురుచిర మృష్టాన్నం.

నా చిట్టి తమ్ముడు బూజు,
వాడికి కుకవులంటే మోజు
అర్థసంక్లిష్టతా కావ్యాలపై
అల్లుకొన్న రాజ్యానికి రాజు.

వాడు వెతికి పెడతాడు
నాకు కడుపునిండా కూడు,
వాడు పడతా డొక బుక్కు నేను
రేపు నా కదే రవ్వలాడు.

తెరిచిందికి మనస్కరించని
చెయ్యెత్తి నమస్కరించని
పూజాపునస్కారాలు లేని
పుస్తకాలు బూజుకి మోజు.

వృథాపఠనం శైలి కఠినం
మీకుమాత్రం బలే కష్టం
అదే రమ్యం సుధామధురం
మాకుమాత్రం మహాయిష్టం.

వాడూ నేనూ కలసి
దాడి చేస్తాం బలిసి
విమర్శకులు చెయ్యాని పని
చేసేస్తాం దయదలచి.

తరానికో వందకవులు
తయారవుతా రెప్పుడూ
వందలోనూ మందలోనూ
మిగలగలిగే దొక్కడు.

ఒక్కకావ్యం ఒక్కపద్యం
వందమందికి నచ్చినా
దాన్ని కాల్చా ఏం చెయ్యా
అదే చివరకు నిల్చును.

ప్రజల రస సింధువు
నాకు విషబిందువు;
జను లాదరించని సాహిత్యం
తిని వేస్తాను నేను నిత్యం.

నన్నందుకే పుట్టించాడు దేవుడు;
ఎన్నడూ గిట్టించ లేడు నరుడు;
పుస్తకాల పురుగుని
కుకవికన్నా మెరుగుని.

[ఆకాశవాణి, మద్రాసు
1962 ?

# లిటరేచర్

## జాబు:

ఆరుద్ర గోర్కీ;
వస్తుంది ప్రాణంలేచి
ఈ జాబుకు మీ జవాబు చూచి
రాయండి రాయండి సార్
వాల్టర్ డిలామేర్
రాకడల పోకడలు పొండి
పొండును పిండి ఆడెన్ చండి
డైలాన్ థామస ప్రవృత్తిని
(అస్తిత్వంలో ఎరక్క చిక్కడ్డ)
ఆధునిక **మా**నవుడి పరిస్థితిని
రాంబోలా బాంబార్డు చెయ్యండి
రేన్ బోలో ఆరుద్రీకరించండి
కనబడని గాయాల్ని తెలిగించండి
అమావాస్యా స్యాన్ని వెలిగించండి
శీర్షాసనాల ఎక్స్‌పెరిమెంట్లు
వ్యధల కథల పెప్పర్ మెంట్లు
గళ్ళనుడికట్లు పజిలించి
తిన్నయింటి వ్యాసాలు లెక్కించి
చెప్పండి చదరంగ నీతులు
దూరండి కవిత్వపు గుడిసెలు
పవిత్రహాస పత్రిక జ్యోతి
అరసికతా తిమిర హేతి

నెలనెలా రాయండి
వెన్నెలలా రాయండి.

జ వా బు :

రాయబోయే రచన మోటారు
రామ్మోహనరావు పేరు
స్పీడ్ లిమిట్ లేని రోడ్డు
స్పీడు వర్కు చేస్తుంది మెదడు

జ్యోతి పాతదీపం సెమ్మా అవనీయకండి
పాతుకొన్న చీకట్ల కడుపు చింపండి
పత్రికలోని ప్రతి ఫీచరూ హైలైటు
పయనించే మనవాహనం హెడ్ లైటు.

ఇన్ని వేల సంవత్సరాల ఇరులు పెంచి
కొన్ని కోట్ల యువ ప్రాణాల మెడలు వంచి
స్వారీ చేస్తున్నది సనాతన మతతత్త్వం
సాహసించి మనం చేయాలి నిర్మతయుద్ధం

స్వార్థం సంకుచిత స్వభావం పరమార్థం
స్వామ్యం సందేహ ప్రలోభం ప్రారబ్ధం
ఇత్యాది చీడపురుగులమీద డి. డీ. టి.
ఎప్పుడూ కొట్టడమే కద మనడ్యూటి.

రచయితకీ రాజకీయాలకీ బీటముడి
రంగులో ఎర్రవాళ్ళు వేశారు త్వరపడి
అన్యదేశీయుల వరవడి కలవడి
ఆదిలో చేశారు కొందరు అలజడి

సామ్యవాద రష్యా రచనల్లో పోలటిక్సు
షావుకారు అమెరికా నవల్లో నగ్నసెక్సు
దండిగా చేసేస్తున్నారు దిగుమతి
రెండు వర్గాల వాళ్ళకూ పోయిందా మతి?

నోబులు బహుమానం పుచ్చుకొంటూ స్టీన్ బెక్
నుడివిన మాటలే మన నవవేదపు తొలి బుక్
"అనరాదు ఆదియందు వాక్యము దేవుడై యుండెను?
అనాలి ఆఖరికి నరుడే వాక్యమై నిండును"

విశ్వేశ్వరుణ్ణి ఊహించి బానిసైనాడు ఆదిమానవుడు
విశ్వాన్ని జయించి దేవుడవుతాడు ఆధునికుడు
స్పేసును గెలిచినా మానవుడు తాను
ఈసుని గెలవకపోతే అవుతాడు సైతాను.

దివ్యంగా చెప్పాడు రుషి ఎ. మ్మేన్. రాయి
నవ్య మానవ వాదం రేపటి గీటురాయి
మనస్సులోని తమస్సు చెరిపితే భవితవ్యం
మన 'జ్యోతి' కదే ప్రప్రథమ కర్తవ్యం.

[జాబు రాసినది నండూరి రామమోహనరావుగారు; జవాబు ఇచ్చినది ఆరుద్ర. వి. వి రాఘవయ్య మేనేజింగ్ ఎడిటర్‌గానూ, నండూరి రామమోహన్‌రావు, ముళ్ళపూడి వెంకటరమణ, బాపు, వి.ఎ.కె. రంగారావు 'మరియు' రావి కొండలరావు సంపాదక వర్గంగానూ ప్రారంభమైన పత్రికకు రచనలు చేయమని జాబూ, చేస్తానని జవాబు చెప్తున్నాయి.]

[జ్యోతి
ఫిబ్రవరి 1963

## స్పూత్నిక్ టెక్నిక్

బ్రదర్ ! రెడీగా వుంది రోదసీ నౌక
పదినుంచి మొదలుపెట్టు వెనుక లెక్క

ఒక్కటైపోతాయి ఇంక దిశలు పదీ
హృదయాహ్లాది సైన్సు విభేదఘాది

మూఢ నమ్మకంలో నున్న గ్రహాలు తొమ్మిది
మునుపటిలాగ బాధించక కలుగు నెమ్మది

బేరీజు వేసిన కష్టాల సంఖ్య ఎనిమిది
బేజారవడం అనే దుస్థితికి ఇదే తుది

ఆరునొక్కటి అనకపోతే అయ్యో 'ఏడు'
ఆంధ్రుడు కలిగిస్తుందంటాడు ఏదో కీడు

ఆదిమ చక్రవర్తుల మొత్త మెంత? ఆరు
అన్యుల పీడించే ప్రభువు లింక లేరు.

మానవుడు లెక్కించిన మహా పాతకాలైదు
మనం పాపికి కాక పాపాలకే వేద్దాం ఖైదు

ఛాందసులు సృష్టించిన వర్ణాలు నాలుగు
సనాతన సంఘం చచ్చి వినబడదా మూలుగు

పాతలెక్కలో కనబడని కాలాలు మూడు
నూతనుడు ఇంక గతంలోనే బతకలేడు

ఓలలాడు ప్రేమలో హృదయాలు రెండు
ఆలిలో లీనమైపోవాలిలే హాస్యెండు

పరబ్రహ్మస్వరూప మెప్పుడూ ఒక్కటి
పరమాత్మతో నరుడి యుద్ధం నిజంగా ఎక్కటి.

వెలుపలకు వెళ్ళే వాహానంకాదు రోదసీ నౌక
కలకూ ఇలకూ పెళ్ళి చేస్తుంది శుభలేఖ

[నవత
1963

# కొత్త విజయాలు

బుద్ధదేవుని కాలమందున
పుట్టలేదని బాధ పొందను
గాంధి పెట్టిన ఈ యుగమ్మే
ఘనతరంబని యెంచెదన్.

వ్యాసవాల్మీకాదులను అను
వాదమున అవమానపర్చక
వారి రచనల నిజము చాటెడి
వర్తమానమె ఉత్తమం.

మగడుపోయిన మగువ బ్రతుకున
దిగులు నింపిన మనువు కన్నను
ఇట్టివారల నాదుకొను వీ
రేశలింగమె ధన్యుడౌ!

వేదకాలములోన స్వేచ్ఛా
విహాగ మగునో కాదో వెలది;
ఆడవారికి క్రీడమిచ్చిన
ఆధునికమును మెచ్చెదన్.

బొందితో కైలాస మేగుట
పూర్వకాలమునందు మృగ్యము
నేటి నరు డెవరెస్టు శిఖరము
నెత్తిపై ధ్వజమెత్తి వచ్చెను.

కాశి కేగుట కాటి కేగుట
కటకటా, గతమందు సమమట!
రోదసీ కుహరమ్ములో ఈ
రోజు ఈదుట సులభమాయెను.

తప్పటూహాల భూతమందున
నిప్పుకోడి శిరస్సు దూర్చును;
నేటి నిజముల మొయిలు కనుగొని
నెమలి నాట్యము లాడుచుండును.

ప్రాతలో గల మంచినంతా
చేతులారా సేకరింతును
గతములోపల గరళ ముండిన
గళములోనే దాచుకొందును.

పలువిధమ్ముల గెలుపు బొందుచు
వర్తమానములోన సాగుచు
జీవితాశయ దీపకాంతుల
భావి నిపుడే నింపెదను.

[పుస్తక ప్రపంచం, జనవరి, 1964

# నడుస్తున్న చరిత్ర

బోనులో నిలబెట్టిన ముద్దాయికి
పూలదండ వేసి, చెంబు చేతికిచ్చి
నెత్తురు తాగుతాడు వీడని
నేరారోపణ నటించారు.

అనగనగా
అనగా మొన్న
ఉంపుడుకత్తె తొలిచూలు బిడ్డ
పెంపుడు కొడుకయ్యాడు ధర్మానికి.

అమ్మరక్తంలోంచి ఆహారం
ఆరగించడం ఆదిలో అలవాటు
పుట్టినప్పుడు మంత్రసాని
బొడ్డుకొయ్యబోతే వద్దన్నాడు.

అందరికీ సహజమైనదే
ఆచరిస్తున్నా నన్నాడు
బెంచిమీద కూర్చున్న జడ్జీని
బెత్తంతో కొట్టి నెత్తురు కళ్లచూశాడు.

[ఆంధ్రప్రభ డెయిలీ, 1964 (?)

# కొత్త ఒరవడి

కవితకోసమె నేను పుట్టాను
క్రాంతికోసము కలము పట్టాను
ఎండమావులు చెరిపి పండువెన్నెల నిలిపి
గుండెవాకిలి తలుపు తట్టాను.

మందికోసము గుడిని కట్టాను
మమతలన్నీ ముడుపు కట్టాను
అగుపడని దైవమ్ము ఆరగించదు సుమ్మ
అందుకే అవి పంచిపెట్టాను.

పంచవన్నెల చిలుక పట్టాను
పంజరములో అదిమి పెట్టాను
పక్షిలా నాగుండె పరితపించుచు మండె
పంజరాలను పగులగొట్టాను.

ముళ్ళలో ఒక పువ్వు చూశాను
మోజుపడి అది తుంచివేశాను
గుచ్చుకొన్నది ముల్లు విచ్చుకొనదా పువ్వు
పూలు కోయుట విడిచిపెటాను.

నీటిలో ఒక నీడ చూశాను
నీడకై గాలమ్ము వేశాను
చిక్కలేదొక మీను చిక్కుకొన్నది నేను
చింపి వలలను పారవేశాను.

మందికోసము నడుం కట్టాను
మంచి కోరుచు కేక పెట్టాను
మందుడొక్కడు లేచె మంచితనమును తుంచ
మలుపుదారిని నేను పట్టాను

అష్టమందున నిజము చూశాను
అడ్డాని కై దారికై వేశాను
అనుసరించిన జనత అలసిపోవుటచేత
మనసులో నిట్టూర్చి వగచాను.

నిన్ను నాలో కలుసుకొన్నాను
నన్ను నేనే తెలుసుకొన్నాను
కోర్కెనై వెలుగునై కోమరాల జిలుగునై
కొత్త ఒరవడి మొదలుపెట్టాను.

[1965 ?

# కన్యాకుమారి

ఇదో కడలి అదో కడలి
ఎదుట నుండి మరో కడలి
ఇది దిక్కుల పెను కూడలి
ఇది పగలే విభావరి

ఏది ఈస్టు ఏది వెస్టు
ఏవీ విభజించే రేఖలు ?

అస్తమించినట్టి ఇనుడు
అప్పుడే పొడిచిన చంద్రుడు
ఆవలించు ఆ శుక్రుడు
అడుగుతున్న ప్రశ్నలివి :

ఏది ఈస్టు ఏది వెస్టు
ఇది నురగల ఫారెస్టు
తల్లి భూమి పాదాగ్రపు
లాక్షరుణ దీప్తులతో
తరంగాల మృదంగాల
తనివి తీర్చు గానముతో
తనిగా నిలబడ్డనాడు
మనిషై చరియించువాడు
జనత కొరకు జాతి కొరకు
జాలిగ అడిగే ప్రశ్నలు :

ఏది సొతు ఏది నార్తు
ఎట్లా వివరించ నేర్తు
ఇది ఊయెల - ఇది కోవెల
ఇట పగలే సిరి వెన్నెల
ఇదియే తల - ఇదియే వల
ఇది పండిన తొలి కేరళ

పరిస్థితులు కుట్ర పన్ని
బాధ్యతల బరువు ఎన్ని
ప్రభుత్వాల తలలు దన్ని
బ్రతుకాయెను కొచ్చుణ్ణి!

కొచ్చుణ్ణి? కొచ్చుణ్ణి!
కాయంకుళ కొచ్చుణ్ణి!
నేను నీదు తమ్ముణ్ణి
వారిలేని బాలుణ్ణి

ప్రజల కొరకు పోరాడితె
ప్రభువులు గద్దించారట
కామన నిన్ను పట్టి యిచ్చి
కానలందు త్రోసిందట

కొచ్చుణ్ణి! కొచ్చుణ్ణి!
నేను నీదు తమ్ముణ్ణి
కాలమేమో మారిందట
జాలము బేజారినవట

కాలువలో నాచులాగ
కలలు అడ్డగించేయుట
ఈ పడవలు — ఈ చేపలు
ఈ వృద్ధులు – ఈ పాపలు

కడలి తోడ పోరాడే
బడలిన మానవమాత్రులు
ఏ నేరం చేశారని
ఏ ఘోరం చూశారని
పట్టపగలు ఈ చీకటి?
మొట్టమొదట ఈ ఆకలి?

ఎదురు చూచు వధువు కొరకు
ఏల రాడు ఆది వరుడు?
కొచ్చిన్నే! కొచ్చిన్నే!
ఇది ప్రభుతకు బహు ఫన్నీ
కనులకు విశ్రాంతి లేదు
కడలికి విశ్రాంతి లేదు
మనసుకు విశ్రాంతి లేదు
మన బ్రతుకులు చేదు! చేదు!

ఈస్టులోన అస్పృష్టత!
హృదయానికి తెగ భారం
వెస్టులోన హిపోక్రసీ
అష్టావకుడి మసి!

ఈ కూడలిలో నిలిచితి
ఇపుడు ఇటుల ప్రశ్నించితి
ఓ నరేంద్ర! ఓ మహాత్మ!
ఓహోహో! నిత్యవధూ
ఏది ఈస్టు! ఏది వెస్టు!
ఏల బ్రతుకు — యింత వేస్టు!

[వివరణ : కాయంకుళం కేరళ దేశంలో ఒక గ్రామం. కొందరి ఉద్దేశంలో 'కొచ్చుణ్ణి' ప్రజావీరుడు. మరికొందరి దృష్టిలో బందిపోటు దొంగ. అతడి చుట్టూ చాలా కథలు అల్లుకొంటున్నాయి.]

[ఉద్యోగమండల్ - కేరళ 1965.]

# కవితాధరుడు

జలపాతం ఎండిపోదు
జనకెరటం ఆగిపోదు
కలలో పండిన సత్యాలు
కళ్ళముందే రాలిపోవు.

ఇలలో జీవిస్తూనే ఇంద్రధనుస్సుపై నడిచేవాడు
అలపై తేలుతూనే ఆకాశంలో ఎగిరేవాడు
జనానికి పూచీదారుడు
జవ్వనానికి పెత్తందారు
బాధలు చూసిన బంగారు ప్రాచ్చిక
బంధాలు కట్టుకొన్న స్వేచ్ఛావిహంగం
బానిసల కాళ్ళకు బాటాజోళ్ళు తొడుగుతూ
బరువైన గుండెలన్నీ తన భుజాలమీద పెట్టుకొంటూ

దారి పొడుగునా దయ పంచి పెడుతూ
తలలో నాలుకై గొలుకపై పాటై
తనలో తానుగా తపించేవాడు
మనలో మనిషిగా చరించేవాడు
మంచివాడు నిష్క్రమించినా మంచితనం ఉండిపోతుంది

మంచి కవిత నిలబడితే మరణం భయపడుతుంది
తన పంజాలతో మృత్యువును చావగొట్టి
తన పజ్యాలతో ప్రాణవాయువులు వడగట్టి
జాతికి జీవం పోసేవాడు జలపాతంవంటివాడు

జవ్వనానిని పురిగొల్పేవాడు జనరేటరువంటివాడు
అనగనగా ఒకానొక ఆంధ్రకవి
అకాల మృత్యువునకు బలి
ఇవాళ జలతారు భావాల జలపాతం
ఇంకిపోయిందనడం స్వవచోఘాతం

ఎండిపోలేదు ఆ జీవధార
గుండెలో పారుతున్నది చూసుకో
ఆ హోరులోనే వినబడుతుంది అతని అమరవాణి
అతనికి జోహారంటున్నది ఆంధ్రవాణి

[దేవరకొండ బాలగంగాధర తిలక్ మరణం (30-6-1966) తర్వాత ఆనందవాణిలో.)

# ఓహో!

వ్యోమనౌక వ్యోమనౌక సాగుచున్నది
భూమినుండి దూరాలకు పోవుచున్నది
మనిషియొక్క గొప్పతనం చాటుచున్నది
మరలివచ్చి మహిమలెన్నో చెప్పుచున్నది.

మాటలకూ ఊహలకూ అందనన్నవి
నేటినుండి కళ్లముందు తోచుచున్నవి
క్రొత్త క్రొత్త లోకాలు తెరచుకొన్నవి
గోళాంతర జీవితాలు విరియుచున్నవి.

చందమామ చుట్టూరా తిరగవచ్చులే
బొందితో పరలోకం చూడవచ్చులే
అజ్ఞానం భూమినుండి చెరపవచ్చులే
అందరమూ అమరులమై బతకవచ్చులే.

వ్యోమనౌక వ్యోమనౌక వచ్చుచున్నది
భూమాతకు కానుకలే తెచ్చుచున్నది
తరతరాల శాస్త్రకృషి సఫలమైనది
నరుని మనికి ఇన్నాళ్లకు ధన్యమైనది.

భవిష్యత్తు ఈనాడే అంకురించెను
నవమానవు డీనాడే అవతరించెను
మస్తిష్కం ఏలగలదు వ్యోమరాజ్యము
స్వస్తి! స్వస్తి! నిత్యశాంతి ఇంక సాధ్యము.

[ఇవి 25-12-68 పొద్దుటినుంచి మధ్యాహ్నందాకా వ్రాసిన పద్యాలు.]

# అన్న తమ్ముళ్ళయింటి పగవాడా ?

తెలుగు జాతికి పిచ్చి పట్టిందా ?
దెయ్యమేదో మనకు పట్టిందా ?
అన్నదమ్ముల నడుమ అన్యోన్యమే పొడమ
వైరానికే కన్ను కుట్టిందా ?

తెలుగు చెట్టుకు చీడ పట్టిందా ?
తెలుగు దివ్వెకు గాలి కొట్టిందా ?
ఆంధ్ర చరితములోన హాలాహలపు వాన
ఆరిపోవని చిచ్చు పెట్టిందా ?

ఆంధ్రలక్ష్మికి కునుకు పట్టిందా ?
అదనెరిగి పెద్దమ్మ వచ్చిందా ?
ఇంటి వాకిట నిలచి కంటగింపుల పిలిచి
ఇనుప గజ్జెల కాలు పెట్టిందా ?

బడుగు పేదల తల్లి తెలగాణము
బాధ పొందిన చెల్లి తెలగాణము
విసిగిపోయిన తల్లి వేసరిల్లిన చెల్లి
విష బోధనలు చెవిని పెట్టిందా ?

తెలంగాణమే కేక పెట్టిందా ?
పలుబాధలే తెలియ చెప్పిందా ?
పదవి మరగినవాళ్ళు మదము పెరిగినవాళ్ళు
అదిమి పెడితే బెడిసి కొట్టిందా ?

బక్క చిక్కిన గొడ్డు అరిచిందా?
బిక్క చచ్చిన నోరు తడిసిందా?
ఒక్క ధనికుడు లేచి పెక్కు మందిని దోచి
చిక్కు పెడితే విషము పుట్టిందా?

ఉద్యోగముల ప్రశ్న మొలచిందా?
విద్యార్థి లోకాన్ని కలచిందా?
స్వంత లాభము కోరి, వింత పశువులు చేరి
ఉద్యమం పెడత్రోవ పట్టిందా?

దురభిమానము కత్తి కట్టిందా?
దుష్టశక్తుల రెచ్చగొట్టిందా?
పొట్టకూటికి వెతుకు పొరుగూరిలో బ్రతుకు
మూగజీవుల పొట్టకొట్టిందా?

అన్న తమ్ముని యింట పగవాడా?
ఉన్న ఊరును విడిచి పోవాలా?
కంట నెత్తుటి కణము కరుణ నోచని జనము
కాందిశీకుల బాట పట్టిందా?

స్వార్థ దేవత కచ్చ కట్టింతా?
స్పర్థానలము మిన్ను ముట్టిందా?
శ్రీలు పొంగిన గడ్డ పాలుపారే గడ్డ
సిద్ధాన్నమే కుక్క ముట్టిందా?

దేశమందున ప్రభుత చచ్చిందా?
ద్వేషాలకే చోటు ఇచ్చిందా?

ప్రాణభయమే పెరిగి మానభంగము కలిగి
పరిపాలనే గడ్డ కట్టిందా ?

రౌడీకి సజ్జనులు జడవాలా ?
రగడ చేస్తే అణిగి నడవాలా ?
రక్షణే కరువాయె భక్షణే తీరమాయె
రాచరికమే కంపు గొట్టిందా ?

తెలగాణ దాశరథి మనవాడు
తెలగాణ ఒక వీణ అన్నాడు
వీణ తీగెలు తెంపు వెతల శ్రుతులను నింపు
విపరీత గతి మనకు పట్టిందా ?

తెలగాణ పోతన్న ఒకనాడు
దివ్యకావ్యము ఇచ్చి పోయాడు
ప్రాంతీయ భేదాల పామర నినాదాల
భాగవతమే చెదలు పట్టిందా ?

ఒక్క తల్లికి మనము పుట్టాము
ఒక్క రక్తము పంచుకొన్నాము
ఒక్క దేహము నేడు ముక్కలగునా మూడు
అక్కటా ! శని మనకు పట్టిందా ?

ఏమిటీ స్వప్రాణ దహనాలు ?
ఏమిటీ విద్వేష పవనాలు ?
గూండాలు చెలరేగి గండాల జలపూరి
కులములో ముసలమే పుట్టిందా ?

విద్వేష మెద విడిచి పెట్టిందా?
విద్రోహులకు చేట కొట్టిందా?
ఏకోదర ప్రేమ ఏకాండమగు కామ
ఎట్టకేలకు తెలివి పుట్టిందా?

(దీన్ని అన్ని దినపత్రికలలోనూ కొన్ని వారపత్రికలలోనూ ఏకకాలంలో ప్రకటించారు.)

[ఆంధ్రప్రభ – విజయవాడ
8-2-1969

# సామ్యవాదం

గాంధీ పుట్టిన దేశమేనా ఇది
టార్చిలైట్లు పట్టండి వెతుకుదాం
నెహ్రూ చెక్కిన శిల్పమేనా ఇది
తుమ్మ జిగురు పట్టండి అతుకుదాం

దేశమంటే మట్టికాదు
శిల్పమంటే శిలకాదు
అయినా మట్టిని పరీక్షించాలి
అవశ్యం శిలను సమీక్షించాలి

ఈ దేశీయుల మస్తిష్కాల్లో
ఇంత మృత్తిక ఎలా వచ్చింది
ఈ శిల్పం ఇంత జల్పం ఎలా నేర్చింది
ఏభై కోట్ల నయనాల జతలు
ఈక్షిస్తున్నవి ఏ ఇమ్మడి ముమ్మడి వెతలు
ఏభై కోట్ల గళాలు తెలుపుకున్న నిగళాలు
ఎవర్ని బంధిస్తున్నవి
ఎవర్ని నిందిస్తున్నవి
ఎదనిప్పుడు ఏ రాక్షస నినాదానికి స్పందిస్తున్నవి
పద్యాల సేద్యానికి యోగ్యమైనది కాదీ కార్తి
ఉద్యమాల ఉన్మాదాలతో ఉత్పాదితమవుతున్నది ఆర్తి
పుకార్ల తుఫానులతో వికావికలవుతున్నవి
పొట్టచేత బుచ్చుకొన్న మాగబతుకులు

మధుమాసం వచ్చిందో లేదో
మామిడిచెట్టు పూచిందో లేదో
గుర్తించే తీరుబాటు
కీర్తించే సాగుబాటు
ఏ పికానికీ లేదిప్పుడు
ఎలా నిజం పాడగలవు పరభృతాలు ?
పువ్వు తొడిమను వీడి పోతానంటున్నప్పుడు
మెదడు గుండెని విడిచి వెడతానంటున్నప్పుడు
చెట్టునున్న ముళ్ళే
చీడపురుగులుగా మారుతున్నప్పుడు
చేతినున్న అయిదు వేళ్ళూ
ఐదు రాజ్యాలవుతున్నప్పుడు
దేవతలు పీడిస్తున్నప్పుడు
దెయ్యాలు దీవిస్తున్నప్పుడు
దీపాలు వెలగడం మానేసి
పాపాలు వీక్షిస్తున్నప్పుడు
జలగలు చెలరేగి జాతర చేసుకొంటున్నప్పుడు
అప్పుడు కళ్ళనుండి కారే నెత్తుటి బొట్లు
చప్పుడు చేయనప్పుడు
ఏ కన్నూ భవిష్యత్తు చూడదేం ?
ఏ నోరూ వాస్తవాన్ని చాటదేం ?

అవని అంతా పెద్ద అరణ్యమే ఇప్పుడు
అఖిలేశు హస్తమే ఆటోమేటిక్ రైఫిల్

వేట వేట వేట
కూటకరణాల కుట్రల
కూహకాల కారడవిలో
వేట వేట వేట
సాటివాళ్ళ తోటివాడు కూటాడే పారివేట

ఈ వేట బాధ పాత గాధ
ఇది పదేళ్ళలోపు పిల్లలకు చెప్పగూడని కట్టుకథ
ఉత్తరోత్తరా తప్పవలసిన గట్టివ్యథ
అనగనగా ఒక రాజు
ఆ రాజుకు ఎందరో రాణులు
అందరూ వేటకి వెళ్ళి అన్ని తిమింగలాలపట్టారు
ఇందులో ఏ ఒక్కటీ ఎండదు
దేని కడుపూ నిండదు
కథ కంచికి వెళ్ళలేదు
మన మింటికే మళ్ళలేము
ఇంట్లో వాళ్ళే ఇల్లు కొల్ల బెడుతున్నప్పుడు
వొంట్లో నరాలే ఒళ్ళు కుళ్ళబొడుస్తున్నప్పుడు
నేర మారోపించాలి ఎవరినైన
ఎవడు ముద్దాయి? ఎవడు ఫిర్యాది?
ఈ ఉమ్మడి కుమ్మక్కులో ఎవరయ్యా జడ్జి?
అవని అంతా పెద్ద అన్యాయస్థానమే ఇప్పుడు
అఖిలేసు హస్తాలే నకిలీ। తాంసు చిప్పలు

ధరణిలో ఎక్కడ చూసినా
తిరగబడని అంగుళమే లేదు

విద్వేషానికి ఉద్వాసన చెప్పని రాజ్యంలేదు
విద్రోహం క్షుద్రం చెయ్యని దేశంలేదు
పోలీసులకు లేదు బలం
పాలసీలో లేదు నిజం
పొగరెక్కిన గూండాలు
పొగ చూరిన జండాలు
కలుపుతారు భుజం భుజం
కరడు కట్టి హాజం హాతం

కంచే చేను మేస్తున్న కరాళ సమయంలో
కంచెరాటలు మంచినీళ్ళు అందిస్తాయి
మంచెమీద నిలబడ్డ కామందే
మారు వక్షించుకోమంటాడు
పాలించే స్వార్థానికి పట్టింపులు లేవు లేవు
పక్కింట్లో వస్తుల చావు
ఈ ఇంట్లో కోడి పులావు
ఏ దేశ మేగినా ఎందు కాలిడినా
ఏ నోట విన్నా ఒకే ఆదర్శం
'నాకు తృప్తి నాకు ముక్తి'
'మిగతా వాళ్ళది కక్కుర్తి'

గుండె లోపల నాటు బాంబు
బడిలోపల స్ప్రింగు బాకు
నిసువుకైనా నిర్లక్ష్యం
పశువుకైనా బలపక్షం
ఇటువేపో దురాగతం
అటువేపో అరాచకం

ఆవేశాల అరబాల మీాద
కావేశాల ఫిరంగులు వస్తున్నవి
ముందు చూ స్తే లాకౌట్
వెనుక చూ స్తే ఘెరావ్ !
ఇది కాదు కాదు కాదు
పిల్లవాళ్ళ పితూరీ
ఏనాటికీ ముమ్మాటికి
ఇది వృద్ధుల కంగాళీ
మట్టిలో కలిసి పోయిన
మడికట్టుకున్న నాగరికతలు
గట్టిగా ఘోషించే హెచ్చరికలు చెవిని పెట్టరు పెద్దలు
తమ ఆశల అత్యాశల ఊసర క్షేత్రాల్లో
కోట్ల వర్షం కురవాలని
విద్యార్థి బుష్యశృంగుల సెమ్యాస్ చేయించే
రాజకీయ రోమపాదుల పన్నాగం మిన్నాగైంది
ప్రత్యర్థి ఇజాల నిజాల పేరైనా
నోరెత్తి ఉచ్చరించ కూడదని
యువలోక ప్రహ్లాదుల రాసిరంపాన పెట్టి హింసించే
సనాతన హిరణ్యకశిపుల శాసనం
బూమెరాంగుల శరాసన మైంది
ఆదర్శాల శివలింగాన్ని అంటిపెట్టుకున్న
మేధావి మార్కండేయుల జీవాలు లాగేద్దామనే
క్రూర నైపుణ్య వర్గాల కృతాంత పాశాల పాటవం
ప్రపాతన మైంది

మొలకెత్తని విత్తనాలకూ
మోడయిన వృక్షాలకూ జరిగే సంఘర్షణ ఇది
పుట్టబోయే నవీనతకూ
గిట్టదలుచుకోని శవాలకూ
సంక్షోభం ఇది
ఉగ్గుబాలతో నేర్చిన ఉల్లంఘన
తల్లిపాలతో పీల్చిన దాక్షిణ్యం
పరస్పరం పోరాడే
నిరంతర తరుణం ఇది
సుప్తానల సంపుటాలు దీప్తించే సమరం ఇది
శ్లోకార్ణవ తరంగాలు శుష్కించని కురంగాలు
అపోకలిప్సు అశ్వాలివి
ప్రపూత భావ కిరణాలివి
ఈ వెలుగులు భేదించని గోడను నువ్వు కట్టలేవు
ఈ సత్యం పడగొట్టని కోట వాడు పెట్టలేడు

ఇంత వింత చీకటిలో
ఉన్నది ఒక సన్న దివ్వె
ఈ రాబందులకు దూరంగా
ఉంటుందొక శాంతి గువ్వ

తెల్లవారినా పొద్దు వెలగని
ఎల్లకాలపు ముసురు కాదిది
ఈ యాభయికోట్ల హృదులు
ఎంత బండ బారినా
రాయిని చీల్చుకు వచ్చే పుష్పలత
ఏ యుగంలోనూ నశించని మానవత

కాదది అవాఙ్మానస గోచరమగు వస్తువు
కచ్చితంగా అది మేధస్సు మీది విజ్ఞానవస్తువు
అది వినియోగపడినపుడే ఉగాది
అనాడు నాగీతం నివాళి

గాంధీ దీవించిన మేకపిల్లా ఇది
కబేళా బారినుంచి కాపాడుకుందాం దీన్ని
నెహ్రూ ఎగరేసినా పావురమా ఇది
దీని సందేశం విని పాటించుదాం దాన్ని

[—1969
ఉగాది.

# చచ్చేవాడికి సలహా

ఒంటెన్చంపేసి అప్పుడే నీళ్ళు తాగకు
ఈ ఎడారి యింకా బోల్డంత వుంది

ఈ ఎండన్చూసి గుండెలు బాదుకోకు
ఎప్పటికైనా చల్లబడుతుంది

నిట్టూర్పు నెప్పుడూ నమ్మకు
నీకు తోడుగా అదిరాదు,

నిశ్శబ్దాన్ని విస్మరించకు
నిదానాని కది పునాది

పామున్దాటేశావంటే
పక్కనే నిచ్చెనుంటుంది

వింతగా యింతగా విస్తరించేసినవాడివి
విత్తనంలోకి వెళ్ళిపోకు

ఈ బాతున్చంపేసి తినకు
ఇది రేపు బంగారం గుడ్లు పెట్టొచ్చు

[కళాకేళి
1969 మార్చి

# నీపద్యం నిరవద్యం

నీపద్యం నిరవద్యం
నిఖిల ప్రజకు నైవేద్యం
త్వర త్వరగా తెర వెడలే
సామ్య సంఘ నేపథ్యం

నీపద్యం సామర్థ్యం
విప్లవరథ సారథ్యం
బడుగు పేద బతుకు మీద
గొడుగుపట్టు ప్రతినిత్యం

నీపద్యం శ్రమస్వేద్యం
ధనస్వామి వైరుధ్యం
సామాన్యుల కామనలను
పండించే మొగుసేద్యం

నీపద్యం జనవేద్యం
అది అర్ఘ్యం అది పాద్యం
కూడు లేని గూడు లేని
అనాధలకు ఆతిథ్యం

నీపద్యం వైవిధ్యం
చీకటితో అభిమర్ధ్యం
ఆకలితో కేకలిడే
లోకజగతి కిడు ఖాద్యం

నీపద్యం వైదగ్ధ్య
వైమర్శిక దుర్భేద్యం
కమనీయం రమణీయం
కైపుతిగని ఒక మద్యం

నీపద్యం ఆరాధ్యం
మానిషాద సాఫల్యం
అనవరతం ప్రణవరుతం
వినదించే శుభవాద్యం

నీపద్యం బహు హృద్యం
కవన దేవి సాన్నిధ్యం
ఇంక ముందు ఇట్టి విందు
నీకైనా దుస్సాధ్యం.

[శ్రీ శ్రీ షష్టిపూర్తి సభలో చదివినది

—1970

# విప్లవ సౌభాగ్యం

వంచదారకన్నా తియ్యని పదాలు
మంచుగడ్డకన్నా చల్లని విషయాలు
పండుగ వేళ
లేదా పండుగైందని ఇల్లలికిన వేళ
నిండారు హృదయంతో
నీ ముందు పాడుదామనుకొన్నానుగాని
వర్తమాన సంక్షోభాన్ని అప్రియాలు కప్పెట్టి వర్ణిస్తే
కవిత్వం సమ్మె చేస్తుంది
కళ నీ అంచనా వమ్ముచేస్తుంది

అలంకరించుకున్న ఆరణ్యాలవంటి ప్రబంధాల సుగంధాలు
మధ్య తరగతి మెదళ్ళను మత్తెక్కిస్తున్నప్పుడు
ఆంధ్రదేశపు గోడల్లాగా క్రిక్కిరిసిన
అనేకానేక ప్రకటనలతో ఆధునిక కవిత్వం
సగటు మనిషిని సంభ్రమింప చేస్తున్నప్పుడు
స్వర్గంలో సహారా, స్వప్నంలో సవేరా
విస్తరించి జీవితాన్ని వికటింపజేస్తున్నప్పుడు
అయ్యవార్లకు లేవు అల్ప జీతాలు
పిల్లవాళ్ళకు లేవు కల్లపాఠాలు...
మిడిమేలపు కొలువులో మిడిసే బ్రతుకులు
పడుపుకూటికి తెరచుకొనే ఆకొన్న నోళ్ళు

నిండని కడుపులు పండని తలపులు
కిమ్మనకుండా, సుకవితా యద్యస్తి రాజ్యేన
కిమ్మనకుండా మిన్నకున్నప్పుడు
మంత్రిపావు ఉంటేచాలు
మంచికవిత్వ మెందుకని ఎలుగెత్తేటప్పుడు
పండించే హస్తాలకు తిండి దొరకనప్పుడు
దండించే కంఠాలకు దండలు వేస్తున్నప్పుడు
గణతంత్ర సంపదలను కైంకర్యం చేసిన
రామదాసులకు రశీదు లందుతున్నప్పుడు
వినబడుతున్న దేమిటీ వింత చప్పుడు
ప్రజ లేస్తున్నదా – ప్రభంజనం వీస్తున్నదా
ప్రావృట్కాల పయోధర జలాలు
ప్రతీపశక్తుల పాలిటి ప్రక్ష్వేడనాలు కురుస్తున్నవా
ప్రతారణాల చీకట్లు చీల్చుకుంటూ
ప్రగతి ప్రభాకరబింబం ప్రకాశిస్తున్నదా

కీర్తించదగ్గ విజయాలు ప్రాప్తించిన విజేతల
జయజయ ధ్వానాల వెనుక
విస్పష్టంగా వినబడుతున్నవి నాకు...
మురికి పేటల మూలుగు గుమాస్తాల ఏడుపు
నిండుకున్న నట్టిల్లు చూసిన ఇల్లాలి నిట్టూర్పు
గల్లాపెట్టె స్వాగతం ఖిల్లా బురుజు గర్వం
గల్లీలో వెలవెలది అర్జున కాస్త్రా
క్షేపసం చేసుకొనే గూండా కూళ్ళ ఊళ్ళ
నల్లబజారు కుట్రదారుల గుసగుసల స్వరమేళ

ఢిల్లీలో అధర్మాల అక్రమాల పాటల పల్లవి
పల్లెలో దరిద్రాల ముక్తాయింపు

ఇరుసు విరిగిన సైకిల్ రిక్షా
కప్పెరిగిన చుట్టుగుడిసె
సీటు దొరకని విద్యార్థి
చితికిపోయిన సంసారి
మూసివేసిన ఫ్యాక్టరీ మోసపోయిన కాంగారీ
ఖైదులోపడ్డ విప్లవకారుడు కలలుకనే ఆశావాదీ
ఎందరో ఎందరో చేదుసత్యాలు తింటూనే
స్పందించే గుండెలలో సంతరించుకున్న సుందరస్వప్నాల
శాశ్వతర స్వరసంచయాలను ఆకర్ణించాను
భవిష్యత్తు ఆవిష్కరించే
భవ్యాదర్శమూర్తుల చిత్తశుద్ధిని గమనించాను!
ప్రణాళికలు ప్రభవించే
పచ్చపచ్చని దృశ్యాలు వీక్షించాను
ఆలస్యాన్ని సహించని ఆవేశాన్ని గుర్తించాను
అడవిలో తుపాకుల సవ్వడిని అవగాహన చేసుకున్నాను
బోనులో చిక్కని సింహాల
త్యాగాల ఉరుతాలను స్వంతం చేసుకున్నాను
బోనెక్కించి నీ నీతిని విచారణ చేస్తున్నాను
నిన్నూ నీ చట్టాన్నీ నీ వ్యాఖ్యాతనూ
నిర్భయంగా సవాలుచేస్తున్నాను
నిలువునా నవరిస్తున్నాను నిండుతనం చేకూర్చుకున్నాను

పండుటాకులు రాలడం కొత్త చిగుళ్ళు వేయడం
ఏక కాలంలో జరిగిపోతున్న యీ విసూత్న ఋతువులో
జీవన సంగీత వృత్తాన్ని
ఛేదిస్తూ ఏమిటీ అపశ్రుతుల గొడ్డళ్ళు
ఎవరీ పరశుధారులు ?
ఏమిటీ పాశవిక విధ్వంసన ?
ఎవరయ్యా ఎవరయ్యా వీరు ధూమకేతులా ?
కారు, శ్వేత కేతులు
చిరంతన డోలాందోళనలో చిక్కుకొన్న చిరకారులు
తండ్రి ఆదేశాన్ని తలదాల్చి
తల్లి వ్యవస్థ తలకొట్టే పరశురాములు
రాచరికాలను రూపుమాపదలిచే రణశీకర జామదగ్నులు
రాకాసి తాకట్టు జగతిని
వాకట్టుచేసే రాస్కాల్నికోవులు

లెమ్మంది లేచింది యీ జీవనతరంగం
రమ్మంటె రాజుకుంది యీ యువకాగ్నిహోత్రం
ముష్కర కృత్యాలతో శుష్కత్యాగాలు చేసే
ఈ సుమనస్కుల సమవకారం పిమ్మట
ఎవరోహో ఎవరోహో ఊరేగుతున్న యీ వీరవివేకులు
ఎవరోహో ఈ వికసించిన
చైతన్యపుష్పాలు ప్రజ్ఞా ఫలాలు
అధిక చక్కని కలలన్నీ పండించే ఆశయసిద్ధులు
ఆనంద కన్నీళ్ళు పొంగించే అమిత మానవాత్ములు
వసుధలో వైకుంఠ వాకిళ్ళు తెరిపించే వజ్రసంకల్పులు

ఏమిటని వీళ్ళు విర్మించుతున్న వినూత్న సమాజం ?
అక్కడ సుఖాలు దినకొత్తలా ?
అక్కడ జనాలు శుభచిత్తులా ?
అవును అక్కడి విశేషాలు కవిత్వంలో ప్రవచించను
జనతకు కావలసిన జాదూ
ఉమ్మడి సంకల్పంలో ఉద్యమంలో ఉత్సాహంలో
ఉత్పన్న మవుతున్నప్పుడు ఉధృత మవుతున్నప్పుడు
రాజకీయ చైతన్యం రసమయగీత మవుతున్నప్పుడు
స్వభావోక్తులు సవ్యే చెయ్యావు
అతిశయోక్తులు హర్త్రాళం చెయ్యావు
కమనీయ సమవాద జగత్తు గమ్యమైనప్పుడు
కవిత్వమే వాహన మవుతుంది
కవి చోదకుడవుతాడు
బజారు సొమ్మంటావా ? ఇది కవిత్వం
కదనాని కొస్తావా ? అవశ్యం !

జోకొట్టడమే కవిత్వమైతే
అకవిత్వాన్నే ఆహ్వానిస్తాను లేపడానికి
కళ్ళుకప్పడమే కవిత్వమైతే
అకవిత్వాన్నే ఆవాహనచేస్తాను కనుకట్టు విప్పడానికి
సనాతన పరపీడనాతత్త్వాన్ని
సమూనభూయిష్టం చేయటమే కవిత్వమైతే
అకవిత్వాన్నే అనువదిస్తాను
నవీనజన విమోచనాన్ని జాను తెలుగులో పాడ్డానికి
జనసామాన్యం నోచుకోలేని లగ్జరీయే కవిత్వమైతే
అకవిత్వాన్నే ఆరాధిస్తాను నిసర్గనిరాడంబరత్వానికి

ప్రజాపరం చేస్తున్నాను ప్రపంచవాఙ్మయాన్ని
ప్రస్థానభేరీ వేయిస్తున్నాను బావుటా ఎగరేస్తున్నాను
ఇది ఉగాదికాదు పొమ్మంటున్నాను
నూతన శకాది.,

[1970 ఉగాది ?

# పిలుపు

నక్షత్రాలైటూ కలసి రావయ్యా
నవశక్తి యువశక్తి తేవయ్యా
క్రూర జగతిదళాలు ఈ ఋతువులో రాలు
కొత్త చిగురులు వేయ రావయ్యా!

నీ మనసు శుద్ధమని తెలుసయ్యా
నీ కినుక సవ్యమని తెలుసయ్యా
విడి దుడుకు చైదాలు విధ్వంసనోగ్రాలు
విప్లవమ్మని తలచలేనయ్యా!

దుష్టధనికుని అణచవలెనయ్యా
కష్టజీవుల మనచవలెనయ్యా!
ప్రజలు లేవనివరకు ఫలితముండదు కసకు
ప్రజల విముఖుల చేయవలదయ్యా!

నీ గుణము శతకోటి విలువయ్యా!
నీ గుండె చదువులకు నెలవయ్యా
ఒక్క నెత్తుటిబొట్టు పెక్కుధనికులపెట్టు
శుష్కత్యాగము చేయవలదయ్యా!

అమ్మకడుపున చిచ్చు కనవయ్యా!
అయ్య కన్నుల వరద కనవయ్యా!

ఇల్లు ఇలకుపునాది ఎల్ల ప్రేమలగాది
ఇంటివారల మార్చ రావయ్యా!

వికట భారతచరిత మనదయ్యా
శకుని పాచికపారె కనవయ్యా!
ప్రభువర్గములకన్ను పద్మవ్యూహమువన్ను
అభిమన్యువై ఏగవలదయ్యా!

భావితరముల పిలుపు వినవయ్యా!
జీవితమ్మున మలుపు కనవయ్యా!
మెరికలాంటి మగాడ! కరకుగుండెల ప్రోడ!
మిడతవై ఇటు రాలవలదయ్యా!

సంఘటితమవుదాము రావయ్యా!
సౌమ్యసంఘము నిలుపుదామయ్యా!
తరుణ హృదయపుపొరల దాగున్న నీ మరుల
ధావళ్యమే మూలధనమయ్యా!

[వీరసం పుట్టిన మర్నాడు
1970

# అన్వేషణ

అన్వేషణ పూర్తయింది
ఆంధ్రమాత చిరునామా దొరికింది
ఇప్పుడింక నికరంగా చెప్పగలిగే ఎడ్రస్సు
ఎంతో గవేషణ జరిగాక ఎడదకు తెలిసింది

ఆదిలో గతాల గాదిలో
పుక్కిటి పురాణాల బూదిలో
సొంటుసోకుల టక్కరి సోదిలో
తాళీదళ సంపుట ప్రకర కాంతారాలలో
దండకవిలెల్లో
ఉద్దండ పాండితీ ముండిత ప్రబంధాలలో
వెదికాము వెదికాము వెదికి వేసారాము
వేసట తప్ప తెలుగుతల్లి విలాసం దొరకలేదు.

అమరావతి శిల్పాలలో గాలించాము
అధినాథుల సింహాసనాల మెత్తని తల్పాలపైన చూశాము
చరిత్రలో నదుల్లాగ పారిన నెత్తురూ
నదిలో కడిగిన కత్తులూ పరీక్షించాము
సాయాణం ముగిశాక స్వోత్కర్షకై
విజేతలు నాటిన విజయస్తంభాలు వీక్షించాము.

కసిపెంచే నోసటిబొట్ల కొట్లాటలు గమనించాము
సమభావం చాటుకున్న చాపకూళ్లు పరికించాం

ముంజేతికి మీసమున్న మొనగాళ్ళను ప్రశ్నించాం
మునుపు తల్లి ఎక్కడుంది? తబిసీళ్ళను చెప్పరండి.

అడిగిన దొక్కటే ప్రశ్న
ముడి విడవని దొకటే సమస్య
అయినా వచ్చిపడెను వందలాది
విచ్చీవిచ్చని సమాధాన గుచ్ఛాలు
సందేహాల దేహళి తెరవలేని
సవాలక్ష దొంగతాళాల గుత్తులు

అన్నాడప్పుడొక అన్నలాంటివాడు
తల్లిజాడ లరసిందికి గురువుజాడ మెరసేవాడు

"గతంలో గాలించకండ్రా
గతం మనకి హితం కాదు
ఇందులో ఎన్నిసార్లు ఎంచినా మంచి కొంచెమే
ముందున్నదే జీవితం
ముందులోనే ఆంధ్రమాతకు మందిరం కట్టండి
మట్టితో కాదు మానవ హృదయంతో కట్టండి
ఎందుకంటే నిజం వింటే
మట్టికాదురా ముఖ్యం మనుషులే దేశం"

అన్నలాంటివాడు అన్నమాట విన్నవెంటనే
నిన్నటి గొప్పనంతా నిప్పుల కొదిలేసి
మొన్నటి శిథిలాల మొఖాసా ప్రొఫెసర్లకిచ్చేసి
ప్రశస్తి కీర్తించే ప్రబుద్ధుల కది కవితా వస్తువు కాపించి

జనంలో జీవనంలో
జాగృత చైతన్య క్షేత్రాలలో
జనని కోసం వెతుక్కొన్నప్పుడు
పెత్తనాల బెత్తాలు చేతపట్టిన పెద్దలు
భారతమాత సంగతి ముందు పట్టించుకోవాలోయ్
తరువాత చూసుకుందాం తల్లి సంగతన్నారు

వీరులమై వీరణాలు మ్రోగిస్తూ
వేరే జాతరలో పడ్డాం
ఏడాదికోసారి మాత్రం
ఏదీ ఆంధ్రమాత అని అడిగాం
సమరం ముగిశాక స్వాతంత్ర్యం వరిశాక
సవతి తల్లి పోషణలో సమఉద్దేశం తెలిశాక
నిండు ప్రాణాన్ని బలి చేసి
దండి నిరసన తెలియజేసి
సాధించాం ఆశించింది
సామాన్యుల రక్తంచింది

గొనగొనా కట్టాం గుడారాల వూరు
గొప్పగా చాటుకున్నాం గోరంత పేరు
ఇల్లు కట్టాంగాని తల్లి కనపడదు
ఇల్లలికాంగాని పండగ కాలేదు
అప్పుడు బోధపడింది అసలైన లోపం
అందరూ కలిస్తేగాని అమ్మ రాదన్న సత్యం
పెద్దిల్లు కట్టాం పేరుపెట్టి పిలిచాం
సన్నాహాలు చేశాం సంబరాలు చేశాం

ఆర్భాటాల బరాటాలు కాల్చాం
ఆలయ ద్వారాలు తెరిచాం
గర్భగుడిలో ఉన్నది ఆంధ్రమాత కాదని
నిర్భయంగా చెప్పారు నేటి తరంవాళ్ళు
ఏది ఎక్కడుంది ఎక్కడుంది
ఎలాగుంటుంది ఏమైంది

గాభరాపడకండి ఆమె
గల్లాపెట్టెల కడుపులోనే వుంటుంది
కావలిస్తే రాయండి కార్డో కవరో
కేరాఫ్ కేపిటలిస్టులని
నేరుగా చేరుతుందా జాబని
నేర్పుగా చెప్పారు నవకోటి నారాయణులు

కార్మికుల ఇళ్ళలో కర్షకుల మళ్ళలో
కాయకష్టం చేసేవాళ్ళ కళ్ళలో
ఉండక తప్పదామె రండ్రా వెతుకుదాం అన్నారు
ఉత్సాహం వెల్లివిరిసే యువశక్తులు

అన్నదమ్ముల కొట్లాటకు నొచ్చుకొని
అడవులు పట్టి వెళ్ళిపోయిందన్నారు కొందరు
విధాన సౌధాల విస్తృత ప్రాంగణాలలో
వెతుకుతున్నారు వెలిగించిన కళ్ళతో కొందరు

శ్రీకాకుళం అడవుల్లో చిన్నవాళ్లు గాలిస్తున్నారు
శివార్లలోనున్న ద్రాక్షతోటలు సిద్ధంచేస్తున్నారు శ్రీమంతులు
లాకవుట్ బోర్డులు తగిలించిన ఫ్యాక్టరీలవద్ద
బక్కచిక్కిన దుక్కిటెద్దును ఓదార్చే ముసలిరైతు పక్క

కళ్ళంలో పంటను కళ్లెదుటే సాహుకారు జప్తు చేస్తుంటే
కడుపుల్లో కార్చిచ్చులూ కళ్లల్లో జలపాతాలూ
అదిమిపట్టుకొనే అసహాయ సైరికుని చెంత
విద్వేషాగ్నులతో విచిత్ర యజ్ఞంచేసే విప్లవ సైనికుల వెనుక
వాడి గోళ్ళ పావురాళ్ళ గూళ్ళలోపల
ఫలిస్తున్న ప్రాజెక్టుల గుండెల్లో
ప్రగతి శీల శక్తుల ఊపిరిలో
ఎక్కడుంది? ఎక్కడుంది? మాతృమూర్తి
ఎలా దొరుకుతుంది ఆమె విలాస విస్ఫూర్తి?

దీపాలు నిద్రపోతున్నప్పుడు
చీకట్లు మేల్కొంటున్నప్పుడు
చిరునవ్వులన్నీ చిరునామాలు వెతుక్కుంటూ
గాఢ నిద్రలో వున్న వాళ్ళ పెదిమలు చేరుకుంటున్నప్పుడు
పగలెల్లా ఆకలిని, అసంతృప్తిని, అవినీతిని
ప్రత్యక్షంగా చూసి బాధలో రెప్పలు వాల్చిన
జాతిపిత విగ్రహం పాదాల చెంత
జలజలా కన్నీళ్లు కారుస్తూ కనబడిందామె

అమ్మా అన్నాను! రమ్మన్నాను
ఆలయమందన్నాను, ఆహ్వానించాను
కాలు కదపలేదు
నోరు మెదపలేదు
అయినా అర్థమైంది ఆమె ఆవేదన

అన్నదమ్ముల మధ్య అసమానతలు
అధికారానికీ మమకారానికీ మధ్య అగాధం
హెచ్చుతగ్గులు రేపే చిచ్చు
హెచ్చరిక వినిపించుకోని చెవుడు
మనలోని అవలక్షణాలన్నీ
జనయిత్రికి హృదయ శల్యాలు

నా బిడ్డల్లో ఏ ఒక్కడైనా సరే
గూడు లేనప్పుడు, నీడ లేనప్పుడు
పట్టెడన్నం లేక మరణం తప్పనప్పుడు
నా కెందుకు మీ మందిరాలు ?
నా కెందుకు మీ సంబరాలు ?
అంటున్నవి ఆమె కళ్లూ మనసుంగా

వింటున్న నేను వెంటనే శపథం చేశాను
వెళ్ళిపోతున్న ఆమెను వెంబడించాను

అన్వేషణ పూర్తయింది
ఆంధ్రమాత చిరునామా దొరికింది
అందరికీ అన్నీ లభించే ఆనందయుగం మీరు తెండి
అప్పుడు చెప్తాను ఆమె ఎడ్రస్సు
అంతదాకా సాధించాలి ప్రోగ్రెస్సు.

[ఆంధ్రావతరణం జయంతినాడు
1971

# జై - జై

చిందుతున్న ఈ రక్తం చెప్తున్నదేమిటి?
మండుతున్న గుండెలు ఖండించేదేమిటి?
మతం ఒకటైనా అభిమతాలు ఒకటి కాలేవు
భాషరాని పాలకుడు ప్రజల అభిలాషలు గుర్తించలేడు
అనువదించుకొన్న కిరణాలు ఆశలు వెలిగించలేవు
దిగుమతి చేసుకొన్న ఉత్సాహం దిగులును పోగొట్టలేదు
పోతుగడ్డమీదనే పోరాటం మొదలవుతుంది
ప్రజల గుండెలలోనే ప్రతిఘటన రూపొందుతుంది
సిమెంటు చట్టాలను చీల్చుకొంటూ చెట్లు మొలచేటట్లు
సేనల నియంత్రత్వాన్ని ఛేదించుకొంటూ
స్వేచ్ఛ మొలకెత్తుతుంది

దోపిడీ రాపిడీ నిన్న
నెత్తురూ కత్తులూ నేడు
విముక్తి అభ్యుదయం రేపు
ముక్తి ఫౌజు ముజీబు
మూర్ఖ శక్తుల జవాబు

7

[ఆగస్టు 1971

# ఏటికేడాది

ఉగాదినాడు తెలుగు తల్లి
దిగాలుపడి కూర్చుంది
అగ్ని పాటలు పాడింది
ఆకాశం బీటలు వారింది
భాష రాని పరదేశిలాగ
ఆశయం అల్లల్లాడింది.

తనలో తాను హాస్యగాడు ఏడ్చినట్లు
తరంగాలు నవ్వుకుంటున్నాయి.
చీకట్లు కట్లు తెంపుకున్నాయి
చింతలు విస్తరిస్తున్నాయి

గుండెకూ గుండెకూ మధ్య
రెండు గ్రహాల దూరం.
మనసుకూ మనసుకూ మధ్య
మరో జన్మంత ఎడం

అక్షరాలు పక్షుల్లాగ
ఆలోచనాంబరంలో ఎగర లేనప్పుడు
కత్తుల పెత్తనం
నెత్తుటి సంబరం

అంధకారం తొలగని బంధిఖానా
అధికారం ఎగిరే జముఖానా

బీగాలు వేసిన పెదవులు
రాగాలు పాడలేవు
నీచేతిలో వున్న గంతలు
నీ కళ్ళ కయినా కట్టుకోకు.
అయినా ఒక్క మాట
నయనాలు మూసుకున్నా ఊహాలు ఆగవు
నీ చుట్టూవున్న నిజానికి
నీలి రంగు ఎన్ని యుగాలు పూయగలవు?
వెన్నెలను ఎన్ని వేళ్ళ గొడ్డళ్ళతో
విచ్ఛిన్నం చేయగలవు?
తనంతట తానే వచ్చినా
తరిమితే చీకటి పోదంటావా
ఇంట్లో లేకపోతేనేం గాక
కంట్లో వెలుగుంటే బతుకంతా కాంతులే కదా
అందుకే అంటున్నాను మరోమారు
అందుకే చేస్తున్నాను హెచ్చరిక
నీ చేత్తో చూస్తూ చూస్తూ
నీ కన్ను పొడుచుకోకు
నీవు కట్టని గుడిలో
నీ దేవుణ్ణి నిలపడానికి ప్రయత్నించకు
నీది కాని మడిలో
నీ విష బీజాలు జల్లడానికి పూనుకోకు
కుంచుకుపోతున్న గోడల మధ్య
గుండెలు పళ్ళలాగ నలిగినపుడు
నీవు పిండిన నెత్తురు రసం
నీవు తాగక తప్పని గరళం

చిరంజీవుల్ని అమరజీవుల్ని చేసి
చితాభస్మం ఒళ్ళంతా పూసుకుంటావా
బుసలు కొట్టి రుసరుస నినాదాల
భుజంగాలు నీ ఉరితాళ్లు
ఇప్పటికీ మించిపోలేదు మేలుకో

ఎద తెరచి వివేకాన్ని ఆహ్వానించి
చుట్టూ కట్టుకొన్న దళ్లు విరక్కొట్టు
మిట్టమధ్యాహ్నం తమిస్రాన్ని తిరక్కొట్టు
ఎవరి కళ్ళతోనో అన్నీ చూడకు
చివరకు నిన్నేం చేస్తారో యోచించు
నీకోసమా ఈ గోడలమీద బూతులు
నీ మేలు కోసమేనా వీళ్ళ దుందుడుకు చేతలు
నీకోసం దండిన చందాలు
ఏ కడుపులోకి వెళుతున్నాయో తెలుసా?
నీకోసం ఆపేసిన రైళ్లు
ఏ కడగంటి చూపులమ ఆపేశాయో
పూలదండలు మెళ్ళో వేసుకుని
పూటల వారీగా అభోజనం కూర్చునే వాళ్ళని కాదు
మురికి పేటల్లో రోజుల తరబడి నిరాశవల్ల
నిరుద్యోగంవల్ల పస్తులు పడుకునే వాళ్ళను పరికించు
ఊరేగింపులో నడుస్తున్న వాళ్ళను కాదు
ప్రేరేపించి నడిపిస్తున్న వాళ్ళను చూడు
ఈ ఆరాటం నీ పోరాటం కాదు
సిరుల ఝంఝూటంలో నిరుపేదల బులబాటం కలపకు

ఉన్నవాళ్ళ స్వలాభాలకు
అన్నదమ్ముల కలహమనే మారుపేరు పెట్టకు
కీలుబొమ్మలు పాలిస్తే మేలు జరగదు
క్రీనీడలు పెరిగితే కీడు తరగదు

[redacted]వాలని వేసుకొంటే సంకెళ్లు
పోవాలన్నా పోవు కడగళ్లు
అంతరాత్మను తాకట్టు పెట్టిన పిమ్మట
ఎంత చిన్న దెబ్బయినా ఒక సమ్మెట
అగ్నిశిఖ చుట్టూ తిరుగుతున్న శలభం
ఆహుతై పోవడం చాలా సులభం
తెచ్చి పెట్టుకొన్న ఈతి బాధలు
హెచ్చవేయకమానవు కన్నీటి గాథలు

ఎంత ఎగరవేసినా గూండా
ఎగరలేదు తిరుగుబాటు జండా
కూలికి వచ్చిన కుబేర సైన్యం
తోలి వేయలేదు కుచేల దైన్యం
గుండెల లోంచి రావాలి ఉద్యమం
కండల లోంచి పెరగాలి ఉద్యమం
ఎత్తిన పిడికిలిలా ఎగరాలి జండా
ఎలుగెత్తిన నినాదాలు నిండాలి దిక్కుల నిండా
ఎండమావులకోసం చాలించు కలహం
నిండు జీవితం కోసం సాగించు పోరాటం

నిరుడు తిన్న ఉగాది పచ్చడి
నీలో ఏటికేడాది వికటించింది

నేడు తీసుకొంటున్న శపథం
నీకు చూపిస్తుంది క్రాంతి పథం
సామ్యవాద కదనం మన సహోదరుల సదనం
జయించాక హాసిస్తుంది తెలుగుతల్లి వదనం

[1972 ఉగాది

# అసహనాపనతం

మా భాషలోనే గులాబీ పరిమళిస్తుంది
మరో భాషలో గుబాళించదు

మా ఊళ్ళోనే చంద్రుడు నవ్వుతూ ఉంటాడు
మరో ఊళ్ళో అఘోరిస్తాడు

మా కత్తులు సైతం మెత్తగా ఉంటాయి
మా నెత్తురు ఆహో నీలంగా ఉంటుంది

మా ఊళ్ళో పాములు అమృతం చిలుకుతాయి
మా నోటి తిట్లు ముద్దు లొలుకుతాయి

మా గొప్పలు మేం చెప్పుకోకూడదు కాబట్టి
మా ఘనత కీర్తించండి బాకాలతో

ఊరకే విరచించి పారేస్తాం రోజుకు రెండు గేయాలు
ద్వారబంధాలు పట్టని గోలుకొండ ముత్యాలసరాలు

మా తాతలు నేతులు తాగారామరి
మాకు ఇప్పటికీ తేన్పులొస్తాయి నమ్మండి

మా డొక్కలు మాడుతున్నాయంటారా ?
మజ్జారే! ఎంత కమ్మగా పాడుతున్నాయో వినండి

[1972

# తీరని కోరిక!!

విత్తనంలోకి మళ్ళీ వెళ్ళిపొమ్మంటావా?
ఎత్తి నా గొంతుక, పిడ్చిమంటావా?
పద్యాలకు లేని స్వాతంత్ర్యంతో
పక్షు లెగురుతూ వుంటాయి

ఓనమాలు రానివాళ్ళతో
ఒంటరిగా నడవడం కష్టం
అల్పీసూదుల పరుష్నీద
కల్పాంతందాకా పడుకోలేను

దారి తప్పిన బొట్టెణ్ణి
తల్లి తలుచుకొన్నప్పుడు
భూలోకంలో లేనివాడికి
పొలమారుతుందా?
ఓడపోయిన కళాసీలాగ
ఊహల్లో తచ్చాడుతున్నాను
ఊపిరి తప్పించి
ఉపమానాలు కూడా లేని బికారిని
పొలమారని పుస్తకంలోనికి
పొమ్మన్నా పోను

ఒడ్డును సముద్రం ఒలుచుకు తినేసింది
గుడ్డిద్దులకోసం చేను ఎదురు చూస్తోంది.

[ 1972

# పెద్ద కావ్యంలోంచి చిన్న పద్యం

విశా'పట్నం విలువైనది నా మట్టుకు
విశాఖన్నా నిజమైనది నా మట్టుకు
విశాలంగా వికసించుతా నంటుంది
మసాలాలాగ మస్తిష్కానికి ఎక్కుతోంది

ఈ ఊళ్ళో పుట్టి పెరిగానా మరి?
ఈ ఊరు విడిచిపెట్టి పోయానా సరి!
ఎప్పుడైనా వచ్చి చూస్తుంటానా యీ పురి
అప్పుడు అవతారాలెత్తుతుంది నా ఊపిరి

నిలబడరా భాగవతులా! అంటుంది శివరామయ్య బడి
నిలబడవోయి శంకరం! అంటుంది రీడింగు రూము
నిలబడకు వెళ్ళిపో అంటుంది వాల్తేరు స్టేషను
ఎక్కడి కెళ్ళినా వెళిపొచ్చి అంటుంది ఏరాడ కొండ

నిన్నలన్నీ నింపాదిగా నెమరు వేసుకోలేను
నన్ను నేను అద్దంలో యివాళ పోల్చుకోలేను
నాకన్నా నా స్వగ్రామం చిన్నదెప్పుడూ కాదు
నా ఊరు నాకన్నా గొప్పది కాకపోదు.

[1972 ?]

# ఆ - ఆ - ఆరుద్ర గీ - గీ - గీతం

వెలగమంటే వెలుగుతాను
వెన్నలాగ కరుగు
వెళ్ళమంటే పోతాను
వీధిలాగ పరచుకో

నన్ను నీ రక్తం పిలిచినప్పుడు
కన్ను పరధ్యానంగా ఉంది
మొన్న నీ మౌనం పగలనప్పుడు
పొద్దు పొగ చూరింది
దాచిన అశ్రులన్నీ పూచనప్పుడు
సంధ్యారాగం మబ్బుకొన్నప్పుడు
గుండె గుబాళించనప్పుడు
నరాలు గుర్రాలు దిగనప్పుడు

నిన్ననో మొన్ననో పూర్వజన్మలో
నిద్ర చైతన్యాన్ని వలచింది
నీ నిట్టూర్పు నన్ను దొలిచింది
నీ కన్నీరు నన్ను కలచింది
నిచ్చెనలు విరచి పారేశాక
పచ్చిక వెచ్చగా నవ్వింది
నీమీద నేను పాడలేనుగానీ
నా మనస్సుగా ఇలాగే స్పందించు.

[1972 ?]

# భళారే

బాపురే నరుడెంత మొనగాడు
ఒరి వెడలి తా పెచ్చు పెరిగాడు
ధరణి గుండెలు దొలచి దైవశక్తుల గెలిచి
తనకు తానే ఓడిపోయాడు.

నీటిలో చేపలా ఈదాడు
నింగిలో పిట్టలా ఎగిరాడు
మరలు తిప్పే ఘనుడు పొరలుకప్పే జడుడు
మనిషిలా మాత్రమే మనలేడు.

చందమామను మెట్టి వచ్చాడు
అందరానిది పట్టుకొచ్చాడు
దూర గోళము దాసి దొడ్డపనులను చేసి
చేరువైనది విస్మరించాడు.

జీవహింసలు పాపమంటాడు
చీమనైనను తొక్కనంటాడు
మహిని పసువులగాచి మనసారగా బ్రోచి
మనిషినే కాల్చుకొని తింటాడు.

స్త్రీలు బానిసలనుచు తలచాడు
స్వేచ్ఛనిచ్చితిననుచు మురిశాడు
అదిగా దినదినము ఆలిదే పెత్తనము
అబలదాసున్నానుచు మరిచాడు.

తన సుఖముక్కై మోసగిస్తాడు
తడి గుడ్డతో గొంతు కోస్తాడు
ధనము విలువల పెంచి మనసు మమతలుత్రుంచి
దానవునిగా పరిణమిస్తాడు.

తప్పులెన్నో తాను చేస్తాడు
అప్పుడప్పుడు తిరిగి చూస్తాడు
మచ్చలన్నియుకడిగి మాయమర్మములుడిగి
మరల మనిషిగా పరిణమిస్తాడు

విత్తనములో చెట్టు చూస్తాడు
నిలయమందున సృష్టి చేస్తాడు
పాత తప్పులు రోత నూతనానికి జోత
కేతనమ్మును ఎగుర వేస్తాడు

# దివ్యసంధ్య

అప్పుడే ప్రభవించిన శిశువు చూడలేదు
వెలుతురు.
ఎప్పుడో కట్టేసుకొన్న ముసుగు చూడలేదు
వెలుతురు.

జీవన సంగ్రామ రంగంలో సంఘటితమౌతున్న శక్తులు
తెంపుకొన్న సంకెళ్ళనే ఆయుధాలు చేసుకొని
సజీవ స్వప్నాలకోసం సాగినప్పుడెంత కాంతి?
ఎంత కాంతి!

నీ చుట్టూ దింపుకొన్న నిరాశ పరదాలను
సళితమైన నా కళ్ళ భూతద్దాల నుండి కేంద్రీకృతమైన
నిరంజన ఆశా[illegible] తపం తగలబెట్టిన తరవాత
నీవు చూడగలుగుతావు నా వెలుతురు
కోటి శ్రమజీవుల కూటమిలో
వెలుతురు.
సాటి నడిమి తరగతివాళ్ళ నయనాల్లో
వెలుతురు.

మిత్రుడా! శాశ్వతంగా మోసపోయానంటున్నావు
శత్రువుని తీసుకొచ్చి నీ ముందు బంధించాను
నీ నిట్టూర్పులతో వీడి కట్లు తెంపకు
నీ చేతకానితనంతో వీడికి జవసత్త్వాలివ్వకు

కావిరి నిండిన కళ్ళ కటకటాలు తెంచిచూడు
కనుచూపులు ఖడ్గాలు చేసుకో
వీణ్ణి ఈ మోసగాణ్ణి అహింసతో క్షమించకు

పుడమి తల్లి పురుటాలు
వీడేమో ఆమె జవనాలు తన జలసాకోసం
నొక్కుతాడు; స్తన్యం మనకు
దక్కనీడు; ఏ పుణ్యం మనకు
దక్కనీడు ఈ మొక్కలీడు.

వీడు పుంభావ పూతన
వీడి నిజస్వరూపం తెలిస్తే
మనలో ప్రతిఒక్కడూ బాలకృష్ణుడు!
ఏ పల్లైనా రేపల్లే!
అందులోని పాలూ పెరుగులు మనవి;
అందులోని వెన్న మీగడలు మనవి

చిలుకుతున్న పాల కడవలో
వెలుతురు.
పెరుగుతున్న రేపటి శిశువు బోసినవ్వులో
వెలుతురు.
వీర్యవంతుల ధైర్యం లాగ
దేదీప్యమానమైన వెలుతురు దుప్పటిపై
రాత్రి కన్య ఉత్సంగ మధ్యాన
శ్వేతవర్ణాలు కురుస్తున్న దివ్యసంధ్య

కేరింతల వలయాల వెనక
కిరణ్మయి వక్షోజాలపై
నక్షత్రాలు ప్రతిఫలిస్తున్నాయి చూడు!
నేను ఊహిస్తున్న, ఆహ్వానిస్తున్న,
మనిషి పుట్టుకతోనే సర్వస్వాతంత్ర్యుడు
అతని కన్నుల వెనుక ఉదయభాస్కరాన్ని
ఎప్పుడూ, ఎన్నడూ,
ఎవ్వరూ, అపహరించలేరు.

[ఆంధ్రజ్యోతి వీక్లీ
25-8-72

# ఆశ

ఉరుముతున్న కవిత్వం
కురుస్తుంది పిడుగులు
ఊరేగే ఉద్యమం
చేరుతుంది గమ్యం

కత్తులు నూరుతున్నా కవిత
మెత్తగానే వుండవచ్చు
నెత్తుటి కందుగానే ఎప్పుడూ
కొత్తతరం జనించక తప్పదు

పువ్వులు కలలో కూడా
నవ్వలేవు విషపు నవ్వులు
జవ్వనం మంచికి నడుం కడితే
ఎవ్వరూ మూయలేరు తలుపులు

నిన్నలో బ్రతుకుతున్న వాళ్ళు
ఎన్నడూ వినరు వర్తమానం
రేపుకోసం తపించేవాళ్ళు
చూపిస్తారు కొత్త ద్వారం

[ఆంధ్రజ్యోతి వీక్లీ
20-10-72

# దారిద్ర్య విద్రావణం

## అను గరీబీ హటావో

శంఖాల్లాగ మోగుతున్నాయి
ఢంకాల్లాగ మోగుతున్నాయి
పుంఖాను పుంఖాలుగా
పుకార్లు రేగుతున్నాయి
ఉన్నవాళ్ళందరూ దరిద్రానికి
ఉద్వాసన చెప్పబోతున్నారట

కన్నీళ్లు తుడిచేసుకొంటున్నాడు సామాన్యుడు
ఎన్నికల సమయంలో అతడు సదా మాన్యుడు
అతని దేశం రత్నగర్భ అతని వాసం వట్టి వశిని దిబ్బ
అతని పొలం జీవగడ్డ అతని ఫలం మంటిగడ్డ
అతని యింట్లో ఎన్నడూ ఉండదు కరువుకు కరువు
అతని కళ్ళకు ఎన్నడూ కనబడదు బ్రతుకు తెరువు
కలలో కూడా అతడు కావించేది కాయకష్టం
ఇలలో నిత్యం లభించేది కలల ముదనష్టం
కాని ఆ కర్మయోగి కాలేడు భగ్నహృదయుడు
మేనువంచు శ్రామికుడు మేలువాసి ఆశామయుడు
కాలేవు అతని భావకేదారాలు ఊషరక్షేత్రాలు
క్రాంత దర్శనం చేస్తాయి అతని గంభీర నేత్రాలు
చల్లగాలికి పక్షపాతం లేదు
చల్లని అవనీమాతకు పక్షపాతం లేదు

పారుతున్న ఏటికి పక్షపాతం లేదు
పండిన చెట్లకు పక్షపాతం లేదు
తాటిచెట్టునీడ తలదాచుకొన్నంతేగాని
పాటుపడి అల్లిన తాటాకుల ఆశ్రమం
సాటి వారందరికీ చక్కని ఆశ్రయం

ఎందరో కలసి నిర్మిస్తారొక సుందర నికేతనం
ఎందువల్ల ఒక్కడే ఎగురవేస్తాడు దానిపై తన కేతనం ?
అనుభవం వివరిస్తోంది ఆర్థిక పాఠాల ధర్మాలు
అదే విశదపరుస్తోంది అధికార పీఠాల మర్మాలు
ఎవరి స్వార్థం నిర్మించింది అవకతవక వ్యవస్థ
ఎవరు రుద్దుతున్నారసంఖ్యాకులపై ఈ దురవస్థ

సంచులున్న వాడిదే ఎప్పుడూ పంచాయితీ రాజ్యం
లంచమిచ్చేవాడిదే లైసెన్సుల సామ్రాజ్యం
రాజ్యం వీరభోజ్యమంటాడు ధనస్వామి
రౌడీలను కూలికి రణవీర భటులను చేస్తాడు
తేరగా బొక్కే హక్కు తనకు దేవుడిచ్చాడంటాడు
తింటున్న పరాయికూడు తన అబ్బ సొమ్మంటాడు

అక్కుపక్షులెందరో తక్కువ కూలికి
రెక్కలు ముక్కలు చేసుకొంటేతప్ప
ఒక్క ధనికుడు ఎప్పుడూ
పెక్కు లక్షలు వెనకెయ్యలేడు
కోటిమంది నోటిముందు కూట్లో దుమ్ముకొడితేనేతప్ప
కోటీశ్వరుడు కుబేరుడిగా అవతరించలేడు

వృద్ధి చెందుతూ ఉండగా ఒకని శ్యామల ధనాగారం
ఉంటుంది దాని వెనుక తప్పక ఒక గొప్ప నేరం
విస్తుపోయేటంత వెలుగుతుండగా ఒక వ్యాపార జాతకం
చేస్తూ వుండాలి అతగాడు సాంఘిక మహా పాతకం

కష్టజీవులు సృష్టిస్తారు ఐశ్వర్యం
కలవాళ్ళు పంపిణీ చేస్తారు దారిద్ర్యం
దళారీలు బలుస్తారు మధ్యలో
దరిద్రులు పడిపోతారు జీవన రథ్యలో
త్రాణ లేని బడుగు పేద నాసికలో
ప్రాణ వాయువు పోస్తుంది ప్రగతి చింతన
తరతమ భేదాలను ప్రబోధించే
పురాణ వేదాలను నవీన సోమకు డెత్తుకుపోతే
మత్స్యావతారుడై ఏ లక్ష్మీపతైనా సరే
మళ్ళా వాటిని ఉద్ధరించలేడంటుంది ప్రగతివాణి
ప్రజాసేవ గోముఖాలు తగిలించుకొన్న
పెత్తందారీ వ్యాఘ్రాలు కావిస్తున్న
అభిభాషణల ఆకులూ అలములూ తింటూ
వాగ్దానాల వాయు భక్షణ చేస్తూ
తపస్సు చేస్తున్నంత కాలం విపన్నులు
తపనీయ సౌమ్య సంపన్నులు కాలేరు

నిరుపేదలకు నిజం తెలియనంతకాలం
నర వాహనుడై కుబేరుడు చెలాయిస్తాడు హాజం
నిజం చెపుతుంది ప్రగతి దర్శనం
ధ్వజం ఎత్తుతుంది ప్రగతి ఉద్యమం

తెగిస్తుంది పేదవానిగుండె బిగిస్తుంది కూలివాని పిడికిలి
తిరగబడ్డ బలిపశువే విరమించని బెబ్బులి

అందుకే సంఘటితమయ్యే కుచేల సైన్యాన్ని చూచి
హడలి పరిభ్రమిస్తుంది కుబేర వర్గాల దిక్సూచి
వాయిదా వేయడానికి అంతిమ సంఘర్షణ
వాళ్లు సూచిస్తారు కొద్దిగా సంస్కరణ
రుద్రాక్ష పిల్లులు తమ నేతృత్వం క్రింద
విద్రావణం చేస్తామంటారు దరిద్రాన్ని
కావిస్తూ ఉంటారు ఒకపక్క అత్యాశలపై సీలింగులు
సాగుతూనే ఉంటాయి నల్లబజారు డీలింగులు
ఎన్ని జన్మలకైనా ఈతడే నా భర్త
అన్న హైందవ శ్రీమంతురాలు
ఆస్తి సంరక్షణకై విడాకులదాకా
విస్తరించడంలో సామంతురాలు

పోయేనాడు వెంబడిరాదు నిజమే పూచికపుల్ల
పోతూ పోతూ కొడుక్కి ఇస్తాడు ధనికుడు ముల్లె
ధరలు ఆకాశానికి సరుకులు పాతాళానికి
శరవేగంతో సాగుతున్న చేటుకాలాన
శ్రీమంతుల ఉల్లాస పయనం సిమ్లా కొండలకు
సామాన్యుల జీవన గమనం చట్టుబండలకు
ఈ అభ్యుదయం చీమ గంగాయాత్ర
ఈ ప్రజాస్వామ్యం కేవలం కలవాళ్ళ జాత్ర
విసుగెత్తిన విద్యార్థి నీరసించిన నిరుద్యోగి
కడుపు నిండని కార్మికుడు చేనుపండని సేద్యగాడు

బతకలేని బడిపంతులు ఎదుగులేని ఎన్జీవో
ఇల్లు గడవని ఇల్లాలు పాలులేని పసిపాప
గుర్తిస్తారు ఎవరి ఊపిరి వాళ్ళే తీసుకోవాలని
గుర్తిస్తారు ఎవరి దరిద్రాన్ని వాళ్ళే తుడుచుకోవాలని

ఎందరో ఒకటైనప్పుడు
అందరూ పోరాడినప్పుడు
దరిద్రానికి నిష్క్రమణం
ధరణిలోనే సమతా స్వర్గం.

[ఆంధ్రజ్యోతి వీక్లీ
7-9-73

# తెలుసుకో

మాట్లాడతావు నువ్వు కూడా నా భాష
మరైతే ఎందుకర్థం చేసుకోవు నా హృదయఘోష

చింతా వృక్షం నుండి చీకట్లు తెంపి తెచ్చి
పంతగించి అంటించకు మధ్యాహ్నం గుండెలమీద
కలుషితం అయిపోతున్న ఈనాటి చల్లగాలి
కత్తుల తరంగాలై కలవరపరుస్తుంది రేపటి ఊపిరి తిత్తులు

నాటుతున్నావు ఇవాళ విషబీజాలు
నీ మీద మొలుస్తాయి చూసుకో చేదు నిజాలు

[ఆంధ్రజ్యోతి వీక్లీ
21-9-73

# ప్రశ్న

పాత పుస్తకాల నూతిలో బతికున్న తాంబేలూ
నూతన సూర్యరశ్మి నీమీద పడనే పడదు కాంబోలు

కొత్త కొత్త ఆశయాల తీరాలకు సాగిపోకున్నా తాబేలూ
బొత్తిగా నువ్వు సంప్రదాయ ద్వీపాలు చూడవు కాబోలు

ఇటేపు నర్తించే బొమ్మకు
అటేపు వర్తించే అక్షరాలు
తెలియకపోతే ఎల్లా! ఓ అల్లా!

[ఆంధ్రజ్యోతి వీక్లీ
28-9-73

# తప్పదు

అల్లిన కథలాగ, అట్టమీద బొమ్మలాగ
మల్లెపూల దండలాగ మనోజ్ఞంగా
చల్లగాలిలాగ సేద తీరుస్తూ
ఎల్లాగూ ఉండదు కదా జీవితం
పాటుపడ్డం తప్పదు
పరితపించడం తప్పదు
రెక్కలమ్ముకొన్నా డొక్క నిండదని
ఎక్కడపరచినగొంగళీ అక్కడే ఉంటుందని
తిట్టుకుంటూ, నిట్టూరుస్తూ
మట్టికొట్టుకుంటూ మళ్ళా మళ్ళా మళ్ళా
కష్టపడుతూనే ఉంటావు కదా
కష్టం నీకు కొత్తకాదు కదా!
ఇంకొంచెం కష్టపడు
ఈసారి నీకోసమే కాదు
నీలాంటి వాళ్ళందరి కోసం
నిట్టూర్చే అందరి కోసం
నీలాగ, నీకోసం వాళ్ళూ పాటుపడితే
అల్లిన కథలాగ, అట్టమీద బొమ్మలాగ
చల్లగా సొగసుగా రేపు ఉండకేం చేస్తుంది?

[ఆంధ్రజ్యోతి వీక్లీ
5-10-73

# కోరిక

వాడిపోవచ్చు
రాలిపోవచ్చు
అంచేత ఈ పువ్వు
తుంచేద్దా మనుకోకు
ఏ దూర తీరాల తుమ్మెదలు
ఎగిరి వస్తాయో చెప్పలేం
ఈ పువ్వులోని పరాగం తీసుకెళ్ళి
ఏ పువ్వుతో సరాగమాడిస్తాయో
ఇదో అదో
ఏనాటికైనా ఫలించవచ్చు
పండకపోయినా సరే
నిండుగా కన్నుల పండుగ చేయనీ
కురులలో కాదు
ఇరులలో వాడనీ
ఈ హృదయాన్ని.

[ఆంధ్రజ్యోతి వీక్లీ
12-10-73

# చివరకు మిగిలేది

జీర్ణ వస్త్రాన్ని విసర్జించినట్టు
జీవుడు వదిలిపెట్టాడొక దేహం
ఎన్నో హేమంత వసంతాల అనుభూతులు
కన్నీళ్ళ లాకులనుండి కార్చారు బంధువులు
హఠాన సంతాప సంరంభంలో
మమత గొంతుకలో కొట్లాడించి
అంతిమ యాత్ర మొదలయింది.
సంతాపం బరువైంది
చివరి మజిలి చేరుకొంది బొంది
చితి రగిల్చి ఇళ్ళకు మళ్లారు మంది
పంచభూతాలు పంచుకొనగా
అంచనాకు మిగిలింది మంచి

[ఆంధ్రజ్యోతి వీక్లీ
19-10-73

## పచ్చి పిచ్చి

ఆకాశంనుండి చుక్కలించుకొన్నట్టు
ఆ కళ్ళు కలకత్తాలో తళుకొత్తి
మిన్ను దిగుతున్న నన్ను
మేల్కొలిపి వెన్నుతట్టి
అలగా భావాల వింటికి
అమ్మగా నవ్విన నవ్వు
ట్యూబులైట్ల వెలుతురు
గాభరా పడినట్టు
ఝక్కరింతల
వెక్కిరింతల పూతలో
ఎంత చెడుపుకు అంత కూలి
ఎవరు పరుచుకొన్న పక్కమీద వాళ్లు పడుకోక్కని
ఈ పురమాయింపుల యింపుల దునియాలో
ఈ పద్యం కిరాయికి పరాయి.

[ఆంధ్రజ్యోతి వీక్లీ
16-11-73

# తన్మయం

నరాలలో నల్లపులులు
కరాళ నృత్యం చేస్తున్నప్పుడు
నీలికళ్ళ కవర్లకు నిదుర జిగురు
నీళ్ళు వేసే ప్రయత్నం మంచిది కాదు.
చిటారు కొమ్మలదాకా వేసిన
నిటారు నిచ్చెనలమీద
బులబాటం ఎక్కినప్పుడు
అలసట అడుగునుంచి గోతులు తవ్వరాదు.
కళ్ళనుండి కావిరి
అయిపోవాలి ఆవిరి
నిలువునా కొరడు బారిన నిట్టూర్పులు
నులివెచ్చని మచ్చికలతో గిలిగింతలవాలి
నిదుర మబ్బులు చెదిరిపోయి
మెదడులో నీరెండ కాయాలి
అంతరంగంలో హంసలు
వింత వింత సొగసులు పోతున్నప్పుడు
కళ్ళ ప్రమిదల్లో
కావ్యాల వొత్తులు వెలగాలి!

[ఆంధ్రజ్యోతి వీక్లీ

# తథ్యం

అదృశ్య హస్తాలని అంటున్నావే, గాని
అవి స్పష్టంగానే కనబడుతున్నాయి చూడు!
ఆ చేతులు
అనేకానేక రీతులు
అవి నోట్లు లెక్కించుకుంటాయి నల్లబజారులో
అవి సీట్లు దక్కించుకుంటాయి తెల్లహుజూరులో
అసహాయులను నులిపేస్తాయి తమ గుప్పిట్లలో
అవినీతిని దువ్వుతాయి తమ మునివేళ్ళతో
అవి పెట్టిస్తాయి దొంగ సంతకాలు
అవి పుట్టిస్తాయి రంగు పుకార్లు
అభాగ్యుల గళాలు నులిమి నులిమి నులిమే
ఆ హస్తాలు చిట్టచివరకు తమ గొంతుకలే
నులుము కొంటాయి కచ్చితంగా
నిలకడమీద నామాట తేలుతుంది.

[ఆంధ్రజ్యోతి వీక్లీ
8-3-74

# అంతే!

భావకేదారాలు
జీవనాధారాలు
ఎండి పగుళ్ళు వేసినా ఈ నాడు
పండకపోలేదు ఒకనాడు
నీ సొంత గదిలో నింపిన తలంపులు
ఆ సుక్షేత్రంలో పండినవే సుమా
ఎవరు పట్టారో ఊహల నాగళ్ళు
ఎవరు దున్నారో ఇజాల మళ్లు
ఎవరు తీశారో అపవాదాల కలుపులు
ఎవరు కోశారో నినాదాల కంకులు
పండించుకు తింటున్నావు నువ్వొక్కడివే
దండించకపోదు మిగతా లోకం నిన్ను
ఎండి పగుళ్లు వేసినా ఈనాడు
దండిగా పండకపోవు ఒకనాడు
జీవనాధారాలు
భావి కేదారాలు

[ఆంధ్రజ్యోతి వీక్లీ
22-3-74

# ఔనా?

నిండినప్పుడు నీ తలపులు
గుండె గుబాళిస్తుంది
నిన్ను కలగంటున్నప్పుడు
నిదుర పరిమళిస్తుంది
అలనాటి విషయాలు అలలైతే
మలయ మారుతాలు వీస్తాయి మనస్సులో
ఈనాటి ఎడబాటు బరువై అదిమితే
ఎదలోన మొగలి రేకులు గుచ్చుకొంటాయి
రేపటి కలయికకై చూపులు త్వరపడితే
రేకు సంపెంగలు టోకున నవ్వుతాయి
నీ కురులలో మిళితమైన కురువేరు
నా కోరికల నరాలకు కొత్త మత్తు ఇస్తే
సువాసనల సీమల్లో
నివాసం చేస్తుంది వలపు
అనుబంధాన్ని మించిన
సుగంధం లేదు, సుకృతం లేదు.

[ఆంధ్రజ్యోతి వీక్లీ
12-4-71

# ప్రార్థన

డైనమోలు ఉంటాయి కొందరిలో
డైనమైట్లు ఉంటాయి కొందరిలో
మరణించేదాకా
మానవులు బతుకుతూనే వుంటారు.
కీ ఇచ్చినంతకాలమే
కీలుబొమ్మలు తిరుగుతూ ఉంటాయి
మీట నొక్కగానే
ఆటోమేటిక్‌గా ఆవేశపడతారు
యంత్రాలకు ఎవరో పన్నే
తంత్రాలు ఎలా తెలుస్తాయి
వీళ్ళంతా వీళ్ళంతా
ముళ్ళ చక్రాలు
ఒకరినొకరు ఒరుసుకొని వుంటారు
ఒకరి కావేషానికందరూ తిరుగుతారు
డైనమోలు పీకి పారెయ్
డైనమైట్లు నీళ్ళబొక్కెనలో ఉంచెయ్
మహనీయా! ఈ
మనుష్యులలో హృదయాలు పెట్టు!

[ఆంధ్రజ్యోతి వీక్లీ
26-4-74

## పిలుపు

నింగి అధరం మీద
తొంగి చూస్తున్న చిరునవ్వులాంటి వెలుగు
నున్నని పయోధరాల నిగనిగ అనువదించినట్టు
మిన్నులు పడ్డచోట సన్నని తళతళ
చల్లగాలిలో వెచ్చని పాట
జాజిపూలలో జ్వరంలాంటి తహతహ
పిలుస్తున్న కళ్ళలో
తెలుస్తున్న కామనలు
పడవలు విశ్రమిస్తున్నప్పుడు
పడమర జేవురిస్తున్నప్పుడు
తాతలనాటి రాతిశిల్పాలు
తమలో తాము ఆలపిస్తున్నప్పుడు
మ్రోళ్ళు చిగురించినట్టు
మురిపించే పచ్చని చిలకలు ఎండుకొమ్మలపై
పాటకచ్చేరీ చేస్తున్నప్పుడు
కట్టుకొన్న పిచుక గూడు
కడలి మింగితే నాకేం?
అలకన్నా కల గొప్పది.

[ఆంధ్రజ్యోతి వీక్లీ

# అగ్రతాంబూలం

అగ్రతాంబూలం ఇవ్వాలి
అర్హులెవ్వరో చెప్పండి
దేశనిర్మాతలు, నేతలు భాగ్యనిధాతలు
ఆశయాలు సాధించిన వాళ్ళు అమోఘ చరితులు
అందరూ మహానుభావులే ముందుగా స్మరించదగ్గవాళ్ళే
అగ్రతాంబూలం ఇవ్వాలి
అర్హులెవ్వరో చెప్పండి

అదిగో తొలివిడెం అనగానే
అగ్రులు చాస్తున్నారు
అన్నిటికీ ముందుకొచ్చే పెద్దలు ప్రబుద్ధులు
శాసకాధికార క్షేత్రాన్ని స్వంతమాగాణిగా
తరతరాలుగా పరులచే దున్నించే కామందులు
పర్యవసానంగా పదవి లభిస్తుందంటే
ప్రజాసేవకు నడుంకట్టే శ్రీమంతులు
అవినీతి అమ్ముల్తో ఆకాశానికి నిచ్చెనకట్టి
అందని ఆనందాల మేఘాల్లో కాపురం పెట్టిన ఘటికులు
అవకాశవాదులు అనన్య సామాన్య నటనాధురీణులు
అహర్నిశలు మంచివాళ్ళలా కనిపించే ఆగర్భ పరిపాలకులు
అంకితాలు పుచ్చుకోడానికి
శంఖు స్థాపనలు చెయ్యడానికి
పుంఖాను పుంఖాలుగా ఆవిష్కరణ మహోత్సవాలకు
అలవాటు పడ్డవాళ్ళు

అందరూ అందరూ వస్తున్నారు ముందుకు
ఆమడదూరంలో ఉంచాలి వీళ్ళను ఒకందుకు

స్వాతంత్ర్య సమరాల్లో సర్వస్వం పోగొట్టుకున్న వాళ్లు
జనుల అభిమానంతప్ప వేరే ధనం లేనివాళ్ళు
నీతిపరులు నిస్వార్థులు నిన్నమాత్రం ప్రముఖులు
నేడు అద్దంలోకూడా ముఖం చెల్లని దరిద్రులు
ఏ మారుమూలలనో ఉండకపోరు నిన్నటి నిజాయితీపరులు
ఈనాడుకూడా లేరని చెప్పలేం అటువంటి నేతలు

స్వలాభాలనుకోరే అనుచరులతో
సంఘటిస్తున్న న్యాయవాదులు
సామాన్యుల మాన్యుల చేయమనికి
ప్రయత్నిస్తున్న సవ్యకారులు
దరిద్రాన్ని బహిష్కరించడానికి
ధర్మాన్ని సమధర్మం చేయడానికి
నిరంతరం పోరాటం సాగిస్తున్న నేతలు ఉన్నారు అంటారు

అయితే
ప్రజవెనుక నడవందే ఏ నాయకుడేది సాధించాడు ?
పదిమందీ కలసిరాకపోతే ఏ దేవరు సాధించారు ?
వ్యక్తులకు కాదు ప్రజాశక్తులకే పురస్కారం
ప్రజలలో ప్రగతి వర్గానికే తొలినమస్కారం
ఏ వర్గం అభ్యుదయ మార్గం విరచిస్తున్నది
ఏ వర్గం అభినవ స్వర్గం సృష్టించబోతున్నది
ఏ వర్గం దేశానికి వెన్నెముక లోకానికి జీవగర్ర

ఏ వర్గం అందిస్తున్నది మననోటికి బువ్వ
ఆ వర్గం విషాదానికి రేపు నిసర్గం
ఆ వర్గం సంతోషానికి ఇంక మహత్సర్గం
ఆ వర్గం సామ్యవాద విధానాల సంసర్గం
ఆ వర్గమే వహిస్తున్నది శుభోదయానికి ప్రాతినిధ్యం
అందుకే శ్రామికవర్గానికి అందిస్తున్నాను ప్రథమాంజలి
అందుకే వాళ్ళను పరిష్కరించమంటున్నాను
తరతరాల నెంజిలి

ఆహ్వానిస్తున్నానుగాని నాకు తెలుసు వాళ్ళిక్కడ లేరు
అవును వాళ్ళకీ సత్కారాలు అక్కర లేదు
ఎక్కడో శ్రమిస్తూ ఇక్కడ
ఈ పండగ దీపాలు వెలిగిస్తున్నారు
ఇక్కట్లు తాము సహిస్తూ మనకు ఆనందం ఇస్తున్నారు
నదులను మళ్ళిస్తున్నారు నవసాగరాలు సృష్టిస్తున్నారు
నవ్వులను పండిస్తున్నారు నందనవనాలు నిర్మిస్తున్నారు
ఉక్కును ధిక్కస్తున్నారు
ఉత్తుంగ నౌకలు నింపుతున్నారు
కలిమిని తయారు చేస్తున్నారు
లేమితో మూలుగుతున్నారు

మందహాసాలు తప్ప మరేమీ ధరించని సుందరాంగులతో
అందాలు తప్ప యింకేమీ తిన్నా
అరగని ఆనంద లాలసులు
చలువ గదులలో సుఖించడానికి
మండుటెండలో మాడుతున్నారు కొందరు

అంబరాన్ని చుంబించే మహోన్నత సౌధాలు
పగలంతా కట్టి
ఆరుబయట రోడ్డుపక్క అర్ధాకలి నిద్రలోన
పీడకలలు కంటున్నారు కొందరు
మురికిపేట ఇరుకుల్లో పురుగుల్లా
ఎరువుల్లా మాడిపోతున్నారు
కొందరు కిమ్మనకుండా ఉన్నారు
కొందరు సమ్మెచేస్తున్నారు
కట్నం లభించని మావగారు
మొగుడూ పెళ్ళాలని విడదీసినట్టు
కార్మికుడికీ ఖార్ఖానాకీ ఎడబంధాల లాకౌట్లును
నవకోటి నారాయణులు ప్రకటిస్తున్నారు
దరిద్ర నారాయణులు ఇంట్లో పడుకొనే పస్తు
పరిశ్రమించవలసిన చోట్ల పడుకొంటున్నారు
విభిన్న కార్మిక సంఘాల రాజకీయాల తిరగలిలో
విపన్నులై ఖిన్నులై నలిగిపోతున్నారు కొందరు
గూండాల ఇటుకరాళ్ళను సోడాబుడ్లను
సైకిలు గొలుసులను
గుండెధైర్యంతో కొందరైనా ఎదుర్కొంటున్నారు
జులుం లాఠీ దెబ్బలకు బలంలేదని చాటుతున్నారు
జులాయి నాయకం మన్యుల
నిజాయితీరాయితీ బయట పెడుతున్నారు
భాష్పవాయు ప్రయోగంలోనైనా కార్చని కన్నీళ్ళను
భార్యా బిడ్డలకోసం విడిచి పెడుతున్నారు
బాధలను గుణపాఠాలుగా మార్చుకొంటున్నారు

భవిష్యత్తుకై తమ కళ్ళను అంకితం చేస్తున్నారు
ఆ కళ్ళలో కనబడతాయి
ఆదిలో అడవులు కొడుతున్న దృశ్యాలు
ఆదిలో ఊళ్ళు కడుతున్న దృశ్యాలు
ఆశలు ఆయుధాలుగా మారుతున్న దృశ్యాలు
అందరి కలయికా ఆశలని జయిస్తున్న దృశ్యాలు
ఉత్పత్తి సాధనాలు
ఉమ్మడి సొత్తుగా ఉన్న బంగారుకలలు
ఉపాధీ ఉత్సాహం ఉల్లాసం
అందరికీ ఉన్న ఆదిమ సమాజాలు
వేరువ సరకుల మీద చీకటి గొసెనలు తీసే హస్తాలు
వినోదం వికాసం అనురాగం మమకారం
కడుతున్న నేస్తాలు
దళారీలు దగుల్బాజీలు వడ్డీవ్యాపారులు పుట్టనియుగాలు
కళ కలవారి సొత్తుగా గుత్తగా మారని జగాలు
ఆ కళ్ళలో కనిపిస్తున్నాయి మళ్ళా నిజమయే స్వప్నాలు
ఆ కళ్ళు మౌనంగా చెప్పుకుంటున్నాయి
అన్నా కూలన్నా
నిన్నటిదాకా నువ్వు వేటకాడు తరుముతున్న లేడివి
కాదంటే నువ్వో పందెం కోడివి
అన్నా కూలన్నా
నిన్న గతించింది
నేడు ప్రత్యూషానికి స్వాగతం చెప్పే తొలికోడివి
ప్రతిపక్షవర్గాల దుర్గాలపై మెరుపు దాడివి
నిన్నూ నన్నూ భయపెట్టి
కొరడా జడిపించేవాడిని నిలబెట్టాలిరా

నిర్భయంగా వాడితో చెప్పాలి
ఒరే కొరడావాడా!
నిన్నటిదాకా నువ్వు మా మెడమీద కాడివి
లేదంటే నువ్వో పాకం జీవిడి
ఒరే కొరడావాడా
అణగదొక్కుతున్న నీ ఇనుప కాళ్ళని
అందరం మా ఉక్కుపిడికిళ్ళతో విరక్కొడతాం
నువ్వెంత? నీ కొరడా ఎంత? దాన్ని పట్టిన నీ చెయ్యెంత?
ఓటుతో మారుస్తాం యీ సమాజాన్ని
లేదా పిడికిలి పోటుతో తొలిగిస్తాం
ధనికవర్గాల హజాన్ని
నల్లరేగడిలో హాలరాములు
మిల్లుల్లో బలరాములు
కదలి వస్తున్నారు కటకటాలు విరుస్తారు
కవాటాలు తెలుస్తారు
కలిమిని జాతి పరం చేస్తారు
శాంతినీ క్రాంతినీ కలుపుతారు
స్వాతంత్ర్య జనకుల ఆశయాలు సార్థకం చేస్తారు
ఈ భావాలు రావాలు చేస్తున్నాయి
నేటి శ్రామికుల కళ్ళలో
ఈ సత్యాలు నృత్యం చేస్తున్నాయి
వందనంగా ఎత్తిన వాళ్ళ పిడికిళ్ళలో
ఆశయసాధనకు అగ్రగాము లవుతారు వాళ్లు
అవి సిద్ధించాకనే అగ్రతాంబూలం పుచ్చుకుంటారువాళ్ళు
అప్పుడే అప్పుడే దానికి వాళ్లవుతారు అర్హులు!

[1974 ?

# కదులు

రేపటి పద్యం
ఈపూటే రాసెయ్
రేపటి వాద్యాలు
నీ పద్యం వినిపించ గల్గినప్పుడు
వైకుంఠ వాకిళ్ళు నేడే
నీ కవనం తెరవ గల్గినప్పుడు
నేటి నీ సేద్యాలు
కోటి పంటల కుప్పలు రేపు వేయగల్గినప్పుడు
డేగలకూ, రాబందులకూ
నీ గళం నిగళం కాగల్గితే
పావురాల శ్రేయస్సుకు నీ పాట
స్థావరం కాగల్గితే
ఆలపించు! ఆలపించు!
ఆవేశం ఆలపించు
నడిపించు! నడిపించు
వడివడిగ జనాన్ని నడిపించు
తెల్లారేసరికి కష్టాలు
తెల్లారి పోతాయి
అతిరేకం
వ్యతిరేకం కాదు.

[ఆంధ్రజ్యోతి వీక్లీ
10-5-74

# ప్రకృతి

ఏమైనా ఆమనికే బాగా తెలుసు
ఏ మైనా ఏ రాగం ఆలపించాలో
ఏ గండు కోయిల పండుగ పాట పాడాలో
ఏ రెండు హృదయాలు ఒకటి కావాలో
పువ్వులెప్పుడు నవ్వాలో
పులకింత లెప్పుడు కలగాలో
మసక మసక చీకట్లూ
మల్లెమొగ్గలూ ఎప్పుడు నేస్తం కట్టాలో
ముసిముసి నవ్వులూ గుసగుసలూ
మునివేళ్ళతో ఎప్పుడు కలవాలో
ఇసుక తిన్నెలమీద చిరుగాలి
కొసరి కొసరి ఎప్పుడు ప్రసరించాలో
పండువెన్నెల కడలి తరగలకు
వెండి మలామా ఎప్పుడు పూయాలో
మొయిలుపరదా వెనుక జాబిలి
మొగమెప్పుడు చాటు చేసుకోవాలో
ముద్దొచ్చే అమాయకత్వం
ముచ్చటైన పాశవికంగా మారేదెపుడు
అనురాగం అతి తారస్థాయికి చేరే క్షణం
ఆమనికే ఏమైనా బాగా తెలుసు.

[ఆంధ్రజ్యోతి వీక్లీ
31-5-74

# జోస్యం

పువ్వుల్ని తుంచే వాళ్ళకి
పుణ్యం జమ కడతావు
నవ్వులు పంచే వాళ్ళని
నువ్వు ఖైదులో పెడతావు
బద్దలు కాబోతున్న అగ్ని పర్వతంమీద
పోలీసు కానుకొని పరిపాలిస్తున్నావు
బడుగుపేదల రక్తంమడుగు బడబానలం
ఉడుకెత్తే లావా నిన్ను ఊడ్చిపారేస్తుంది.
ముళ్ళకి మృదుత్వం నేర్పేవాళ్ళు
ముందు ముందు రాబోతున్నారు
ముష్కరులూ తస్కరులూ లేని లోకం
ముందడుగు వేస్తూ వస్తోంది! మూర్ఖుడా! చావు!

[1974

# విరూఢం

మిన్నులో ఉన్నది కాదంబిని
కన్నులో ఉన్నది కాదంబరి
ఆకాశానికి ఆవేశం వచ్చినప్పుడు
ఆ కంట్లో అవకాశం దొరుకుతుంది
ఎన్ని కల్పాలు గడచినా మిన్ను మారలేదు
ఎన్ని కల్పనలు చూచినా నా కనుపాప చిటిపాప
పొలగరుసులో సైరికుడు చెమటోడ్చినప్పుడు
పొలికలనులో సైనికుడు తలవాల్చినప్పుడు
మిన్ను కురుస్తుంది నా కన్ను తడుస్తుంది
ప్రేయసీ ప్రియులు విడిపోయిన వేళ
పడమటి కెంజాయ నల్లబారే వేళ
నల్లని యిరులకోసం నల్లని కురులకోసం
తెల్లని మల్లియలు విచ్చుకొనే వేళ
చీకటి చెట్లమీదకు చిలుకలు చేరే వేళ
ఆకలి కడుపులుకోసం అమ్మలు వండే వేళ
కురిసే మిన్నులోంచి తడిసిన కన్నులోంచి
మన్నుమీద పారుతుంది మందాకిని
పెన్నులోంచి విరుస్తుంది బృందావని

[ఆంధ్రజ్యోతి వీక్లీ

?

# పద్యంకాని పద్యం

నినాదాలు మతం కాదు
నీతిలోన హితం లేదు
నీ కోసం నా కోసం
నేతలు చెప్పే మాటలు
నిన్నా నేడూ రేపూ
అన్నా అన్నన్నా వాళ్ళే అనుసరించరు

నువ్వూ నేనూ ఛస్తే
నవ్వుకొనేది నవ్వేది ఎవరంటావ్
నిన్నూ నన్నూ పురిగొల్పే
నేతలు మాత్రమే

పాతవి చివికిన నీతులు
ఈ తరాన్ని కాపాడవు
నూతన సంకేతాలను
తాతలు గుర్తించలేరు

నువ్వూ నేనూ వ్రాస్తే
పువ్వుల చరిత్రలో ముళ్ళుండవు, కత్తులుండవు
నిన్నూ నన్నూ రాయనివ్వరు
నిజం పేననివ్వరు నేయనివ్వరు
నిజం నేతకు శత్రువు.

[1974

# పెద్ద విషయం మీద
# చిన్న పద్యం

వెలుగుతున్న సూర్యుడు
వెల వెల పోతున్నాడు
అయితే ఇంకో భానుణ్ణి పట్రా
అంటే నువ్వు చేస్తున్నది కుట్ర?

నేటి సూర్యుడు తప్పకుండా,
ఓటమితో క్రుంగుతాడు
ఉద్గీథి నుండి రేపు ఉదయిస్తాడు.
ఉద్రిక్త తరుణ భాస్కరుడు

ఇప్పుడు మొదలెట్టాలి చీకటిపై దండయాత్ర
చెప్పు! ఏమిటి ఇందులో నీ పాత్ర?
కలం విప్పు గళం విప్పు జనంవైపు బలం తిప్పు
నిజం చెప్పు భుజం కలుపు హాజంమీద ధ్వజం ఎత్తు
కారాగారంతో కరచాలనం చెయ్యి
కర్మాగారం విజయం సఫలం చెయ్యి.

# రాక్షస విజయం

కాలువనీళ్ళలో కాగితం పడవలు
కాలప్రవాహంలో కవనాల కడవలు
వైముచెట్టుపై ఉగాదుల చిలవలు పలవలు
రైముచేస్తూ రాయాలి వీటిపై ఎన్నితడవలు

చెట్లు చిగురు వేస్తున్నప్పుడు
జీవితాలు ఏం చేస్తున్నాయి
కొమ్మలు మొగ్గతొడిగినప్పుడు
నమ్మకా లేంచేస్తున్నాయి
ఆ మొగ్గలు విచ్చుకొంటున్నప్పుడు
ఆదర్శా లేమంటున్నాయి
మూడు పువ్వుల్లో ఏవొక్కటీ కాయనప్పుడు
ఏడుస్తున్న కళ్లు ఏంచెప్తున్నాయి
వెళ్ళిపోయిన ఏడాది మళ్ళించిందా మగత
వస్తున్న ఏడాది తెస్తున్నదా నవత
గతించిన ఉగాది గతాశల ప్రోది
ఏతెంచే ఉగాది తేవాలి అమ్ముల పొది
సంధించాలి మనం రామబాణాలు
సంరక్షించాలి శతకోటి బక్క ప్రాణాలు
అధికారక్షేత్రాలు నేడు అవినీతి తాణాలు
అందించు ప్రజలకు ఆదర్శాల శిరస్త్రాణాలు

తలవిరగబోసుకున్నాయి చీకట్లచెట్లు
త్రైతక్కలాడుతున్నాయి ఇక్కట్లజట్లు
పడగవిప్పుతూంది పాసిస్టు విషసర్పం
బుడగ కప్పుతూంది లేపెస్టు సుడిగుండం

అలజడివానలో అంటుకున్న
ఆర్ టి సి బస్సులు క్రిక్కిరిసిన రోడ్లు
నెలజీతం పెంచమంటే
యిల్లాలి మెడలో లాకెట్‌లా లాకౌట్ బోర్డు
వేదికలమీద అవినీతి, వేదికల కింద నాటు బాంబులు
వివేకరహిత విన్యాసాలలో విధ్వంసశక్తుల టాంకులు
తల్లి పెదవిమీది చిరునవ్వులు జప్తుచేసిన షైలాకులు
పెళ్ళాం మానభంగం కళ్ళారా తిలకించే నవీనపాండవులు
అక్రమాలు భరించలేక విక్రమించే విప్లవధ్వనులు
వక్రబుద్ధులు పన్నిన పద్మవ్యూహంలో
విక్రమించిన అభిమన్యులు
అజ్ఞాతంగా ఆయుధం అరణ్యావాసం చేస్తున్నప్పుడు
ఆకాశంలో కురవనంది అలవాటులేని మేఘం
ఉద్రేకపడుతున్నవాడా వద్దయ్యా భృగుపాతం
ఊరికే వ్యర్థంకారాదు త్యాగాల రక్తపాతం

ఎలమావికొమ్మలమీద ఎర్రఎర్రని చిగుళ్లు
ఎదలోమాత్రం ఎన్నెన్నో పగుళ్ళు
కిరాణాకొట్టుముందు జనం కిటకిటలాడుతుంది
రవాణామాత్రం చాలా రహస్యంగా సాగుతుంది

మీసాలు తిప్పిన నేపథ్యవర్తకులపై 'మీసా'లు
మిథ్యాకారాగారవాసాలు ఫలితాలు లవలేశాలు
యథావిధిగా సంచరిస్తున్నది నల్లధనలక్ష్మి
అదేపనిగా కళ్లు మూసుకున్నది కల్ల రాజ్యలక్ష్మి

మిన్నులు పడ్డచోట మొన్న మొలకెత్తాడు భాస్కరుడు
కన్నులు నులుపుకొని ప్రవేశించాడు కాలపురుషుడు
రాక్షసుడా? ఈ వచ్చినవాడి పేరు?
దాక్షిణ్యరహితంగా భక్షించడమా వీడి తీరు

మొగంమీద దోపిడీ లాభాల రక్తచందనం పూత
లలాటాన సేటస్కానిలిపే రక్తాక్షరాల రాత
జేబులోకి కొల్లగొట్టిన నల్లడబ్బుల చేరవేత
వీడావీడా మనపాలిటి క్రొంగొత్త దౌర్భాగ్య విధాత

అవును వీడు బూర్జువా ఆర్థికాసురుడు అనర్థాల దానవుడు
అయినా వీడు తగిలించుకొన్న కరాళంపేరు మానవుడు
కర్మాగారాలు కార్మికుల శ్రమఫలితాల గాదెలు
కరపట్టణాల రేవులు, కమర్షియల్ తావులు
భాగ్యాల దిగుడుబావులు బ్యాంకుల కర్పూరదీవులు
ప్రతి వ్యాపార క్షేత్రం వీడి చేతుల్లోనే ఉంటుంది
అంతేకాదు అదృశ్యహస్తాలతో ఈ రాక్షసాధముడు
సొంతంగా ప్రతి లుచ్ఛా వ్యాపారం
సొంతం చేసుకొంటాడు
జూదగృహాలు పానశాలలు, పడుపుకొంపలు
షోకిళ్ళాసామానుల దిగుమతి పంపులు
ప్రచారసాధనాలు ప్రతిస్పర్ధ ఇంధనాలు

ప్రతిష్టంభన బీగాలు ప్రధ్వంసంలో నానామార్గాలు
అవకాశాల ఆకాశాలకు లంచాల నిచ్చెనలు
అధఃపాతాళ గంగ చేదే భ్రష్టాచారపు బొక్కెనలు
అన్నీ అన్నీ వీడిచేతుల్లోనే ఉన్నాయి
ఆయుధాలు చేతపట్టినవాళ్ళు వీడిచేతుల్లోనే ఉన్నారు
సన్నకారు బొచ్చెల్లో మటుమాయమైన పట్టెడు
అన్నంమెతుకులు వీడిగుప్పిట్లోనే ఉన్నాయి

ఏవడు ? ఏ దైవాంశసంభూతుడు వస్తాడు
ఎవడి చేతుల్లో ఈ రాకాసి చస్తాడు ?
ముప్పయిమూడుకోట్ల దేవతలున్నారు లెక్కకు
చెప్పుకుంటే సిగ్గు తప్పుకున్నారందరూ పక్కకు

కరుణించని దేవతలు కన్నీళ్ళయినా తుడవనప్పుడు
కనికరించే ఇంకో రాక్షసుడు కొనమళ్ళిస్తే మేలు
వజ్రాన్ని వజ్రంతోనే కోసిచూద్దాం
బూర్జువా రాక్షస సంహారానికి
పునీతసామ్యవాద 'బూచి'ని పిలుద్దాం
దొంగవ్యాపారాలతో దొరలైనవాళ్ళ కళ్ళకు
దోపిడీదారులనే దొడ్డప్రభువులుగా కీర్తించేనోళ్ళకు
కార్మికుల కడుపుకొట్టి కలవారైన వాళ్ళ కళ్ళకు
కష్టజీవుల వీపుల నిచ్చెనపై కైలాసమెక్కిన కాళ్ళకు
ఉత్తుత్తప్రోనోట్ల చక్రవడ్డీతో పేదల అస్థులూ ఆస్తులూ
మొత్తం కబళించిన పెత్తందార్ల మిడిగుడ్లకు
నకిలీసరుకులు ఉత్పత్తిచేసే నవకోటినారాయణులకు
అసలు సిసలు విప్లవపథికుడు రాక్షసుడిలాగే ఉంటాడు

విద్యార్థి వివేకి విరామమెరుగని యోధుడు
విమలభారతవీరుడు విశాల ప్రపంచపౌరుడు
తనప్రాణాలను తృణంగా భావించి ఇచ్చేవాడు
తన ప్రజల జీవితాలు మెరుగుగావించి మెచ్చేవాడు
పౌరసత్వపు హక్కుల అయిదూళ్ళైనా ఇవ్వనట్టి
కౌరవసేనపై పాంచజన్యం పూరించిన సంగరకిరీటి

ఇతడా? ఇతడా ఈ రమణీయ సామ్యవాద రాక్షసుడు
ఇతడు ప్రపంచ ప్రజాసమరాల వారసుడు
రావయ్యా రాక్షసా జనం లెమ్మంటోంది
రణం ఇమ్మంటోంది జయం తెమ్మంటోంది
కార్మిక శక్తుల్ని సంతరించుకొని వేగరా
విద్యార్థి శ్రేణులను వెంటపెట్టుకొని కదలిరా
వీరగంధం పూసుకున్న విప్లవయువకులతో వెడలిరా
విమోచనంకోసం త్రిలోచనాన్ని విప్పిరా
కూకటివేళ్ళతో ఈ కుహనాసమాజాన్ని కొట్టి
ఆకలిలేని వెట్టిలేని ఆదర్శసంఘాన్ని సమకూర్చు
నీవు నిర్మించే సంఘంలో శిశువులు పాలులేక చావరు
నీవు స్థాపించే ధర్మంలో పశువులు పెత్తందార్లు కాలేరు
పట్టెడు మెతుకులకోసం మగువలు పడుపువృత్తికి జారరు
చిట్టెడు గింజలకోసం దరిద్రుడు చెయ్యిచాపడు
ఏడాదికి మూడు పంటలు అందరికీ పిండివంటలు
ఎక్కడా ఉండవు కడుపుమంటలు
ఎప్పుడూ మోగుతాయి జేగంటలు
సమసంఘ నిర్మాణసంఘంలో ఈ ఉగాది హోమవేది
దానిని ప్రబోధించి కీర్తించే బాధ్యత నాది.

[—1975

# విభావ కవిత్వం

మూగవోయె గళము, మూసినాడ కలము;
గోడ గోడకిపుడు కోటి చెవులు;
నేను మీటు పాట నెచ్చెలీ! కొనగోట
గుండె గోడమీద గండరింతు.

వీణ బ్రద్దలాయె; వేణువు చిల్లైను;
నాగసారము కాలనాగమాయె!
వేసుకొన్న బొమ్మ వెక్కిరించెడి వేళ
చిత్రశిల్పి కుంచె శత్రువాయె.

మునపటి మధుశాల మనకింక చెరసాల.
తొల్లిటి విరిబాట ముళ్ళదారి;
చీడ పురుగు దొలిచి, చెట్లన్ని కృశియించె
చల్లని పొదరిల్లు వల్లకాడు;
కొమ్మమీద యిపుడు కోయిల కనరాదు
గండు తేటిచూడ కానరాదు;
పురిని విప్పి నెమలి పులకించి ఆడదు;
కర్ణపేయమగునే కాకిగోల?
పిల్లగాలులన్ని విషపూరితములాయె
శ్వాస పీల్చవిపుడు నాసపుటలు
పుస్తకాలలోన పుటలన్ని తెల్లన
నల్లనాయె చెలియ కల్లబ్రతుకు

ఎవ్వడెవ్వ డెవ్వ డెవ్వడో రాకాసి!
చెలియ గొంతునిపుడు నులుమసాగె;
స్వేచ్ఛగళము తాను ఛేధించగా లేక
పొలతిమెడను త్రెంపెపొగడ దండ

బాపురన్నది మది భావవీచిక లేక;
దేవులాడె చెలిమి దేవి లేక;
ఎడద తుమిలె నిన్ను ఎడబాయగా లేక!
సకియ పాడుచుంటి చావ లేక!

ఆపవోయి ఆపు ఆర్ద్ర ఈక్షిత
అభ్యుదయ కవితల నాలపించు!
విప్లవమ్ము నీదు వెలలేని ప్రేయసి
పట్టినావదేల భావ కవిత.

మంచి కవితయొక సమస్యగా మారెను
"దీని భావ మేమి తిరుమ లేక"
అనుచు నిన్ను నీవు అడుగుట మేలయా
విశ్వదాభి రామ వినురవేమ.

[ఎమర్జెన్సీలో 1975

# కదిలించకు లోహ విహంగాలను

ఎందుకు రాయమంటావు నన్ను
ముందుకు రావడం ఇష్టం లేనప్పుడు
చందనం చంద్రుడనివ్వా లయినప్పుడు
కుందనం విలువ కోలుపోయినప్పుడు
నట్టనడి వీధిలో పట్టపగలు
ఏ పురాతన తారకనో రేపు చేస్తున్నప్పుడు
ఏ పాతకాల పాతకుల్నో మాపు చేస్తున్నప్పుడు
ఎందుకు రాయమంటావు నన్ను
నా జేబులో లేదు పెన్ను
నా చేతిలో లేదు గన్ను
నా ఈ స్థితి ఏమిటా, మాగన్ను.

[ఎమర్జెన్సీలో 1975]

# ప్రగతి

ఆదిలో ఈభూమి నీదిరా
నీ దారియే మన పునాదిరా
కలసికట్టుగ నాడు బతికితే
వెలితి అన్నది లేదు వెతికితే

వాడలో వాళ్ళంద రొక్కటి కా
లేదు ఎంతటివాడు ఎక్కటి
ఒకడు చంపిన మెకం మందిదే - ఏ
ఒకడు ఆకలితోడ ఉండడే

జంటకట్టుట జాతిపంటకే ఉంది
జతనిర్ణయం స్వేచ్ఛ పెంటికే
ఏ ఒకడు కారాదు ఒంటరి
ఒంటరైతే వాడు తుంటరి

పడతి మగవానితో సమమురా తొలుత
పడతి పెత్తనమే ఘనమురా
మాతృస్వామ్యము నీ పథమురా
మాతృపూజే నేడు మిగిలెరా

కులములన్నది నాడు లేవురా, నరుల
గుణములో తేడాలు రావురా

తెగలు తెగలుగ నాడు బతికినా నీతి
తెగ తెంపులవలేదు చితికినా

నీ సృష్టిరా ప్రథమ సేద్యము
నీ చలువరా ఆది వైద్యము
కాయకష్టము నీ మతమురా
కలసి బ్రతుకుట అభిమతమురా

నీవు కాలేవురా సోమరి – పరుల
కలనైన దోచవు ఏమరి
నీకు తెలియును బ్రతుకు సారము
తెలియనిది వడ్డీ వ్యాపారము

నీ సంఘమే మొదటి సంఘము
దానికొచ్చెను పిదప భంగము
దేశద్రిమ్మరి గుంపు వచ్చెరా ఎన్నో – పర
నాశనమ్ములు తాను తెచ్చెరా

తండ్రి పెత్తనమున్న గణములు నేడు
కేంద్రమైనవి వారి గుణములు
హెచ్చుతగ్గులు ఉన్న గుంపులు – వారు
తెచ్చిపెట్టిన కొత్త కంపులు

ఉన్నాయి వాళ్ళలో కులములు, ఆ
కులములకు మూలము బలములు
కాయకష్టము చేయుటన్న – కడు
హేయమని భావింతురన్న

కఠినచిత్తుడు వాళ్ళ ఆద్యుడు
కౌటిల్యమున వాడు ఆఢ్యుడు
కయ్యమంటే అటే మొగ్గెను – నీ
కండబలమును చూసి తగ్గెను

నీ వాడపక్కన గుంపు నిలిపెను నీవు
ఆదరించగ పొత్తు కలిపెను
నీ జాతికన్యలను కూడెను అంత
ఊడిగపు సంతు సమకూర్చెను

నీ భూములను ఆక్రమించెను నీ
ఆచారముల ఈసడించెను, చీల్చె
ఏకబంతిని తినే జాతిని, నిల్పె
బూకరింపుల కొత్త నీతిని

గుడి తలుపు నీ ముందు మూసెను – తల్లి
ఒడినుండి నిన్ను పడ దోసెను నీ
వాడపక్కన వాడ కట్టెను – నిన్ను
వెలివాడలోనికే నెట్టెను

నీ కాయకష్టము మీద బతుకును
నిన్ను కలిమి మూపును చేసి పితుకును
నిన్ను సేవ లెన్నయినను అడుగును
నీవు కుట్టిన చెప్పు తొడుగును

చెప్పునకు పట్టమ్ము కట్టెను, ఆ
చెప్పుతోనే నిన్ను కొట్టెను

కొడుకు చేతికే ఇచ్చె పరశు అయ్యో
కొట్టించెనే తల్లి శిరసు

అయ్యవారవు అన్న చాలు
కొయ్యమనెరా బొటన వ్రేలు
చదువు సంధ్యలు నీకు తగవట – నీవు
చదువు కొంటే పెద్ద తగువట, వాడి
చదువు విన్నా గొప్ప దోషం, నీ
చెవులలో పోశాడు సీసం

తొలగించి ఆర్థిక స్థోమత, నీకు
కలిగించె దాస్యంపు మగత
ఎక్కనీయడు నిన్ను అంగళ్లు
తొక్కనీయడు ఇంటి ముంగిళ్ళు
నిన్ను అంటితే పెద్ద పాపం – నీవు
ఇచ్చావు జాతికో శాపం

పరధర్మ్ములకు ఆతిథ్యము ఇక
పారతంత్ర్యము మనకు తథ్యము
కట్టి కుడిపెను నీదు పీడనం
గట్టిపడెరా పరపాలనం – పర
దేశీయు లెందరో వచ్చిరి
బానిసత్వము మనకు ఇచ్చిరి
ముగిసినది దాస్యంపు తిమిరం
చేశావు దానికో సమరం

నీకు జరిగిన అన్యాయము
బాపితే గెలుచుట న్యాయము

నిన్ను మనిషిగ తిరిగి పెంచగ
బలము వచ్చెను తాళ్ళు తెంచగ
దేశమయినది సుస్వతంత్రము ఇక
మాసిపోవునులే కుతంత్రము
నీకు సైతము వచ్చె ముక్తి
తెలుసుకోరా మీదు శక్తి
ఆర్థికంగా వెనక పడకు – పార
మార్థికంగా సిగ్గు పడకు
హక్కులున్నవి నీకు కనరా, జాతి
బొక్కసం తెరిపించమనరా
నీకు పెడితే ఇపుడు మదుపు నీవు
అవుతావు పెన్ పాడి కదుపు
హీనంగ చూడకు ఎవరినీ, స
మాన మని ఎంచరా జనులని
మాల మాదిగ లొక్కటనరా,
ఏకబంతిని బువ్వ తినరా
భీమబల యుతువడవని తెలియరా, జగ
జీవనము దారిలో కలియరా
వెలుగుబాటల భావి కనరా
జీవ వాహినిలోన మనరా
ఎన్నాళ్లు వెలుగునో అరుంధతి
అన్నాళ్ళు నీకింక ప్రగతి

# జైల్లో చంద్రిక

కాలం మారింది కథ మారింది
కలంలో సిరా మారింది
గొంతు ఎండింది కొమ్మ ఎండింది
గుడిసెలో ఒక కడుపు మండింది
పొగరెక్కిన ఫాక్టరీ త్రేన్చింది
సగం సగం జీతాలు నాన్చింది
నిక్కి ఎగురుతూంది నిలువునా జెండా
నక్కి నక్కి చూస్తునాడు నల్లవిపణి గూండా
ఇదిగో పులి ఇదిగో పులి అడేతోక
ఈ మాట నమ్మవచ్చు అనుమానం లేక
ముఖం చూసినప్పుడే యిది నిజంగా ఆవు
నఖాలు చూస్తే దెబ్బవేస్తే చచ్చిన చావు
చీకట్లు క్రమ్మాయి చిక్కులూ క్రమ్మాయి
ఆకాశ మధ్యాన రెండు మబ్బులు కమ్మాయి
వెన్నెల వస్తుందా వెలుగులు తెస్తుందా?
ఉన్న చెరసాల కిటికీ లోంచి ఊరడిస్తుందా ?

[ ఎమర్జెన్సీలో
1976 (?)

# ఉదకం నా పథకం

రైళ్ళు సరిగ్గానే నడుస్తున్నాయి; ఆఫీసుల్లో ఫైళ్ళు సరిగ్గానే నడుస్తున్నాయి. నల్లసొమ్ము దర్పాలు 'మీసా'లకు జడుస్తున్నాయి, విష సర్పాలు కుబుసాలు విడుస్తున్నాయి.

ఇందులో చెప్పాలి కొన్ని సెహభాషులు
ఇంతతో ఆగిపోయేవాళ్ళు అల్ప సంతోషులు
ఇది మరచిపోలేని చరిత్రకు ప్రారంభం
ఇది మహదాశయాల సంరంభం

ఆసన్నమవుతున్నది అతి వినూత్నయుగం
అందుకు వేచియున్నది ప్రజ ఆసేతుశీతనగం
చెప్పిన మాటలు చెయ్యడానికిది తరుణం
తప్పకుండా తీర్చుకోవాలి ప్రజాఋణం

పెంచుకోవాలి ప్రతి ఒక్కడూ వైదగ్ధ్యం
మించిపోవాలి, బోధించాలి కర్తవ్యం
ఈ మహా యజ్ఞంలో ఎవరైనా ఇంధనం
ఈ యోగ సమాప్తికి ఏ ప్రచారం సాధనం

ఖాతాలో జమకట్టిన కాగితం పద్మాలు
ఉత్తా కల్పిత తంతు సద్మాలు
కనుక ఏమిటి ఫాయిదా
కావాలా కొత్త ఖాయిదా?

వింశతి అంశాల వేడికిరణాలు ధరించి
విధిగా ఉదయించమనండి సూర్యుణ్ణి
వింశతి అంశాల ఆశంసల మయూఖాలతో
వెన్నెల కురిపించమనండి చంద్రుణ్ణి

గొంతెత్తి గొప్పగా నినదించే స్లోగన్లు
కొండలు రెక్కలమీద కెక్కించుకోక తీరదు
ప్రయాణం ఏదైనా పవిత్రమనుకొంటున్నప్పుడు
ప్యాసింజర్లు ఆశయాల బోగీలో 'లుగళబారదు'

గాలిలో (శ్రీ)పాదధూళిలో శైశవ కేళిలో
జోలిలో, పచ్చిపసుపాళిలో శకునాల తాళిలో
కట్టుబాటును దట్టించడమే కావాలి అలవాటు
కటకటా ఎవడురా ఎవడి దృష్టిలో ఇది పొరబాటు

శాసించబడగలదా ఏనాడైనా ప్రకృతి
భాసించి కాగలదా గరీబీ నిష్కృతి
అని ప్రశ్నిస్తున్నది సంశయాత్మ
అందుకు బదులు చెప్పాలి కావ్యాత్మ

అనుశాసించబడుతున్నది ఈనాడు ఏతత్ ప్రకృతి
అది ఘోషించి ప్రతిఫలిస్తుంది యావత్ మత్కృతి
ఇందులో స్థానం చేసుకుందా వ్యంగ్య చమత్కృతి
ఎందునా సీరియస్ నెస్సే ఆక్షుద్ర కవిత్వం ఆకృతి

గాంభీర్యం కారాదు కాదు మేకపోతు గాంభీర్యం
సామ్యవాద సంస్థాపనకు కావాలి హిమవన్నగ స్థైర్యం
దేనికైనా ఉండాలికదా ఒక పథకం
దీనజన త్రాణంలో నా ఆదర్శం ఉదకం

అందరూ తాగుతారు మంచినీళ్లు
కొందరికి మాత్రమే తెలుసు దాని మేళ్లు
ఆశయాల అన్నం లేకపోయినా బతకవచ్చు
నియమాల నీళ్లు లేనిదే బతకలేవు

ఉదకం ప్రపంచపు శోణితం, దాని ప్రాణపవనం
ఉదకానిది పురోగమనమే కాని కాదు తిరోగమనం
ఉర్వీజనులందరూ ఉదకంనుంచి పుట్టినవాళ్లే
ఉంటుంది ప్రతి దేహంలో ఎనభై పాళ్లు నీళ్లే

ఉదకం సర్వచరాచర పదార్థాల మూలస్థానం
అదేకదా సకల జీవనసారాల ఆదిమ నిలయం
ఉదకం ఉదారశీల, నిర్మల, విమల,
పాప ప్రక్షాళనాలోల, బహుళప్రద.

అది చొచ్చుకుపోలేని తావులేదు
అది ధరించలేనట్టి రూపులేదు
ఆకాశం నుండి హరజటాజూటానికి
అక్కడనుండి అనవరత హిమ నిలయానికి
శీతాద్రి నుండి భూతలానికి
భూతలంనుండి భూరి సముద్రానికి
పాదోధి నుండి పాతాళానికి
స్వేచ్ఛగా పయనించే ఉదకానిది
వివేక భ్రష్ట సంపాతం కానేకాదు, కాదు, కాదు

స్వార్థ పరులే పైపై పదవులకు ఎగబడతారు
స్వార్థ రహితమగా ఉదకం కింద వర్గాలవద్దకు దిగివస్తుంది
నేర్చుకొంటే చాలు ఈ ఒక్క సుగుణం
మార్చి పారేయవచ్చు ఈ సమాజ గమనం

సాగిపోతున్న జాతీయ జీవ(త్ప్రవాహం
సైరిస్తున్నది అడుగడుగు వి(ద్రోహం
ఈదుతున్న చేప ఎంత నీరు తాగిందో చెప్పలేం
మీదనున్న మహనీయులు ఎంత లంచం తిన్నారో చెప్పలేం

ని(దపోతున్న చేప నిండుకన్నేప్పుడూ మూయదు
ము(దాధారకులు కూడా ని(దలో కన్ను మూయరు
ఎం(డకాయల్లాగ రాజులు పితృభుక్కులు
తం(డివైపే చూస్తున్నాయి ఫాసిస్టు దృక్కులు

జలచరాల స్వభావాల (పతినిధులు
ఇలలోనూ ఉన్నారు బృహస్పతులు
సాధారణ (పజల చదివింపులు కొల్లగొట్టి
సాగుబడి సాగర గర్భాన దాగలేరు సోమకులు

ఎత్తుతాడు సగటు మనిషి మత్స్యావతారం
విత్తుతాడు లోకంలో సామ్యసంఘ బీజం
వస్తుందా వచ్చేసిందా విప్లవ జల(పళయం
రావాలి రాకమానదు ఆ మహత్తర శుభదినం

తప్పనిసరి ఉప్పెనగా నింగెత్తు కెరటాలతో
గొప్ప బీదా తారతమ్యాలను ముంచెత్తే ఘోర్షుతో
గంగావతరణం నాటి బహుభంగుల ధ్వానాలతో
రంగోత్తుంగ అభంగ తరంగ మృదంగ నాదాలతో
వస్తుంది వస్తుంది సాంఘిక జల(పళయం
చస్తుంది చస్తుంది నిజమైన ఫాసిస్టు జగజ్జనం

జనులారా నేను అభినవ నోవాను
వినిర్మిస్తున్నాను అభ్యుదయ నావను
జనసందోహంలోని శ్రామికుల కభయం
జంతుజాలంలోని మంచికిస్తాను ఆశ్రయం
పీడించేవాళ్ళకు పిసినార్లకు పిరికివాళ్ళకు
తాడితుల శవాలపై తాడెత్తు పీఠాలెక్కినవాళ్ళకు
ఒకటి చెప్పి మరొకటి చేసే కుటిలాత్ములకు
వికట భావన రచనకు పీటలైనవాళ్ళకు
చెయ్యరాని ఇజాలకు చెక్కభజన చేసేవాళ్ళకు
తియ్యతియ్యగా గొంతులు కోసే తడిగుడ్డలవాళ్ళకు
బంగారం సింగారం ఏదైనా వ్యాపారమైనవాళ్ళకు
భటాచోర్లకు ముఠాదార్లకు నయా-ఫాసిస్టులకు
ఉండదు ఉండదు, నా నావలో స్థానం
రండి మొదలుపెడదాము ఆ ప్రస్థానం.

[ఆంధ్రజ్యోతి వీక్లీ
30-4-76

# కన్నీటి పాట

వికసించిన వేయి పువ్వులూ
విడుస్తున్నాయి మంచు కన్నీళ్లు
వీస్తున్న తూరుపుగాలి
విలపిస్తున్నది వెదుకు పొదల్లో మారి

అంతమైంది కామ్రేడ్ నీ లాంగ్ మార్చి
ఆరంభిస్తున్నాం మరో ప్రస్థానం చేయి చేయి చేర్చి

విప్లవం విందు భోజనం కాదన్నావు
వేయి పుష్పాలు వికసించనియ్యమన్నావు
నిత్య సమర శీలత్వంతో బాటు
సత్యం శివం సుందరాలు జోడించావు

మొన్న మనం భాయీ భాయీ
నిన్న పరిస్థితులు మారాయి
ఇవాళ మళ్ళా మన చేతులు కలిశాయి

నిన్న తిట్టుకున్నాం మనం పరస్పరం
అన్నవన్నీ మరచిపోదాం మనం మనం

ఎవరూ మరచిపోలేనిది నీ వ్యక్తిత్వం
మనిషిని మనిషినిచేసే మార్క్సిజంలోని మహాత్యం

నీవు పుట్టిన సమాజంలో నిలువెల్లా దైన్యం
నీవు పెరిగిన సంఘంలో ఎటుచూచినా హైన్యం

నీవు సేకరించిన ప్రజానీకం నిజమైన సైన్యం
నీ ఉపదేశం ఆదేశం ఏదైనా సన్మాన్యం

నీ కోసం విడుస్తున్నాను అశ్రుతర్పణం
నీ జీవితం కలకాలం విప్లవానికి దర్పణం

(మావో మరణం 9-9-1976)

[జ్యోతి మాసపత్రిక
'76

# చేదుసత్యాలు

తొలివేకువ ఘడియల్లో
తూరుపు నడిబొడ్డు కిందనుంచి
అరుణరేఖలు ఆవరిస్తున్న
ఆకాశం అంచుమీద అదిగో చూడు
అప్పుడే ప్రసవమవుతున్న నెత్తుటి కందులాగ
ఆదిత్యబింబం శీర్షోదయమయ్యాక, బయటపడ్డాక
ఆ వెలుగులబిడ్డ పురిటి కేకలాగ
అరిచింది ఐరన్ గొంతుకతో సైరన్

రెక్కల కష్టంమీద బతకడానికి
ఒక్కొక్క వర్కరూ గూడువదులుతున్నాడు
మెత్తని లాభాల పట్టుదూది పరుపుమీద
ఒత్తిగిలి ముసుగుతన్నాడు యజమాని

స్పృదించాలి ఉడుకు నెత్తురుతో నూతనహృదయం
అందమైనా నిందఐనా ఈ ఏడాది తొలి ఉదయం
మార్నింగ్ వాక్ నడుస్తున్నాయి కన్యాకుజోళ్లు
వార్నింగ్ దృశ్యాలు వీక్షిస్తున్నాయి ఎర్ర రేకళ్లు

కలవారి యిళ్లల్లో పాలకుక్కర్లు
గ్యాసు కుంపట్లమీద కూస్తున్నాయి
పొట్టకూటికి లేనివాళ్ళ గుడిసెల్లో
పొయ్యిలో పడుకున్న పిల్లులు లేస్తున్నాయి

ప్రభాతగానానికి లయవేస్తున్న చప్పళ్లు
శుభానిలాన్ని చెరుస్తూ చేస్తున్నాయి పాకీవాళ్ళ చీపుళ్లు
పొగ మంచు వెలుతురులో కలుస్తున్నాయి
సగం సగం లేచీ లేవని దుమ్మూ ధూళీ

ప్రత్యేక సంచికల్లో ప్రత్యేకంగా రాసిన
ప్రముఖ మార్గకవుల ఉగాది పద్యాలు ఇంకా తెరవలేదు నోళ్లు
చండప్రచండంగా పెద్ద కాఫీ హో టేళ్ళలో
పిండి రుబ్బుతున్నాయి మర రుబ్బురోళ్లు

పేవుమెంట్లుమీద జీవించే గంప సంసారాలు
ఆవులించి ఒళ్లు విరుచుకొంటున్నాయి
వార్నింగు దృశ్యాలను విశ్లేషిస్తున్నాయి ఎక్స్‌రేకళ్లు
మార్నింగు వాక్ కాళ్లు కొలుస్తున్నాయి. నేటికడగళ్ళు

చిత్తు కాగితాలూ చిన్న చిన్న సీసాలూ
బొత్తిగా పనిరాని చెత్తనంతా
ఏరుకొనడానికి భుజాన గోనె సంచులు
వీరోచితంగా ధరిస్తున్నారు పోరగాళ్లు

కొమ్ములమధ్య పాలవాళ్లు దూర్చిన తమ పెయ్యలను
నిమ్మళంగా మోసుకొంటూ ఇళ్ళకు మళ్లుతున్నాయి పాడిపశువులు
పేటలో అడుక్కో-నడానికి ముందు కూటంగా వాటంగా
పంచుకొంటున్నారు కష్టంబిచ్చగాళ్ళు
వారివారికి ఆనాటి వీధులు.

అరిగిపోయిన సుప్రభాతపు రికార్డులు
అస్పష్టంగా మేలుకొలుపులు ధ్వనిస్తున్నాయి
నడిచేకాళ్ళు గుర్తిస్తున్నాయి నగరవిన్యాసాలు
వడిగా ఎక్స్‌రేకళ్ళు చూస్తున్నాయి లోకదృశ్యాలు

కవిగారి కాగితంమీద శుకపిక శారికలు
కలకలారావాలు కమ్మగా చేస్తున్నాయి
రచయిత్రి నవలలో నాయికా నాయకులు
రమ్యంగా కాశ్మీర సరస్సులో విహరిస్తున్నారు

వెతుకుతున్నారు ఓపిక లేని యువకులు సద్యో
విప్లవంకోరుతూ అధికారం వెలువరించే తుపాకీ గొట్టాలు
వెతుకుతున్నారు సాగుచేసుకొంటున్న పేదలు
వెనక ఎప్పుడో స్వాధీనం చేశామన్న పట్టాలు

న్యాయవాదులకు న్యాయం లభించడంలేదు
అయ్యవార్లకు హామీలు నిలవడంలేదు
సాగిపోయే బస్సులకు చదువుకునే కుర్రాళ్ళకు సఖ్యత కుదరడంలేదు
సామాన్యులు ఊపిరి పీల్చుకొందికి క్షణం విశ్రాంతిలేదు

ధరలు పెరిగినా సిగరెట్లు ధగధగా కాలుతున్నాయి
ధరలు పెరిగిన సబ్బు బిళ్ళలు దబ్బున అరిగిపోతున్నాయి
ధరలు పెరిగిన టూత్‌బ్రష్‌లు ధారాళంగా తోమవు
ధరలు పెరిగిన కిరసనాయిలు డబ్బాలు విరివిగా దొరకవు

బడ్జెటు అంచనాల ఆదాయ వ్యయాలేమిటి ?
పంచాంగాలు గుణించిన కందాయఫలాలేమిటి ?
సింహరాశిలో గురువున్నప్పుడు శుభకార్యాలు బందు
సింహాసనంపై లఘువున్నప్పుడు అవినీతికి విందు

విపణివీధి ధరవర్లు ప్రకటించే దిన పత్రికలు
వెలువరించవు కొన్ని వెల్లడయిన మామూళ్ళు
ప్రమోషన్‌లు కెంత రేటు ట్రాన్స్‌ఫర్ కెంత రేటు
ఊఁ అనడాని కెంత రేటు ఊరుకోనడాని కెంత రేటు

విరగబడి పండుతున్నాయి బినామీ భూములు
విరగబడి నవ్వుతున్నాయి భూపరిమితి చట్టాలు
శుష్క ప్రియాలు పుష్కలంగా వినబడుతున్నాయి
శూన్యహస్తాలు దైన్యంగా కనబడుతున్నాయి

ఏ నేరం చేయని పేదవాడిని కొట్లో తోసేస్తే
ఏళ్ళుతరబడి కోరవచ్చు రిమాండ్
ఎంతో ఘోరం చేసిన ఘనకుమార రత్నం
ఇట్టే అడుగుతాడు ఏంటిసిపేటరీ బెయిలు డిమాండు

గాడ్ ఈజ్ గ్రేట్ అయితే డెవిల్ చాలా పవర్‌ఫుల్లు
ప్రేమ గుడ్డిదేగాని ద్వేషానికి మూడు రెళ్ళు ఆరుకళ్ళు
గతం గతించి భవిష్యత్తు ఉదయిస్తుందా సిద్ధార్థ!
గంపెడు ఆశయాలున్న భారతీయుడౌతాడా కృతార్థ

[1979

# అకటా! ఆకటా వికటం

అవగతంకాని గతంలాంటి దుస్స్వప్నం ఇది
అభిమతంకాని మతంలాంటి దుర్భరం ఇది
టీకా తాత్పర్యాలులేని కఠిన పద్యంలాంటి వ్యవస్థ
మోకాలుబంటి కన్నీటిలో మునిగిపోతారు పేదలు శాస్త్ర

ఇది పిశాచాలు ప్రారంభించిన మారణహోమం
ఇది నిచాచరులు సంచరించే అనైతిక ధామం
ఇక్కడ అంతరాత్మలు అతిచౌకగా అమ్మబడును
ఇక్కడ గెరిల్లాలు గూండాలుగా మార్చబడును

అంతరంగంలో సంతరించుకొన్న హరివిల్లు కరిగిపోయాక
ఎంతటి రంగస్థల మార్తాండుడైనా ఏడురంగులూ విడదీయలేడు
పన్నెండేళ్ళకోసారి వస్తుందంటారు పుష్కరం
కన్నుమూసి తెరిచేలోపున వచ్చేయవచ్చు ముష్కరం

కొండమీంచి అగాధంలోకే దూకుతూంది గోగ్రెలమంద
గుండెలోంచి గుండెలోకి నడవలేదు పికిలిపంద
ఎవడు కట్టగలడు ఇంకొక స్పందించే ప్రాణం విలువ
ఎవడైనా కొట్టగలడు కరుణాస్పదునికై మరో శిలువ

ఎందరెక్కినా ఇంకొకరికి చోటుండేదే పూర్వం పుష్పకవిమానం
ఇప్పుడు ఒకడెక్కితే ఇంకొకడు పడిపోవక తప్పని ప్రమాదం
మొదలెట్టిన చోటునుండి అడుగైనా కదలలేని ఈ ప్రయాణం
ఎదమెత్తనోటను ఎంత సొదగుందినా లాభంలేని కావ్యగానం

నవరసభరితమైన నాటకంకాదు నాలుగు స్తంభాలాట
నవ్యసంగీత కుర్చీలకోసం నానా రకాల పోట్లాట
ఊహారాజ్యరమ అలభ్యమేకాదు నేపథ్య వక్త
ఈహామృగంలాంటి ఈ ప్రక్రియకు ఎవడయ్యా ప్రయోక్త

కొండల రెక్కలను పూర్వం ఖండించేదట వజ్రాయుధం
దుండగీడుల దురాశలను కత్తిరించగలదా ప్రజాయుధం
ఇంగిత జ్ఞానమైనా కొనుక్కోవాలిప్పుడు నల్లబజారులో
ఇప్పుడీ సందేశం ఎలా వినబడుతుందీ నినాదాల హోరులో

ఆనకట్టలు బద్దలవుతాయి అనేకులు హతులై పోతారు
అయినా చీమకుట్టినట్టనిపించదు యేకులు మేకులౌతారు
కారుచీకటి కమ్ముకొంటున్న ఇది కరాళ నిరోధతరుణం
మారుమూల నా గుండెల్లో దాచానులే ఒక కరుణా కిరణం

# చెప్పొంచీ దేమిటంటే...

చింపేసిన కేలండరు కాగితాలు
నింపేసిన చెత్తబుట్ట వీధిలో
ఒంపేసిన తర్వాత మళ్ళా
పంపకు నా చిరునామాకు.

నిన్నంతా చీకటి సమస్య
నిన్న నిజంగా అమావాస్య
నేటి తిథి మాత్రం ప్రతిపత్తు
మేటి సమాజానికి ఇది విత్తు

ఇక్కడ ఎగిరే విహంగాలు
రెక్కలొచ్చిన ఖడ్గమృగాలు
ఇప్పుడు లేచే తరంగాలు
నిప్పులు చెరిగే భుజంగాలు

ఎన్నాళ్ళయ్యా చేతకాని నిట్టూర్పు
ఎన్నేళ్ళయ్యా ఈ చవట ఓర్పు
పస్తులుంటే తప్పదు మరణం
ప్రతిఘటిస్తే వీర మరణం

నినదించే వాడా నిదానించు
నిదురించే జబ్బు నివారించు
చావడంకాదయ్యా ఘనత
జీవింప చేయవయ్యా జనత!

చల్లగా నిండుతున్న గల్లాపెట్టె
కల్లలాడ నేర్చిన మొండికట్టె
కోరుకొంటాయా దొరగారి పైసలు ?
కూలివాళ్ళ కష్టానికి పైసలు!
ధరమీద నిలవనంటూంది ధర
వెలవెల పోయింది బతుకు వెల
జడిగా కురుస్తోంది అలజడి
వడి పుంజుకుంది క్రాంతి సవ్వడి
ఆకాశం ఎర్రబడింది మాపున
అమరవీరుల రక్తం ప్రాపున
అంతలో నల్లబడ్డవి రేలు
అవినీతిపరుల నల్లచే కాబోలు.
తరుణ ఎగరేస్తే తిరుగుబాటు జండా
దాని చాటున దాక్కుంటాడు గూండా
దొమ్మి లూటీ దోపిడీ కాల్పులు
కుమ్ములాటలో నగిలేది అల్పులు.
ఈ పోట్లాట కొందరికి పెట్టుబడి
ఈ పోరాటం కొందరి పీఢిబడి
ఇది చాలా మందికి అలసట
ఇది ప్రజల కవుతుందా బాసట!
ఆతరవాతేమిటి? వివరంగా చెప్పు
చెప్పడానికేముంది? బీటముడి విప్పు!
సరిపెట్టుకు పోవడం సంస్కారం
సరిదిద్దుకు సాగడం పరిష్కారం

[1980

# వెళ్ళు - మళ్ళీరాకు

నివురు కప్పిన నిట్టూర్పులు
నీరసించిన నెత్తావులు
యవనికలు దిగజారిన
ఆరుబయలు రంగస్థలాలు
రాత్రిని మడిచేసి
స్వప్నాల సంచీలో పెట్టుకొని
వేషాలు విప్పేసి రంగులు కడిగేసుకొని
నిష్క్రమించారు మహాజనులు
నిష్క్రమించారు నటీనటులు

నా దేశంలో నేను ఒంటరివాణ్ని ఆనాడు
ఆదేశాలకు లొంగనివాణ్ని ఏనాడూ

జిగిమంచు పొగమంచు తెరలతో
తెల్లవారు ఝాములన్నీ వేళ్ళాడదీసి
సానపట్టిన సాహిత్యఖడ్గాలు ఎంచుకొంటూ
వానవెలిసిన సంగీత వాద్యాలు నంచుకొంటూ
గత కాలాన్ని కత్తిరించి
మతి గేలాం కొనకు గుచ్చి
కలలకడలిలో వేసి కాచుకున్నా
పరిచయంకాని నీ పలకరింత వినబడింది
సిగ్గులేని నీ ముఖం సింగారంగా ధరించిన నవ్వు కనబడింది.

నిన్నెక్కడో చూసినట్టే వుంది
నిశీథంలో నిద్రలో
నెమరుకొస్తున్న పీడకలలో
నేస్తాల హస్తాలు అల్లిన వలలో
నిన్నెక్కడో ఎక్కడో ఎక్కడో
కన్నులు మూసుకొన్నా తెరిచినా
చూసినట్టే వుంది నీ మొహం
బోసినవ్వూ బోడిపిలకా
కావలసినంత కరుణా ఖద్దరుపంచా
కాంతి విరిసిన కళ్ళూ శాంతి కురిసే పెదవూ
అన్నీ జ్ఞాపకం వస్తున్నాయి
నిన్నెక్కడో చూసినట్టే వుంది

నినాదాలు ఘనీభవించిన
నీరవాల కెరళ్ళలో
కనీనికలు కాంచలేని
కాంతి సంవత్సరాల పెరళ్ళలో
లాఠీదెబ్బలకు విరిగిన వెన్నెముకలు
కనబడతాయి నీ కళ్ళ బావులలో
తూటా ఘాతలకు చిల్లులయిన ఛాతీలు
కనబడతాయి నీ గర్వ హాసాలలో
తగలబెట్టిన బట్టల గుట్టల పొగల వాసన
తనువునిండా నిన్ను అంటిపెట్టుకొని ఉంది.

ఎవరు నువ్వు? ఎవరు నువ్వు
ఎందుకా విలన్ నవ్వు?
అన్నట్టు నువ్వు ఆగస్టు పదిహేను కాదుకదా!
అఖిలభారత స్వాతంత్ర్య దిన మూర్తివేనా

ఆదిలో మేము జెండాలు ఎగరేసి
వేదికలెక్కి దండలు వేసి పండుగ చేసుకొనే
సగర్వ చూడామణివి నువ్వేనా
స్వాతంత్ర్య దినమూర్తివి నువ్వేనా?
అంతస్తుచాలని ఆత్మీయుడిలా
పంతగించిన పగవాడిలా
ఏక కాలంలో
ఏక సందర్భంలో
ఎందుకలా దూరంగా ఉంటావు
ఎందుకలా దుముకుతూ వస్తావు
ఓరి నీ అసాధ్యం కూలా
మారువేషం వేసుకొని వచ్చావా
మాట దక్కనందుకు మొఖం చెల్లలేదా
మా నాయకుల్లా నీకూ బహుముఖాలున్నాయా
సంకరమయ్య ఏటేటా వాహనాలు మార్చినట్టు
స్వాతంత్ర్యయ్యకు ఏటేటా మొగాలు మారుస్తారా?

అవున్లే! వెర్రిపీనుగులా వ్రిర పీగడానికి
అసలు నువ్వేం ఘనకార్యం చేశావుకనుక?
నిజంగా నువ్వు స్వాతంత్ర్యం తెచ్చావా
నిజంగా నువ్వు బానిసల్ని మానిసుల్ని చేశావా
ఎవరికోసం తెచ్చావు ఎవరికిచ్చావు

బక్కరైతుకిచ్చావా బడుగు పేదకిచ్చావా
పాటుపడుతున్నా సాపాటు పడని సగటుమనిషి కిచ్చావా
సమస్యల సంసారం ఈదలేని ఇల్లాలి కిచ్చావా
కుములుతున్న గుండెలతో కుంగిపోయే గుమస్తా కిచ్చావా

బతక లేని బడిపంతులికా
చావలేని శ్రామికునికా
నీడలేని నిరుద్యోగికా
ఆశలేని అభాగినికా
ఎవరికిచ్చావు? ఎవరికిచ్చావు?

త్యాగాలుచేసిన నిస్వార్థ పరులందరూ
తల్లి కడుపునపుట్టి తల్లి భూమిపై గిట్టి
కాలగర్భంలో కలసిపోయారు
కమ్మని కలలు పిడిచి పిండి భవిష్యత్తుపై ఆరవేశారు
నాడు తెచ్చిన స్వాతంత్రం
తోడు దొంగలపాలు చేశావు
పేద కాకుల్ని కొట్టి
పెట్టుబడిదారీ గెద్దలకు వేయమని
పెర్మనెంటు నాయకులకు
ధర్మహక్కుగా ఇచ్చావు
అరచేతిలో వైకుంఠం చూపెట్టి
గుప్పిట్లో కుంభకోణాలు ముయ్యగల వాళ్ళకిచ్చావు
దాదాలకిచ్చావు దగుల్బాజీలకిచ్చావు
దళారీల కిచ్చావు ధనస్వాములకిచ్చావు
మంత్రివర్యుల తాంత్రికుల కిచ్చావు
మాయదారి బాబాల కిచ్చావు.
అవినీతి ఊబిలో ఆశయాలు కూరుకుపోతున్నాయి
అవ్వ తీసిన గంధం సామెతలా అభివృద్ధి చాలదు
అత్యాచార వ్రతులకు అధికారిక కవచాలు
నిత్యావసర వస్తువులకు నీలి బజారు దుర్గాలు

ఆదర్శాల టీకాలు వేయించుకొన్నా
అంటువ్యాధిలా కరప్షన్ వెంట తరిమి సోకుతూంది
నీ రెండో పుట్టినరోజునాడు
నే నానాడే చెప్పాను
మనస్వాతంత్రం మేడిపండు
మన దరిద్రం రాచపుండు
వెళ్ళు మళ్ళా తే
వెళ్ళు మళ్ళా తే

తూర్పు ఎర్రబారేసరికి
ఓర్పు అగ్నిపర్వత మవుతుంది
మళ్ళా వచ్చేటప్పుడు
శూన్య దృక్కులు వద్దు
శుష్క వాక్కులు వద్దు
రిక్త హస్తాలకు
రక్త గంధాలు వద్దు

కావలసినవి తెస్తున్నట్టు
కాకిచేత కబురు పంపు
అన్నట్టు మరిచేపోయాను
అసలు సిసలు కాకి ఇప్పుడు కనిపించదు
కాకా పట్టేవాళ్ళు దేశంలో ఎక్కువైతే
కాకుల సంఖ్య తగ్గిపోక ఏమవుతుంది?
జనవరి ఇరవయ్యారు దగ్గర
నువ్వు తద్దినం పెట్టేవాడి తమ్ముడివే

ఇంక నువ్వు రాకపోతే ఫరవాలేదు
ఇంకిపోయిన కన్నీళ్ళనుంచి
మరుగుతున్న రక్తంలోంచి
ఎదురు దాడికి బెదిరిపోక
హత్యా రాజకీయాలకు
హతాశులు కానేకాక
నోళ్ళకు సీల్లు వేస్తే కళ్ళల్లో నెగళ్లు మండించుకొని
సంఘటిత ప్రజలు
సమధర్మపు బాటలో
స్వతంత్రం తెచ్చుకొంటారు
జనరాజ్యం నెలకొల్పుతారు.

[ఆంధ్రజ్యోతి వారపత్రిక
17-9-80

# ఇంక్విలాబ్ జిందాబాద్!

షాజహాను పెళ్ళాం సమాధిపేరు తాజ్ మహల్
షహీద్ భగత్ సింగు సమాధి తీరు తేజ్ మహల్
తాజ్ మహల్ కేవలం ఒకానొక వలపుల శిల్పం
తేజ్ మహల్ మాత్రం విప్లవకారుల శరతల్పం
తాజ్ మహల్ పేదవాళ్ళ ప్రేమను వెక్కిరిస్తుందట
తేజ్ మహల్ అధికార మదాన్ని ధిక్కరిస్తుందిట
తాజ్ మహల్ని పెకలించి పారెయ్యమన్నాడు బైరాగి
తేజ్ మహల్ని పదిల పర్చుకోమంటున్నాడు ఆరుద్ర
భాస్వరాన్ని ఎప్పుడూ నీళ్ళలో భద్రపరుస్తారట
భగత్ సింగ్ సమాధిని అందుకే నీళ్ళమధ్యనే కట్టారట
తాజ్ మహల్ గోడలపై పలువిధాల ప్రేమసూత్రం
తేజ్ మహల్ వేదికపై ఒకే ఒక్క విప్లవ మంత్రం. ♦

ఇంక్విలాబ్ జిందాబాదంటున్నది ఈ సమాధి
ఇంక్విలాబ్ కోసమే ఇట వేసినారు పునాది
రాజగురూ సుఖదేవూ భగత్ సింగు కిటూ అటూ
రాజయకీయ విప్లవాగ్ని రగిలించే దీచోటు

---

♦ సర్ ఫరోషీకి ఆజ్ తమన్నాహై దిల్ మే
దేఖా కితా్న జోర్ హై బఝూ – ఇ కాతర్ మే.

పరదేశం పాలనపై కత్తిగట్టె భగత్‌సింగు
పరవర్గ పాలనపై పోరాడును ఎర్రదండు
హరిత శ్వేత విప్లవాలు సాధిస్తే ఏం లాభం?
అరుణారుణ విప్లవమే భగత్‌సింగు చిరస్వప్నం.

(1981 సెప్టెంబరు ఇరవయ్యో తేదీనాడు సట్లెజ్ నదీతీరంలోని భగత్‌సింగు సమాధిని చూసినప్పుడు కలిగిన భావాలు.)

[ప్రజాశక్తి
4-10-81

# కుందుర్తీ! నీ కోసం ఇది
# నా వచన పద్య వ్యాసం

కడుతున్న తోరణాలు కడుతూనే వున్నాం
పెడుతున్న ముగ్గులు పెడుతూనే వున్నాం
అతని షష్ఠిపూర్తికి ఆంధ్రదేశాన్ని
అందంగా అందరం అలంకరిస్తున్నాం
అంతలోనే వచన పద్యం జెండాను
అవనతం చేయవలసిన అవసరం వచ్చిందా?
మంచి మిత్రుణ్ణి పొట్ట పెట్టుకుని
వంచించింది మనల్ని మృత్యువు

నయాగరాలా దూకుతూ వచ్చాడు
నగారాలా మోగుతూనే పోయాడు.
నగరం తన్ను మెచ్చుకుందని మురిసిపోయాడు
నగరంలో వానలాగా వెలిసిపోయాడు
ఛందస్సులను చెప్పుచేతల్లో పెట్టుకున్నవాడు
సౌందర్యానికి కడగొట్టు బిడ్డగా పుట్టినవాడు
"ఆయన పేరుకోసం రాయలేదు
ప్రయోగంగా రాశాడు"
"ప్రయోగాల పల్లకీ మీదెక్కి"
పయనించింది అతనిలో భావం

"ప్రయోగం ప్రయోగం కోసమే జరుగదు
ప్రతిభ మూడు పువ్వులారు కాయలై వికసించినప్పుడు

అధునాతన మహాకావ్యమేదో
ఆవిర్భవిస్తుంది ముమ్ముందు"
అని అన్నాడు, అన్నట్టుగానే రాశాడు.
"ప్రయోజనం తండ్రి, పరమసౌందర్యం తల్లిగా
పలికే ప్రతివాక్యం రసానంద కల్పవల్లిగా
నా దారి నాది" అని నినాదం వినిపించాడు.
తనదారి తాను చూసుకొన్నాడు.
మునుపోసారి ఒకానొకరోజు
మృత్యువు వచ్చి అతణ్ణి పిలిచిందట
ఎవరు నువ్వు అని ఎదురు తిరిగాడట

"అవతరించిన సత్యం వంటి ప్రసన్నమైన చిరునవ్వుతో
ఆమెవైపు చూసేసరికి అదేఃపోత" తిరిగి చూడదట
"దేవుడికి మారుపేరైన తెలివిలా చూసేసరికి
అదేఃపోత తిరిగి చూడదట"
ఇప్పుడు
తెలివి లాంటి చిరునవ్వుతో
దేవుడు ప్రసన్నమైనట్టు
సత్యంగా అవతరించి
చావు వైపు చూడలేదు కాబోలు
చెల్లీ వెళ్లోస్తా చరిత్ర పిలిచిందంటూ
వెళ్ళిపోయాడుగాని మళ్ళా రాడు.
గతంలోకీ కాదు, అనాగతంలోకీ కాదూ
వర్తమానం లాంటి వచన పద్యంలోకి వెళ్ళిపోయాడు
విశ్వనాథకు శిష్యుడైనా శ్రీశ్రీకి వశ్యుడైనా
వృత్తాలు నడిపించ గలిగినా

శబ్దాలు పలికించ గలిగినా
చెవికోసం చెప్పని పద్యానికి
ఛందస్సెందు కన్నాడు
కడుపులోని కవిత్వాన్ని నేరుగా
కాగితం మీదకి ఎక్కించేటప్పుడు
గణా లెందుకు ఛందోరణా లెందుకు
కంటితో చదువుకొనే కవితను
కరెంటులాగ ప్రసారం చేశాడు
మధ్య తరగతి ఉద్యమం ప్రచారం చేశాడు
వర్గ కలహం స్ఫుటంగా వర్ణించాడు
ఉన్నంతలోనే మిన్నంత విస్తరించాడు
వచనపద్యం వామనుడు కాడు త్రివిక్రముడన్నాడు
సామాన్య మానవుణ్ణి
సర్దార్ మానవుణ్ణి చేస్తానన్నాడు.
గుండెల్లో కాసే ఎండలో
అనుభవాల అద్దంముక్క పట్టుకొని
తెలుగు గోడలమీద
వెలుగు నీడలెన్ని ఆడించాడని!
వీథుల్లోనే విప్లవసైన్యాలు నడిపించి
వీచేగాలిలాగా "నా చేతి కలం"లాగ
ఆశల అశ్వాలమీద అగ్నివిహారం చేయించి
త్యాగానికి త్యాగం ఎలా నేర్పాడని!
ఆదిమ ఉద్యమాల గాయాలూ గేయాలూ
అడుగడుగునా ఎన్నిసార్లు తడుముకొంటూ
చిరునామా తెలియకపోయినా చిరంజీవివిప్లవాన్ని
పరామర్శిస్తూ ఎలా ఉత్తరం రాశాడని!

వాడినట్టు కనబడనీయకుండా
వాడి వేడి అంత్యప్రాసలు ఎంత బాగా వాడాడని
చెక్కినట్టు చిక్కకుండా చెప్పినట్టు కనబడకుండా
చక్కని మత్తేభ శిల్పాలు ఎలా తీర్చాడని !
రాను రాను ఆవేశాన్ని హాస్యంగా
రమణీయ భావాన్ని రసమయ వాక్యంగా
సామాజిక వ్యథను సగటుమనిషి కథగా
సామర్థ్యంతో ఎలా మలచగలిగాడని !
విశ్లేషణ చేస్తుంది సాహిత్య జగత్తు
విస్తుపోయాక తెలుస్తుంది అతని మహత్తు

భావం అభ్యుదయం, భాష వ్యావహారికం
ఉద్యమం మధ్యతరగతి, ఉద్దేశం ప్రగతి
ప్రఘంటు ప్రీవెర్సు వాహనం ఆశల హార్సు
తన కృషి నిర్విరామం ఫలశ్రుతి సమసమాజం

ఇవతలి గట్టున ఇంత శోధించి సాధించి
"అవతలగట్టున ఏ ముందో" అని
"అంబుధి మీద తెప్పగా తేలడానికి
అడుగున నిప్పులా మండడానికి"
వెళ్ళిపోయాడు ఈ లోకంలోంచి
వెళ్ళిపోయాడు క్రాంతిలోకి శాంతిలోకి
వెళ్ళిపోయాడు వెలుగులోకి

అయినా
"ఇంకా నేను సజీవున్నేనని యిక్కడి వాళ్ళంటున్నారు
ఇప్పుడే రావడం పడదు, ఇచ్చిన గడువు సరిపడదు"
అంటూ రగులుతున్న అతనిలోంచి మిగులుతుంది
అతని పద్యం
ఆమెన్ !

[గమనిక : కొటేషన్ గుర్తుల మధ్యవి కుందుర్తి మాటలే.]

[ఆంధ్రజ్యోతి డెయిలీ
31-10-82

# నూతన కాలజ్ఞానం

ఈ కొత్త ఏడాది మారువేషం వేసుకొని
వస్తున్న పాత ఏడాదే అన్న భయం లేకపోలేదు
ఎన్ని ఉగాదుల్ని చూడలేదు ఈ కన్నులు
ఎన్ని ఉగాదులపై పాడలేదు మన పెన్నులు
పేరు మార్పేగాని తీరు మార్పు
గోరంతయినా వుంటే ఒట్టు
నానాటికీ తీసికట్టు
కాల ప్రవాహంలో యే యేడాదైనా ఒక నీటిబొట్టు

కాలం అనాది, అనంతం, అఖండం
దాని గమనం ఎప్పుడూ ముందుకు మున్ముందుకు
కాలాన్ని ప్రవాహంగా లెక్కగట్టడం
కాలవిభాగాల్ని లాంఛనంగా లెక్కపెట్టడం
పుట్టి బుద్ధెరిగినప్పట్నుంచి
పురుషునిగా కాలాన్ని భావించడం
మానవజాతి స్వభావం
ఇది మగవాడి అహంకార ప్రభావం

మూఢాచారాల ముళ్ళచక్రాలు
తిప్పితే తిరిగే మర బ్రతుకులు
గాఢాంధకారంలో గానుగెద్దులు
కాలజ్ఞానాన్ని సంతరించుకోలేవు

వేల వేల వేల సంవత్సరాల
వేలావలయితనూ కాలస్వరూపం
ఏ కాలానికయినా పొడుగూ వెడల్పూ
ఎత్తూ అనే మూడు కొలతలుండవు
కాలం సాలీడు కడుపునుండి వచ్చే దారం
బాహ్య జగత్తులో కాలం స్తంభించడం వుండదు
మానసిక జగత్తులో అది ఘనీభవించవచ్చు
కాల పరిగణన ఇప్పటిదాకా మానసికమే
కనబడకపోయినా కాలం శూన్యంకాదు
ప్రకృతి మిథ్యకాదు ప్రపంచం కల్లకాదు

కాయకష్టం చేసేవాళ్ళకి కాలం నిత్యసత్యం
తేర తిండితినేవాళ్ళకి తీరుబాటు
తినమరిగిన దార్శనికులు వినువీధిలోనూ
రాచరికాన్ని త్రిశంకువులా నిలబెట్టారు

ఏడాదికో గ్రహం రాజట మరొకటి మంత్రట
ఫ్యూడల్ వ్యవస్థను సంరక్షించే మాయదారి భావ వాదాన్ని పాతిపెట్టి
కార్మికులు, కర్షకులు, కష్టజీవులు
నూతన కాలజ్ఞానాన్ని రూపొందిస్తారు
ఉదయాలు అస్తమయాలు
తారాగోళ నక్షత్ర సంభ్రమణాలు
కాలాన్ని కొలవడానికి పరికరాలు
ఋతువులు, అమావాశలు, ఋతుపవనాలు
సేద్యానికి శ్రమజీవనానికి ఉపయుక్తాలు
చదువురాని తెలుగు రైతు
చక్కగా గుర్తించగలడు

చుక్కల్ని వాటి లెక్కల్ని
మబ్బుల్ని వాటి తబ్బిబ్బుల్ని
పాటుపడితే లోటులేదని తెలుసు
పరాన్న భుక్కులకు చోటులేదని తెలుసు
వీరభోగ వసంతరాయలు వస్తాడని తెలుసు
విప్లవాన్ని తెస్తాడని తెలుసు
ప్రజలు తిరగబడతారు
ప్రభువులు ఒరగబడతారు
పుడమి తల్లికి విడుదల
ఫ్యూడల్ జైలుగోడల నుండి విడుదల
ప్రజలు గెలిచే నూతన వ్యవస్థలో
ప్రభవా విభవా శుక్లాల పేర్లెందుకు
ప్రాభావానికి వైభావానికి శౌకల్యానికి దార్లుంటేచాలు
నూతన కాలజ్ఞానం ప్రగతికి ప్రాణం
కాల ప్రవాహంలో ఏ ఏడైనా నీటిబొట్టు
దాని మారుపేరు శ్రామికుని చెమటబొట్టు

ప్రజాశక్తి
14-4-83

# జయహో!

ఆకాశంలో రాకేషూ!
అద్దిర! భళిరా! శహభాషూ
సైరా రష్యా మన దోస్తు
శాశ్వత మైత్రికి విజయోస్తు

అనంతమైనది ఈ విశ్వం
అయినా సైన్సు యువనాశ్వం
విశ్వరహస్యం ఒకనాడు
విడగొడతాడు మానవుడు

రోదసిలోనే చంక్రమణం
మేధకు నూతన సంక్రమణం
భారతీయుల సంరంభం
ప్రగతికి చక్కని ప్రారంభం

వ్యోమసీమలో ఒక భవనం
భూమిజనులకై తొలి సత్రం
ముగ్గురు అచటే వున్నారు
ముగ్గురు వారిని కలిశారు

గృహప్రవేశం చేశారు
గ్రహవిన్యాసం చూస్తారు
చదువులు భూమికి తెస్తారు
శాంతిని సంస్థాపిస్తారు

హిందీ రూసీ భాయీ భాయ్ !
ముందడుగేద్దాం పదపదవోయ్
కలలు ఫలించే శుభతరుణం
మొలకెత్తేసా సమధర్మం

[ఏప్రిల్ నాలుగో తేదీ రాత్రి పదకొండు గంటల తర్వాత
టెలివిజన్ చూశాక రాసిన గీతం.]

ప్రజాశక్తి
9-4-84

